UNP01 M 259 C

తెలుగు పలుకుల తియ్యదనాన్ని తెలియచెప్పే

# మాటల ముచ్చట్లు

డా॥ జి.వి. పూర్ణచంద్ BAMS

మనం తెలుగుని ప్రేమించడం కోసం
మనం తెలుగుని గౌరవించడం కోసం
మనం తెలుగుని ఆరాధించడం కోసం
మనం తెలుగులోనే మాట్లాడుకోవటం కోసం

UWP01 M259

# మాటల ముచ్చట్లు

Hi - 8.5
Wi - 5.5

డా. జి.వి. పూర్ణచంద్ BAMS

Ph : 0866 - 2436936




వి.యల్.ఎన్. పబ్లిషర్స్
బావాజీ పేట, విజయవాడ - 520 003.

# MATALA MUCHATLU

By
Dr. G.V. Purnachand, BAMS
Susrutha Ayurvedic Speciality Hospital
Satnam Towers, Opp. Buckinghampet Post Office,
Vijayawada - 520 002.

© Publisher

First Edition :
December 2003

Price :
Rs. 30 - 00

Title Design :
D. Ramakrishna Reddy
Vijayawada - 2

Type Stting :
Sree Sathya Saí Graphics
Ph. 0866 - 2434711

Printing :
Vasu Offset Printers
Vijayawada - 2 Ph : 2438324,

Publishers:
**V.L.N. Publishers**
24-11/2-15, Bavajipeta,
VIJAYAWADA -3.

# అంకితం

సాహితీ సుగతుడు

ఆచార్య తిరుమల రామచంద్రకు

ప్రాతఃస్మరణగా...!

# ముచ్చట్ల వరుస ఇది...

# "అందుకు చప్పట్లు"

భాష అనేది అతిచిన్నమాట. కేవలం రెండక్షరాలమాట. కానీ ఈ రెండక్షరాల మాటలో విశ్వమంతా ఒదిగి ఉంది. ఈ మాటంటే విచిత్రంగా అనిపిస్తోంది కదూ ? బీజంలో భూజముండడమంటే ఇదే. అతి చిన్న విత్తనంలో అతిపెద్దదైన మహావృక్షం దాగి ఉండటం.

ఆదిమానవుల కాలంలో అరుపులు, కూతలతో ప్రారంభమై, నాగరకతా ప్రస్థానంలో అనూహ్యమైన అలంకారాలు సంతరించుకుంది. ఒక స్పష్టమైన ఆకృతిని దిద్దుకుంది భాష. భావ వ్యక్తీకరణకు అత్యంత ప్రధానమైన వాహిక భాష.

భాషల మధ్య ఇచ్చిపుచ్చుకునే సంస్కృతి ఏనాటి నుంచో వచ్చింది. ప్రతి భాషకి హృదయవైశాల్యం ఎక్కువే. అంది వచ్చినన్ని ఇరుగు పొరుగు మాటల్ని తమలో కలుపు కుంటూనే ఉన్నాయి. ఎన్నో భాషలు ఒకదానినొకటి పరస్పరం ప్రభావితం చేసుకుంటు న్నాయని మనకి సులభంగానే అర్ధమౌతోంది.

భాషల ప్రభావంపైన, భాషా ప్రస్థానంపైన, భాష ప్రామాణికతపైన, భాషా శాస్త్రం పైన శతాబ్దానికి పైబడి పరిశోధనలు జరుగుతూనే ఉన్నాయి. పరిశీలనలసారం పుస్తకాల రూపంలో మనకి అందుతూనే ఉన్నాయి. భాషకు సంబంధించి, వందలాది పుస్తకాలు వచ్చేసిన తర్వాత ఇప్పుడు ఈ "మాటల ముచ్చట్లు" అనే క్రొత్త పుస్తకం ఎందుకు ? అనే సందేహం మనకి ముందు కలుగుతుంది. నిజానికి ఇది గొప్ప సాహసం కూడా. అయితే డా॥ జి.వి. పూర్ణచంద్‌గారు ఈ పుస్తకానికి ఎంచుకొన్న ప్రణాళిక గమనించగానే సందేహం తీరిపోతుంది.

మనం నిత్య వ్యవహారంలో అలవోకగా ప్రయోగించే ఎన్నో మాటల్ని జల్లెడపట్టి, వాటిలోంచి కొన్ని మాటల్ని ఎంపిక చేసుకుని తన సామాగ్రిగా సిద్ధం చేసుకొన్నారు రచయిత. ఇలా ఎంపిక చేసుకున్న మాటల పుట్టు పూర్వోత్తరాల గురించో, భాషా శాస్త్రపరమైన వాటి వ్యాకరణాన్ని గురించో, పొరుగుభాష నుంచి అవి నడిచి వచ్చిన వైనాన్ని గురించో ఈ పుస్త కంలో చర్చించారనుకుంటే మన ఆలోచన గాడి తప్పినట్టే. సరిగ్గా ఇక్కడే డా॥ పూర్ణచంద్ తన రచనాచమత్కార ప్రతిభను ప్రదర్శించారు.

నిర్మలమైన సరస్సులో ఒక గులకరాయిని విసిరేస్తే బుళక్కుమని మునిగి, ఆచోటను కేంద్ర బిందువుగా చేసి ఒకదాని వెంక ఒకటిగా నీటి వలయాలను సృష్టిస్తుంది. దాదాపుగా డా॥ పూర్ణచంద్ చేసిన పని ఇలాంటిదే. పాఠకుల మనఃసరోవరాలలో విసిరిన రాయి 'ఒకమాట'. ఆ మాట చుట్టూ ఏర్పడిన నీటి వలయాలే ఈ రచన. ధ్వని సమాంతరత్వం చేతనో, అర్థ సమానత్వం చేతనో ఒక మాట చుట్టూ ఆవరించుకున్న వలయాలను రచయిత ఇందులో చిత్రించారు. ఈ రచన చదువుతుంటే, ఒక విషయాన్ని చెప్పడానికి, రచయిత ఎన్ని గ్రంథాలు చదివి ఉంటారో ? ఎంత మంది పూర్వకవుల ప్రయోగాలను పరిశీలించి ఉంటారో ? అని మనకు ఆశ్చర్యం కలుగుతుంది.

ఒక్కొక్క మాట చుట్టూ ఒక మంచి వాతావరణాన్ని కలిగిస్తారు. అడపాతడపా, ఆ మాటల పూర్వ ప్రయోగాలు వివరిస్తూ వాటి రూపాన్ని, రూపాంతరం చెందిన విధానాల్ని రచయిత ప్రకటించేసి, మనల్ని కాసేపు ఆలోచనల్లోకి నెడతారు.

ఏదేమైనా ఈ "ఈ మాటల ముచ్చట్లు" చదివించే గుణం పుష్కలంగా ఉన్న పుస్తకం అని చెప్పుకోవచ్చు.

భాషా శాస్త్రవేత్తల మాటేమోగానీ, భాషాభిమానులు మాత్రం మహబాగా ఇష్టపడతారు.

'అడుగు'ని గురించి', 'గుండా'ని గురించి', 'నస' గురించి, గుటగుట మనిపించే 'గుటుక్కు' గురించి, 'దావా' గురించి చెప్పిన సంగతులు పాఠకుల్ని భలే ఆకర్షిస్తాయి.

ప్రఖ్యాతి మాటేమోగానీ, పేరుకూడా లేని ఒక పాత్ర "నిగమ శర్మ అక్క" తో మొదలు పెట్టి, అక్క గురించి ఈయన చెప్పిన సంగతులు ఆశ్చర్యం కలిగిస్తాయి. అక్కకు కొనసాగింపుగా అక్కల వాడను వివరించి విశ్లేషించడం అబ్బురపరుస్తుంది. అక్కలు, అక్కడం, అక్కుపక్షి, అక్కపెద్ది, వంటి వాటిని ఇక్కడ ప్రస్తావించడం, రచయిత విషయ సేకరణాసక్తికి సాక్షి సంతకం చేస్తాయి. మంచి పదం మలిన పదంగా మారిపోవడాన్ని ఆయన ఇదే సందర్భంలో ఉదహరించినప్పుడు "అవును సుమీ" అని పాఠకుల మనసులకి సహితం బాధ కలుగుతుంది.

గలగలా మాట్లాడటమంటే ఒక వాతావరణాన్ని ఏర్పరచడమే. అటువంటి వాతావరణం మాటల్లో ఏర్పడటం సులభం. రచనలో ఏర్పరచడం కష్టం.

'మాటల ముచ్చట్లు' అని పేరు పెట్టినందుకు ధ్వని సంబంధమైన వాతావరణాన్ని, అక్షర రూపంలోకి బదలాయించగలిగినందుకు రచయితకు అభినందన, పాఠకుల మధ్య ఈ ప్రయత్నం సఫలీకృతం కావాలని ఆకాంక్ష తెలియచేస్తున్నాను.

**– పోలేటి పార్వతీశం,**
దూరదర్శన్, విజయవాడ

# అడుగు

'వెడవెడ నడకలు నడచుచు నెడనెడ నడుగిడcగ...." అనే పోతన గారి పద్యం వామనుడు బలిచక్రవర్తి దగ్గరకు అడుగిడ్తున్న సందర్భంలోది - దానం 'అడగడం' కోసం.

అడుగు అనేసరికి అనేక అర్థాలు కనిస్తాయి. అడిగినకొద్దీ అర్థాలు పుట్టుకొస్తాయి.

అడుగు అంటే పాదం :

'అడుగు చెమ్మటలాడు' అంటే, అచ్చతెలుగులో విష్ణుమూర్తి అని !

సంస్కృతానికో, వేదభాషకో సంబంధించిన ఈ విష్ణువు పదాన్ని తెలుగులో చెప్పాలంటే, ఇలా కష్టపడి రూపొందించుకోవాలి. విష్ణువు పాదాలలోంచి గంగ పుట్టింది కాబట్టి. ఆయన్ని అడుగు చెమ్మటలవాడు - అని పిలిచారు. అడుగు వాక గలాడు అని కూడా అంటారు.

మనం అడుగు పెట్టగానే పోయిన కరెంట్ వచ్చిందనుకోండి మన అడుగు మహత్యాన్ని అందరూ హర్షిస్తారు.

"అడుగులానబెట్టి - చెప్తోన్నా..." అంటే, ఒట్టేసి చెప్తున్నానని...! పాదాల సాక్షిగా... అని !

అడుగులకు మడుగులొత్తే వారిని 'అడుగు గులాములు' అంటారు.

అడుగుతీసి అడుగు పెట్టలేనంత మంది జనం వచ్చారంటారు.

అడుగు తీసేశాడు అంటే, చేస్తున్నపని మధ్యలో వదిలేశాడని.

అడుగు తడబడితే, నృత్యప్రదర్శనే కాదు జీవితంలో ప్రతిదీ రసాభాసే అవుతుంది.

ఎన్నిట్లో 'అడుగు పెడతావయ్యా!' అనడుగుతాం... ఎందులోనూ పరిపూర్ణత సాధించలేనివాణ్ణి !

దుర్వాసుడూ, గౌతముడూ వంటి మహర్షులకు పాదాలలో కళ్ళున్నా యని,

వీళ్ళని 'అక్షిపాదులు' అంటారు. 'జ్ఞానదృష్టి' (Vision) కల్గిన వారనే అర్థంలో ఈ ప్రయోగాన్ని కల్పించి వుండొచ్చు. అడుగుకళ్ళు ఇవి !

అడుగే ఆయుధంగా కలది కోడిపుంజు. అడుగువాలు పులుగు అనీ, అడుగు గోదుమి అని కూడా దీనికి తెలుగులో పేర్లున్నాయి.

ప్రయాణం అడుగు అమడగా సాగుతోంది - అంటే, చాలా కష్టంగా సాగుతోందని.

ఏ పని తలపెట్టినా ముళ్ళుపడుతూ అనేక ప్రయాసలకు కారణం అవుతోన్నప్పుడు 'అడుగు ఆమడౌతోంది' అంటుంటారు.

కొత్త ఉద్యోగం అడుగామడగా వుందంటే, చెయ్యడం కష్టంగా వుందనే!

అడుగు తప్పింది కాబట్టి పిడుగు తప్పిందని, తమ అదృష్టాన్ని పొగుడుకుంటూ వుంటారు - తృటిలో ప్రమాదంలోంచి బైటపడిన వ్యక్తులు ! ఒక్క అడుగు ముందుగా వెళ్ళినా పెద్ద ప్రమాదం జరిగేదని దీని భావం. అడుగు దూరంలో వున్నాను కాబట్టి, బతికిపోయాననడం కూడా ఇలాంటిదే !

అడుగు భద్రం అంటే జాగ్రత్తగా, నిదానంగా వెళ్ళమని !

'అడుగు' పదాన్ని అడుగంతదూరం, అడుగంత పరిమాణం అనే అర్థాల్లో కూడా ప్రయోగిస్తారు.

"అచ్చివచ్చిన భూమి అడుగుడే చాలును" అని తెలుగు సామెత.

పతి మాటకు 'అడుగు' తప్పని భార్య అంటే, ఏమాత్రం వ్యతిరేకత లేకుండా భర్త మాటకు అనుకూలంగా ప్రవర్తించేదని !

పతిమాటకు నడుగుదప్పక సతులకు ననుకూల బుద్ధిఁ జరియింపఁ దగున్-" అని స్త్రీలకు మాత్రమే సద్బుద్ధి కలగాలని రుక్మాంగద చరిత్రలో కవిగారు కోరారు.

'అడుగు' అంటే, అడుగున వుందని. కిందిది, అథోభాగం, మూలం - ఇలాంటి అర్థాల్లో కూడా ఈ మాటని ప్రయోగిస్తారు.

అడుగు మాలిపోయిందంటే, మొదలంటా నశించి పోయిందని ! "అనుజ తనుజులుఁ జెలులు వియ్యములు నడుగు - మాలి పోదురు-" అని భారతంలో కవి ప్రయోగం.

అడుగులేని గిన్నెలాంటి వాణ్ణి కుదురులేని మనిషి అంటారు. 'కుదురు' అనేది గుండ్రటి చట్రం లాంటిది. కుండని గానీ, గిన్నెని గానీ ఈ కుదురు మీద వుంచితే, ఒరగకుండా నిలబడి వుంటుంది. ఎటు పడితే అటు ఒరిగే వాణ్ణి కుదరులేనివాడనేది ఇందుకే!

'అడుగు పుట్టులు' అంటే, అస్పృశ్యులు. వారిని ప్రేమగా కలుపు కోవాల్సిన బాధ్యత అగ్రజులకుంది.

పునాదులు కోసం తవ్విన 'గాడి'ని 'అడుగు' అంటారు అడుగు తవ్వి పునాదులు పోస్తారన్నమాట !

అడుగడుగున అంటే, మాటిమాటికీ... అనీ ! "అడుగడుగు పొదలిక దండ –" అనేది మల్ల విద్యకు సంబంధించిన ఒక పట్టు.

అడుగంటిన లేక మాడిన పదార్థాన్ని అడుగంట్లు అంటారు. హీనమైన వాటిని కూడా అడుగంట్లు అనే అలవాటుంది! "ఇలాంటి అడుగంటు వ్యవహారాలు మా ఇంటా వంటా లేవని చీదరించవచ్చు మనం !

'అడుగంటడం' అనే మాటకు అడుగుదాకా పోయిందనీ, క్షీణించిందనీ అర్థాలు కూడా వున్నాయి. నూతిలో నీళ్ళు అడుగంటాయి. వాడి తెలివితేటలు అడుగంటినట్లే వున్నాయి – వంటి ప్రయోగాలు కన్పిస్తాయి.

అడుగూ బడుగూ అనే మాటలో బడుగు అంటే – చిన్నది, తక్కువది, కృశించింది – అని ! పాత్ర అడుగున పదార్థం కొద్దిగానే మిగిలినప్పుడు అడుగున వున్న బడుగు, 'అడుగూ, బొడుగూ,' అడుగుబడుగు లాంటి ప్రయోగాలు చేస్తుంటాం.

'అడుగు కనిపించని మడుగు అతని హృదయం' అంటే, ఎంతో లోతైన మనిషని! "అడుగానగ లేని మడుగు" వంటి కవి ప్రయోగాలున్నాయి.

అడుగు పట్టిన వయసు – అంటే, పెద్దతనం వచ్చిందని !

'అడుగు' అంటే పాతాళం కూడా !

'అడుగులు' మేడమెట్లు. నూతిమెట్లని కూడా సూచిస్తాయి.

పైరుని కోసిన తర్వాత చేలో మిగిలిన మోడుని 'అడుగు' అంటారు.

అడుగిడిగిన క్షణం నుంచే మొదలయినట్లు కాబట్టి, 'అడుగు'కు ప్రారంభం అనే అర్థం కూడా వుంది.

అడుగులోనే హంసపాదు అంటే, ఆరంభంలోనే కొట్టివేత లేక తప్పటడుగు పడిందని !

'అడగడం' అంటే యాచించడం, అడుక్కోవడమే కదా.... 'బలి దైత్యునడుగఁ బోయిన నాటి హైన్య మొకటి–" అని జైమిని భారతంలో వ్యాఖ్య. అంతటి విష్ణువునకైనా అడుగబోవడం కన్నా హీనమైంది ఇంకొకటి లేదని !

మనల్ని అడగని వానిదే పాపం.... అనే స్థాయికి మనం ఎదగాలి !

అడుగ నేరను – ఊడ్చి పెట్టమన్నాడట – ఓ పెద్దమనిషి. అడిగేవాడికి చెప్పేవాడు, ఇచ్చేవాడు కూడా లోకువే !

అడిగితే చిరాకు – అడగకపోతే పరాకుగా వుంటారని చాలామంది భార్యలు తమ భర్తల్ని వ్యాఖ్యానిస్తుంటారు.

అడగడం అంటే, ప్రశ్నించడం కూడా !

"రేప్రొద్దున ఆయనడిగితే, ఏం చెప్పమంటావు?" అంటే, తప్పుడు పనుల్ని ఆయన అంగీకరించడని !

ఇవ్వాళ వాణ్ని అడిగేయాలి - అంటే, అటో ఇటో తేల్చేయాలని నిర్ణయించుకోవడం.

అడిగేయడమంటే కడిగేయడమే !

అడిగి లేదనిపించుకోకూడదు. అడిగాక ఒప్పించుకోగలగాలి !

అడగటంలో కూడా ఓ కొంటెతనం వుంది. "దాన్ని అడిగాడట-" అంటే అర్థం విడమరచ నవసరం లేదు. "హీన వంశాభిజాతనైన పతిపత్ని ననునడుగఁ దగునె" అంటుంది కీచకుడితో ద్రౌపది - విరాట పర్వంలో !

అడిగి చెయ్యమంటారు. అడిగి చేస్తే ఏదైనా పుణ్యకార్యమే అవుతుంది... అవునంటారా...???

# అత్త

అత్తపోరు, అత్త మామల పోరు, అత్తలేని కోడళ్ళ గురించి మనం బాగానే ముచ్చటించుకుంటూ వుంటాం.

అత్తగారి గురించి ఇంతేకాదు, ఇంకొన్ని ప్రత్యేక ముచ్చట్లున్నాయి.

"నక్క యురులలోను జిక్కుకొన్న వితానఁ గోరి మనము చేసికొన్న పనికి బేసలోని తీట వితమాయె ననరాదు అత్తకోక తొలఁగి నటులఁ బలుక -" అని రాధికా స్వాంతనంలో ఓ కమ్మని ప్రయోగం వుంది.

అత్తగారు నిద్రపోతున్న సమయంలో అజాగ్రత్త వలన ఆమె కోక కొద్దిగా తొలగింది. ఆ సంగతి ఆవిడగారిని లేపి చెపితే ఏం బాగుంటుంది...? అని సందేహంలో పడ్డది కొత్తకోడలు. చెప్పక పోయినా బాగోదుకదా... అలాంటి సందిగ్ధ స్థితిలో పడ్డప్పుడు "అత్తకోక తొలగినట్లు" అనే జాతీయాన్ని వాడుతుంటారు.

'అత్తమీద కన్నులు అంగడిపై చేతులు' కూడా ఇలాంటిదే, మరోమంచి జాతీయం

'నందసుతుఁడు మున్ను నా మీఁది ప్రేమచే, నొకటి సేయఁబోయి యొకటి సేయు, అత్తమీఁదఁ గన్నులంగటి పైఁజేతులాయె ననుచుఁజెలియులరసి నవ్వ -' అనే చక్కని ప్రయోగం కూడా రాధికా స్వాంతనంలోదే

నందకుమారుడు తనమీద ప్రేమతో ఒకటి చేయబోయి ఇంకొకటి చేసేవాడట. అత్తగారి మీద కళ్ళుపెట్టి అంగడి మీద చేతులు పెట్టినట్టైంది పరిస్థితి అంటుంది భామ. దానికి చెలులంతా నవ్వారట !

మనసు మనసులో లేదు - యేంచేస్తున్నానో నాకే తెలియట్లేదు అనే పరిస్థితుల్లో వున్న వ్యక్తి 'అత్తమీద కళ్ళు అంగడిమీద చేతులు' అన్నట్లుగా వున్నానంటాడు!

చక్కటి తెలుగు జాతీయాలివి ! ఉపయోగించకోవాల్సి వచ్చేసరికి ఇంగ్లీషు పదాలు మనల్ని అధిగమిస్తున్నాయి. తెలుగు మాట్లాడాల్సి వచ్చేసరికి మన పరిస్థితి కూడా అత్తమీద కళ్ళు అంగడి మీద చేతుల్లానే ఉంటోంది !

అత్తగంతు అంటే, వేశ్యమాతల గుంపు. తెలుగు కుమార సంభవంలో చక్కని ప్రయోగం ఇది. 'ఆంటీల గుంపు' అని !

'ఉత్తముండకంటే అత్తముండ మే'లనేది నిరసనగా వాడుకునేమాట !

'అత్తారబత్తం' అంటే ముదుపు చెల్లించుకోవడం.

'అత్తింటి కాపురం' అనే మాటని స్వేచ్ఛలేని ఉద్యోగానికీ, పరతంత్ర జీవనానికి ప్రతీకగా వాడుతుంటారు.

'అత్తింటి కోడలికిఁగా హత్తుకనతఁ డుండే నొకయ వాగ్రణి కొలకై - అని హంస వింశతిలో అద్భుతమైన ప్రయోగం వుంది. కోరుకున్న ప్రయోజనం కోసం అత్తింటి కోడలిగా ఆ యింట్లో హత్తుకుని వున్నాడట.

ఏదో స్వార్థ ప్రయోజనాన్ని ఆశించి అతిగా సేవలు చేసే వ్యక్తిని 'అత్తింటి కోడలు'గా పనిచేస్తున్నాడనటం మంచి ప్రయోగం. పెద్ద కాకారాయుడన్న మాట !

అత్తిల్లు చేరిన కూతురు అంటే నీచంగా బ్రతుకుతోందని !

అస్తమానం సాధించే వ్యక్తిని అత్తలాగా వున్నాడని అంటూంటాం.

చివరిగా అత్తెసరు గురించి ఒక మాట !

అత్తెసరుకీ అత్తగారికీ ఏమీ సంబంధంలేదు. అత్తగారు పెట్టిన ఎసరుని అత్తెసరు అనటం అన్యాయం.

ఎత్తుకు ఎత్తు అంటే, బియ్యం, నీళ్ళు సమానంగా తీసుకుని ఉడికిస్తే అది అత్తెసరు అన్నం అవుతుంది. ఎత్తుకు ఎత్తు ఎసరు, ఎత్తెసరు, అత్తెసరు అయ్యింది. అదీ సంగతి.

# టక్కరి

"ముద్దుల తక్కరి బిడ్డఁడు ముద్దులఁగుల్పంగా దలచి..." అనే పోతన గారి కమనీయమైన పద్యంలో అల్లరి కృష్ణుణ్ణి "ముద్దుల తక్కరి బిడ్డడు" అనడం రమణీయంగా వుంది.

టకటకా పనులు చేసుకుపోతుంటాడు అని అనేస్తుంటాం గానీ, చెచచెకా అనడం మర్యాదపూర్వకంగా వుంటుంది. ఎందుకంటే, టకటక లాడిస్తూ, టకా టకీ చేతి వాటాన్ని ప్రదర్శించే టకటంకులు - అంటే, చోరశిఖామణులూ, మాయావులూ, ధూర్తులూ చాలా మంది మనమధ్యే తిరుగుతుంటారు కాబట్టి !!

వీళ్ళనే టక్కరులంటారు. "టాటోటులు" అనే ముద్దుపేరు కూడా వుంది వీళ్ళకి!

టకటంకు, టకటొంకు, టక్కు, టాటోటు, రవళి... ఇవన్నీ అచ్చ తెలుగులో అబద్ధాలకోర్లకు పేర్లు...

'తెక్కలిగాడు' అన్నా వీడే !! 'పలు తెక్కలిగాడు' ఎంతకయినా తెగించగల ధూర్తుడు.

"టవటవం" అంటే పెద్ద అబద్ధం అని.

"టక్కరి, పూట తాటలు చేసి ధనము చక్కనఁగైకొని" అంటూ, గౌరన కవి హరివంశంలో వర్ణించిన ఈ టక్కరి - అప్పులిచ్చే ఆయన దగ్గరకు వెళ్ళి పూట తాటలు పెట్టి, డబ్బుచ్చుకు పోయాడట. వీడు ముళ్ళపూడి వారి 'అప్పారావు' లాంటివాడు.

చెల్లించవలసిన బాకీకి పూచీ వుండడాన్ని తెలుగులో 'పూట పడటం' అంటారు. అది అబద్ధపు పూచీ అయినప్పుడు ఆ పూటతాటలు పెట్టినవాణ్ణి 'టక్కరి' అని సంబోధించాడు కవి !

మరదలు పిల్ల తన కాబోయే బావని 'టక్కరి బావ' అన్నదంటే, సదరు బావ వస్తానని ఎగ్గొట్టడమో, తెస్తానని మరిచిపోవడమో చేశాడన్నమాట!

గజకర్ణ, గోకర్ణ, ఇంద్రజాల, మహేంద్రజాల, టక్కుటమారాది మాయా విద్యల్ని నేర్పించే గురువుని 'టక్కుటమార' అని పిలిచేవారు. ఆయన నేర్పిన విద్య టక్కుటమారం. కానీ, భ్రమలో వుంచి పబ్బం గడుపుకోవడం, మాయమాటలు చెప్పి లోబరుచుకోవడం అనే అర్థాలలో ఈ 'టక్కుటమారం' క్రమేణా స్థిరపడింది.

టక్కుటమారం చేయాలంటే వేగం కావాలి. ఎదుటివాడు గమనించే లోపు 'టక్కున' జరిగిపోవాలి. Sleight of Hand ('హస్తలాఘవం') అంటే ఇదే !

టక్కులాంటిదే 'టంకు' కూడా. టంకులాడు నాగరకుడైన మోసగాడు. టంకుతనం అంటే మొండితనం. టంకురాక్షసి అంటే మాయలు నేర్చిన రాక్షసి. తాటకి వంటిది !

"టంకనగానే మాయావి పొంకమౌతుంది-" అని భారతంలో ఓ చక్కని ప్రయోగం.

టంకునేతల పాలన ఎలా వుందో మనం కళ్ళారా చూస్తున్నాం కదా !

'టాటాలు పోవడం' అంటే, లేని దర్పం, దాబులకు పోవడం, 'కర్నాట స్త్రీలు పదునుపెట్టిన కటారి కత్తిలాంటి వాళ్ళనీ, టాటాలు ఇక్కడ గుణింపరాదనీ, ఇంకెక్కడైనా ఆ పనిని చెయ్యమనీ శ్రీనాథుడి క్రీడాభిరామంలో వర్ణన. ఈ కర్నాట స్త్రీలు నెల్లూరు నెరజాణలేనని యార్లగడ్డ బాలగంగాధరరావు గారి నిరూపణ ! అది వేరే సంగతి.

"కోట్లకు పడగలెత్తికూడా దానం చెయ్యాలంటే టాటాలు గుణించే లోభులున్నారు–" అనే కవి ప్రయోగాలు కూడా వున్నాయి. టాటాలు గుణించడానికి ఇది ఇంకో అర్థం.

స్నేహితులకు వీడ్కోలు సమయంలో టాటాలు చెప్పడానికీ దీనికీ ఏమీ సంబంధం లేదు.

'పై మెరుగులే తప్ప లోపల సరుకు లేనివాడు' అని చెప్పడానికి తెలుగులో "టాటోటు" అంటారు. కపటం, మోసం, వంచన వీళ్ళ ప్రాథమిక లక్షణాలు.

"ఒక కోతి లంకలో కొంపలన్నీ తగలబెడ్తుంటే, మన టాటోటుతనపు రాక్షస వీరులంతా ఏమయ్యారు చెప్మా–?" అని రాక్షస ప్రజలు వెదికారట – కూచిమంచి తిమ్మకవి అచ్చతెలుగు రామాయణంలో చక్కగా ప్రయోగించాడీ మాటని !

టాలా టోలీ మాటలు, టాలాటోలీ పనులు, టాలాటోలీ వ్యవహారాలూ ఇవన్నీ ఇలాంటి అర్థంలోంచి పుట్టిన మాటలే !

'టంకం' కూడా ఇలాంటి అర్థాల్లోనే తరచూ కన్పిస్తూంటుంది. "నెమ్మదిగా అత్తగారింట్లో చేరి టంకం పొడిలా అతక్కుపోయాడు" అంటాం కదా!

కొంచెం పొడి వేశాడు, పొడి చల్లాడు అనే ప్రయోగాలు కూడా ఈ అర్థంలోంచే పుట్టాయి.

బంగారం పనిలో టంకం వేసి చేసే వ్యవహారం ఇలాంటి మాట పుట్టడానికి అవకాశం ఇచ్చింది. 'దానికేదో టంకం వేస్తున్నాడు –' అంటే, ఆ తర్వాత ఏం జరగబోతుందో వూహించుకోవడం తేలికే !

టక్కరోళ్ళ వెనక ఇంత 'భాగోతం' వుంది! వీళ్ళ పేర్లే వీళ్ళ వ్యక్తిత్వాన్ని సూచించే అంశాలు !

# 'నస'

"చెవిలో ఒకటే నసపెడ్తారేమిటి – దూరంగా వుండండి" అని భార్య – భర్తగారిని విసుగ్గా అన్నదంటే, సదరు భర్తగారు వంటగదిలోకి దూరి, వేళకాని వేళ – ముఖ్యంగా వంటవేళ – పగటి సరసం ప్రారంభించాడని అర్థం !

నలుగురున్న ఇళ్ళలో ఇలాంటి విషయాల్ని నసిగి చెప్తారు. 'నసగడం' అంటే... 'పొందు' కోసం పంపే సంకేతం అని అర్థం చెప్పుకోవచ్చు సరదాగా.

'నసగూటి' అంటే, కామోద్రేకి ! వేశ్య !

"పిసవెట్టి కసరెత్తి యెసరేఁగు నసఁగూటి పూబోండ్లు..." అన్నాడు హంసవింశతి కావ్యంలో అయ్యలరాజు నారాయణామాత్యుడు !

'నస'ని వంటగదిలోనే ఎక్కువ సందర్భాల్లో పెట్టవలసి వస్తుంటుంది - భార్య అందుబాటులో వుండేది అక్కడే. కాబట్టి ! వంటగదికి "మహానస" అనే పేరు రావడానికి భర్తలు నసపెట్టడానికీ ఏమీ సంబంధం లేకపోయినప్పటికీ, ఒక్కోసారి "మహానస" కూడా పెట్టవలసి వస్తూంటుంది కాబట్టి, నసకు వంటిల్లు కేంద్రస్థానం అయ్యింది.

ఇలా భర్తగారి నసుగుడు, భార్యగారి విసుగుడు బైట అంట్లు తోముతున్న 'అమ్మి' కళ్ళలో పడనే పడ్డాయి. "నసగొట్టు పంతులు గారూ.... పిసవెట్టికి తగులుపడి అలా తపించడం దేనికీ... గొడ్లసావిడి దగ్గరకు రండీ... సాయంత్రం అక్కడకు నేనూ వస్తాను - అందిట - సన్నగా "నసుగుతూ"... సదరు అమ్మి - శుక సప్తతిలో కదిరీపతి నాయకుని వర్ణన ఇది.

ఎవరి 'నస' వారిది !

'నస' నశించిపోయాక వయసుడిగిపోయినట్లే కదా ! వయసు 'నస' వేరు.

'నసకించే నేర్పులు' అంటే మోహింపచేసే చాతుర్యం !

"నసాళానికి అంటింది-" అంటే, బాగా లోతుకు తగిలింది - అని!

'నసాళి' అంటే దూసుకుపోయేది.

'నసనస' అంటే, తడిసిన చర్మం వగైరాలకు సంబంధించిన ధ్వన్యను కరణ పదం. నసగూడేప్పుడు ఏర్పడిన ధ్వనికూడా కావచ్చుగదా !

'నస' అంటే దురద, ఉపద్రవం అనే అర్థాలు కూడా వున్నాయి. 'నసిమిరి' అంటే దురదే!

'నసుకుడు' అనేది అబద్ధాలాడేప్పుడు, ఏదో వంకలు చెప్పి తప్పించు కొనేప్పుడు, చెప్పడం కుదరక, ఏ సమాధానం చెప్పలేకపోయినప్పుడు వాడవలసిన పదం !

'పిసినిగొట్టు' లాగానే 'నసినిగొట్టు' కూడా ఒక రకమైన జడపదార్థం. ఎవరు ఎంత "నస" పెట్టినా ఏమాత్రం చలించని మనుషులు నసినిగొట్లు! రసస్పందన లేనివాళ్ళన్న మాట!

మొత్తం మీద 'నస' గురించి ఇంత రమ్యమైన కథ వుంటే, అన్నింటినీ వదిలేసి, పై అధికారి దగ్గర క్రింది అధికారి నీళ్ళు నములుతూ చేసుకునే విన్నపం- అనే అర్థంలోకి దీన్ని మళ్ళించడానికి ఎవరికి ఎలా మ'నస'య్యిందో.... కదా!

ఒక్కమాట-

'నస' అనేది 'నాస' అంటే, ముక్కుతో గొణిగినట్లు మాట్లాడతారు కాబట్టి ఈ మాట ఏర్పడిందని పెద్దలు చెప్తారు...

ఆ గొణుగుడు కూడా... తనకేదో కావాలని నర్మగర్భంగా అడగడమే కదా... ఆ 'ఏదో' ఏదైనా కావచ్చు కదా !

# అసలు

అడుగున తెరుకునేది అసలు. అంటే, బురద. మకిలి, మడ్డి, మురికి, ఇవన్నీ 'అసలు' అనదగిన విశేషాలు.

'అసలు బుట్టువు' అని అచ్చతెలుగు రామాయణంలో కూచిమంచి తిమ్మకవిగారు చేసిన గొప్ప ప్రయోగానికి అర్థం బురదలోంచి పుట్టింది - పంకజం అని!

'అసలు'కు అసలు అర్థం 'చివరికి మిగిలే మురికి' అనే !

'అసలు పెట్టడం' అంటే, బురదలోకి నెట్టడం.

'అసలు కొల్పడం' అంటే మురికి చెయ్యడం.

'అసలు కొనడం' అంటే, బురదలా అయిపోవడం.

మనిషి అసలు పుట్టుక ఎట్లాంటిది - ? రక్తంలోంచి, మాంసపు ముద్దలోంచే కదా... !

మధ్యలో ఉత్తర భారతదేశ పదాలు అసిలీ - నకిలీ తెలుగులోకి ప్రవేశించి, నకిలీ కానిదంతా అసలుగా మారిపోయింది.

అసలుకే మోసం వచ్చింది, అసలు ఉద్దేశం వేరు, అసలు గొలుసు ఇదికాదు, అసలేం జరిగిందంటే - అనే ప్రయోగాల్లో Capital, Principle, Original, Legitimate అనే అర్థాలు కనిపిస్తాయి.

'అసలు' అంటే, Well, Beautifully, Elegantly, Suitably, Properly, Duly - అనే అర్థాల్లో కూడా ప్రయోగాలు ఏర్పడ్డాయి.

"అసలార అన్నట్లే జరిగింది !"

"అసలారు బాగానే వున్నారు, మధ్యలో నామీదకు నెట్టారు" ఇవన్నీ ఇలాంటి అర్థాలతో చేసిన ప్రయోగాలే !

"అసలు మసలు" అంటే, సరిగ్గా జరగవలిసిన రీతిలో (Duly) జరగడం.

అసలుకు అసలర్థం ఏదైనప్పటికీ, మాట్లాడేటప్పుడు తెలుగు పదాలు దొరక్క ఇంగ్లీషు మాటల్ని అరువేసుకోవడం మూలాన తెలుక్కి అసలుకే మోసం వస్తోంది !

# గుటగుట - గుటుక్కు

"గుడిమ్రింగేవాడికి గుళ్ళో లింగము వుట్రవడియం" అంటుంది తెలుగు సామెత. గుడినీ, గుళ్ళో లింగాన్నీ గుటుక్కున మింగేయగలగడం సామాన్యమైన విషయం కాదు. గుటుక్కుమనకుండా బ్రహ్మాండకోటి మింగేయగల పెద్దలు మనలో చాలామంది వున్నారు.

విషాన్ని "గుటగుటా" తాగి లోకోపకారం చేసి శివుడు దేవదేవుడయ్యాడు.

చిన్ని కృష్ణుడు పూతన బిగిచన్నుల్ని పట్టి గుక్కగుక్కకు "గుటుకు"మంటూ దాని శరీరంలో సత్వమెల్లా పీల్చేశాడని భాగవతం చెప్తుంది.

'గురువుతోనా గుటగుటలు?' అని ఆగ్రహించిన ఓ పెద్దాయిన్ని వర్ణిస్తుంది మనుచరిత్ర. ఇక్కడ గుటగుటలంటే, గరువపు మాటలు, అవహేళనలు అని అర్థం.

వేట దొరికినప్పుడు ఆకలిగొన్న క్రూర జంతువులు 'గుటగుట'మని ధ్వనిని చేస్తాయిట ! "వాడు కోపంతో 'గుటగుట'మని రొప్పాడు అని మనం కూడా ప్రయోగించవచ్చు.

'గోతికాడనక్క గుటకలు వేస్తూ చూస్తుంది.'

'అడిగినదానికి బదులివ్వకుండా అలా గుటకలేస్తావేమిటీ అని కోపం వచ్చినప్పుడు కేకలేస్తాం. లేదా నిలదీస్తాం. గుటుకున మింగటాన్ని గుటక వేయడం అంటారు.

"గుటుకూ గుటుకూ" అనే మాటని అదే పనిగా తినేవారిని ఉద్ధేశించి ఉపయోగిస్తుంటాం.

"గుటుక్కు"మని ఒకేసారి మింగేస్తారు కొందరు.

'అది వినగానే ప్రాణం 'గుటుక్కు'మంది – అంటే జాలికల్గిందని !

'చూస్తూండగానే గుటుక్కుమన్నాడు' అంటే, ప్రాణాలు అనంత వాయువుల్లో కలిసిపోయాయని

సారాయిని తాగేవాణ్ణి చూసినప్పుడు గుటగుటమని తాగుతున్నాడు – అంటాం.

అలాగని, దేవతలు అమృతపానం చేస్తున్నప్పుడు కూడా 'గుటగుట' మని తాగుతున్నారు అనిరాస్తే, ఏం బావుంటుంది...? అందుకని ఘనంగా వుండాలని, 'గుటగుట'కు ఇంకో 'గుటగుట'ని ఆమ్రేడితం చేసి గుటగుట + గుటగుట = గ్రుంగుటగుటమని దేవతలు అమృతం తాగినట్లు వర్ణించేవారు కవులు –

"సుధారసంబు గ్రుంగుటగుట నప్పటప్పటికి గ్రోలుచు –" అంటాడు పాండురంగ మాహాత్మ్యం కావ్యంలో తెనాలి రామకృష్ణకవి.

'గుటకాయ స్వాహా' అనే మాట – ఇంద్రాయ స్వాహా, విష్ణ్వాయ స్వాహా – అన్నట్లే సంస్కృతీకరించి 'గుటక'ని, గుటకాయ స్వాహా అనే అందమైన పేరడీ చేశారు. ఇది తెలుగువారి చమత్కారం !

గుటక, గుటుక్కు వంటివి ధ్వన్యనుకరణ పదాలు. అన్నం గుటగుటమని ఉడుకుతోంది – అంటాం. అదే, తమిళుడైతే 'కుదుకుదు' మని ఉడుకుతోంది అంటాడు. కుదుకుదుమని ఉడుకుతుంది కాబట్టి కూదు అనీ, తినడాన్ని కుదు అనీ ఈ పదాలు ఏర్పడ్డాయి. కుదవడం అంటే, తినడం, తాగడం కూడా! 'కుడితి' పదం ఇలాంటిదే!

# తొక్కలూ - తోళ్ళు

**తొక్క,** తోలూ నిత్యవ్యవహారంలో వున్న పదాలే గానీ, వాటి వెనక సరదా ముచ్చట్లు కొన్ని వున్నాయి.

'లోపలంతా డొల్ల' అన్నట్టుగా బక్కచిక్కిన మనుషులు వట్టి తొక్క (త్వక్=చర్మం) మాత్రమే కల్గివుంటారు. ఇలా పైనపటారం లోనలొటారం మనుషుల్ని "తొక్క మనుషులు" అంటారు.

కొందరు ఉత్తరకుమార ప్రజ్ఞలు పలుకుతున్నప్పుడు ఈ 'తొక్క మను షులు' గుర్తుకొచ్చే కాసేపు నవ్వుకొంటాం.

తాట, నట్టు, తిత్తి, చట్ట, తోలు, తొడు, పట్ట, తొక్కు, తోలుక, బెఱడు, చెక్క, తొంట, తొడవసం, కళాసం, తడప, అంట... ఇలా చర్మానికి తెలుగులో చాలా పేర్లున్నాయి.

అయితే 'తొక్కు' పదానికి చర్మ సంబంధమైనవే కాకుండా ఇంకా ఇతర ప్రయోగాలు మరికొన్ని వున్నాయి.

'తొక్కు' అంటే అణిచేయడం.

"తొలి తొలి యెల్ల పాపములు దొక్కుచుఁబల్కెడు నట్టి తియ్యపుం బలు కుల -" అనే కవి ప్రయోగం పాపాల్ని తొక్కేసే తియతియ్యటి మాటల గురించి చెప్తుంది.

'తొక్కు'కు తియ్యటి మాటలనే అర్థం కూడా వుంది.

రామచిలుక తొక్కుపలుకులు వినడానికి తియ్యగా వుంటాయి.

తీలాముని దైతేతను... అని చిన్నపిల్లలు ముద్దు ముద్దు మాటలతో పద్యాలు చదువుతుంటే, కమనీయంగా వుంటుంది. తొకతొకమంటూ 'త' భాషలో వత్తిపలుకు తున్నట్టుంటుందా వరవడి. అందుకని పిల్లల ముద్దుమాటల్ని 'తొకతొక మాటలు' అంటారు. తడబడితే, పెద్దలక్కూడా తొకతొక మాటలొస్తాయి.

తొక్కు+తొక్కు='తొక్కు తొక్కు పలుకులు' అంటె, పొగరుబోతు మాటలనే ప్రయోగం కూడా వుంది.

"ఏదేది యేమేమి యనుచు ననుచు మదమ్ము టెక్కునఁ దొక్కు తొక్కు పలుకులఁ బలుకుచు-" అని తెనాలి రామకృష్ణుడి ప్రయోగం ఇది - ఘటికాచల మాహాత్మ్యంలో !

తొక్కు అంటే, తొక్కేయబడింది - పనికిమాలింది అనే అర్థంలో కూడా ఈ మాటని వాడుతుంటారు బాగా.

దాన్ని పదిమంది తొక్కేశారట - అనడం ఈ అర్థంలోనే.

తొక్కం గాదూ... వాడిమాటలు కూడా లెక్కచెయ్యాలా?

"ఆ తొక్కగాడికీ నాకూ పోలికా...?"

"తొక్కలో ఉద్యోగం - వుంటే ఎంత ? పోతే ఎంత ?" ఇలా పనికిమాలిన వాళ్ళనీ, తేలికగా తీసేయదగిన అల్ప విషయాల్నీ తొక్కతో పోల్చి చెప్తారు.

'తొక్కలు' అంటే కష్టాలు

"తొక్కులఁబడె జీవుడు దుండగీల చేతను" అంటాడు అన్నమయ్య - కష్టాల పాలయ్యాడు - అంటూ -

తొక్కులు (కష్టాలు) లేనప్పుడు సహజంగానే ఎగిరెగిరి పడతాం కదా... తొక్కులాడటం అంటే, ఇలా ఎగిరెగిరి పడటమే !

భయపడి, తొక్కటపడి, కటకటపడి, దిగుల్పడి, వెఱుగుపడి...... ఇవన్నీ తొక్కలు పడటాన్నీ, బాధపడటాన్నీ ఉద్దేశించి వాడే మాటలు.

'తొక్కటం' అంటే, దారిద్ర్యం.

వేశ్యాలోలుడు దానివలలో ఇరుక్కుని, వున్నదంతా వూడ్చిపెట్టుకొని, తొక్కటంలో పడ్డాడు చివరికి.

తొక్కట్లు, ఇక్కట్లు కన్న పెద్ద కష్టాలు. దివాళా తీసేస్థితి ముంచుకొచ్చి నప్పుడు తొక్కట్లలో పడ్డాడనే అనాలి !

తొక్కితే వత్తిడి కల్గుతుంది కదా... వత్తిడి ఎక్కువగా వుందనడానికి 'తొక్కుడు' అనే పదాన్ని ప్రయోగిస్తారు. "జనం తొక్కుడుగా వుండేసరికి టిక్కెట్లు దొరకవని సినిమాకు వెళ్ళకుండా వెనక్కి వచ్చేశాను - అంటుంటాం. తొక్కిస లాటకు సంక్షిప్తరూపం తొక్కుడు.

పూరీ జగన్నాథ రథోత్సవం, తిరుపతి బ్రహ్మోత్సవాల వంటివి జరుగు తున్నప్పుడు జనం విపరీతంగా వుంటారు. అలాంటప్పుడు తొక్కుడు + తొక్కుడు - తొడతొక్కుడుగా ఉత్సవం జరిగిందని చెప్పుకొంటాం.

STAMPEDE అనే ఆంగ్లపదానికి సమానార్థకం ఈ తొడతొక్కుడు.

తొక్కటపాటు అంటే తొట్రుపాటు.

'తొక్కు' అనేది తొక్కిన నిలవ పచ్చడికి పేరు. గోంగూర, ఉసిరికాయ, చింతకాయ, మామిడికాయ వగైరాల్ని ఉప్పేసి తొక్కి ఓ జాడీలో నిలవ వుంచు తారు. ఇదీ తొక్కు అంటే ! అవసరం అయినప్పుడు కొద్దిగా తొక్కుని తాజాగా తాలింపు పెట్టి వాడుకొంటారు.

"పచ్చళ్ళూరు బిండ్లూరుఁగాయులు మామిడితొక్కులు..." గురించి అయ్యలరాజు నారాయణామాత్యుడు హంస వింశతిలో వర్ణిస్తాడు. 'తొక్కు' అంటే తొక్కిన పచ్చడే గాని, 'తొక్కు'ల పచ్చడికాదు.

చొక్కా కూడా తొక్కలాంటిదే ! లోపలి అంగాలకు రక్షణ ఇవ్వడం తొక్కు

(లేక) తోలు తక్షణ కర్తవ్యం. తుళు భాషలో తుగలు, కురుబ్, చొక్కా, మరాఠీలో తుకవ్, తొక్కు తమిళంలో తుగవ్, తొగివ్, తోక, కన్నడంలో తొక్కు, తొగవ్ ఇవన్నీ తొక్కనీ తోలునీ సూచించే మాటలు.

అరటిపండులా అంటుకొని వుండేదాన్ని తొక్కు అనీ, కమలాఫలంలా వదులుగా వుండేదాన్ని 'తోలు' అంటారని కొందరు నిర్వచనాలు చెప్తారు గానీ, వ్యవహారంలో తొక్కు, తోలు రెండు పదాల్నీ వాడ్తుంటాం మనం.

# ఆపద

'ఆపదమొక్కులు - సంపద మరుపులు' మనకి కొత్తేమీ కాదు - సంపద రాగానే ఆపదల్ని, ఆపదలప్పుడు మొక్కిన మొక్కుల్నీ అన్నీ మరిచిపోతాం. "సంపద గునుపులు" అంటారందుకే!

ఆపదల్లో పడ్డవాడు "ఆపకుడు." కష్టాలొచ్చినప్పుడు దుఃఖిస్తూ కూర్చో కుండా పరిష్కారాలు ఆలోచించడం, "ఆపద్ధర్మం" అన్పించుకొంటుంది.

ఆపదలొచ్చాయని దిగులుపడి మనోవేదనకు (డిప్రెషన్‌కు) లోను కావడాన్ని "ఆపసోపాలు పడటం" అంటారు. ఆపద్బాంధవులు అన్నివేళలా దొరకరు కదా !

ఆపదలెప్పుడూ చెప్పిరావు. ఒకవేళ ముందుగా హెచ్చరికలున్నా మనం పట్టించుకోం. అందుకని ఆకస్మాత్తుగా అంటే "ఆపాతం"గా వచ్చినట్టే భావిస్తాం. అతర్కిత ఆగమనం అంటారు ఆపాతంగా వచ్చేదాన్ని !

ఒకవేళ మంచి సంఘటన ఆకస్మాత్తుగా జరిగితే "ఆపాతమధురం"గా వుందంటాం.

ఓ మంచిపాట వినగానే బావుందనిపించినప్పుడు 'ఆపాతమధురం'గా వుందని మెచ్చుకుంటాం. ఇక్కడ ఓ వ్యంగ్యం కూడా వుంది. వినగానే బావుందంటే, కాసేపు ఆలోచిస్తే అందులో తప్పులు చాలా కన్పించాయనే అంతరార్థం అంతర్లీనంగా ఈ మాటలో వున్నట్టే కదా...!!

"ఆపాతరమ్యా విషయాః పర్యంత పరితాపినః" అని కిరాతార్జునీయంలో భారవి కవి అంటాడు - ఆపాతరమ్యమైన విషయాలు తర్వాత తరచి చూడగా బాగోకపోగా బాధ పెట్టేవిగా కూడా వుంటాయని !

ఆపదలు రావడాన్ని "ఆపనం" అంటారు. ఆపనంలో వున్నవారు ఆపన్నులు. ఆపన్నులు సాధారణంగా తమ కష్టాలకు ఇతరులెవరో కారణంగా వచ్చినట్టు ఆపాదిస్తుంటారు. "ప్రొద్దునే ఎవరి ముఖం చూసి లేచానో కడుపులో నొప్పి వచ్చింది –" అంటాడే గాని, రోగి పచ్చిమిరపకాయ బజ్జీలు తిని తెచ్చుకొన్నా నని పొరబాటున కూడా ఒప్పుకోడు కదా ! అది రోగినైజం.

ఎప్పుడూ ఏదో ఒక దుఃఖంలో మునిగితేలుతూ తమలో తాము కుళ్ళిపోతూ వుండే నిత్య దుఃఖితుల్ని "స్ట్రెస్"లో వున్నారంటారు డాక్టర్లు. డిప్రెషన్‌కు తరచూ లోనయి మైగ్రేన్ తలనొప్పి వంటివి తెచ్చుకునే ఈ మనుషుల్లో "ఆపీడనం" అనే గుణం ఎక్కువగా వుంటుంది. కోపం వస్తే తలకాయి బాదుకునేతత్వం లాంటి వీరిది ! ఇందువలన మరింత స్ట్రెస్‌కు లోనయి తమను తాము ఆపీడించు కొంటూ వుంటారీ మనుషులు !

ఆపీడనం ఆపదలకు పూర్వరూపం అవుతుంది.

# టెక్కు - టీకు

**జా**తీయ జెండాని విలాసవంతంగా అది ఎగిరేలా చేస్తామని ప్రతిజ్ఞ చేస్తాం. జెండా ప్రతిష్ఠని 'టెక్కు' అంటారు.

'టెక్కు' అనే లక్షణం వుంటుంది కాబట్టి జెండాకు 'టెక్యం' అనే మరోపేరు కూడా వుంది. టెక్కెం, టెక్కియం అని కూడా అంటారు. 'ఎత్తిరి టెక్కియంబులు' అనే శ్రీనాథుడి పద్యం బాగా ప్రసిద్ధి.

కేతనం (జెండా) అంటే కేతుగ్రహం కాబట్టి దానిక్కూడా టెక్యం అనే పేరు వచ్చింది.

టెక్కు అనే పదానికి ఇంకా చాలా అర్థవిస్తృతి వుంది.

బిత్తరపోవు, కులుకు, బెడగు, వెళుకులుపోపు, గునుచు, మురిపించు, మురుపులు కురిపించు, సొగసు తీరు, నిక్కు, మిటారించు, తెక్కరాలు ఒలక బోయు, టీకు... ఇలా విలాసంగా కన్పించే అర్థాలలో ఈ పదాన్ని ఎంతో అందంగా ఎన్నో రకాలుగా వ్యక్తీకరిస్తుంటాం.

మనసైన వ్యక్తి ఎదురైనప్పుడు మనసులో కలిగే భావం 'విలాసం' అవుతుంది. ఇలాంటి విలాసభావం కలిగినప్పుడు మనసులో కొద్దిపాటి విభ్రమం కూడా కలుగుతుంది. దీనస్థితిలో వున్న ఒక స్త్రీ ఇలాంటి విలాస విభ్రమాలు ఏవీ లేకపోయినా, ఆమె విలాసవంతంగా వున్నట్లు వర్ణిస్తాడు పెద్దన – మనుచరిత్రలో! 'టెక్కు' అంటే అది !! అలాంటి టెక్కులు కలిగిన విలాసవతిని 'టెక్కెల' అంటారు.

"టెక్కులుండక్కులెగానీ యమ్మనినధమ్మననేరదు" అనేది తెలుగులో ఓ మంచి జాతీయం. శుకసప్తతిలో కదిరీపతి నాయకుడు రూపొందించిన మాటల సముదాయం ఇది. ఓనమాలు కూడా తెలియని వాడు అన్నీ తనకే తెలుసన్నట్లు టెక్కులు పోతుంటాడు – అని వ్యంగ్యంగా అనడానికి ఈ జాతీయాన్ని వాడ్తుంటారు.

'టెక్కైన గూడేట్లు సంతృప్తిగా వడ్డించారు - (STUMPTUOUS) అని చెప్పుకొంటారు విందుకువచ్చి సంతోషించి వెళ్ళిన అతిథులు.

"వలరాజు టెక్కుల గెలుచు నేత్రములు" అంటుందో కవిప్రయోగం.

వ్యక్తులకు టెక్కెక్కువ అనడం ఇలాంటిదే.

టెక్కులాడి, టెక్కులాడు, టెక్కులకత్తె... వీళ్ళంతా తమ టెక్కులతో స్వప్రయోజనాలు సాధించుకునే వాళ్ళే !

టెక్కులా ధ్వనించేదే... 'తెక్కు' అనే ఇంకో పదం వుంది. వంచన, మోసం అనేవి దీనికి అర్థాలు. తెక్కులు చేసేదాన్ని తెక్కలి అంటారు.

తెక్కలిగాడు, తెక్కలీడు మాటలు వంచకుణ్ణి సూచిస్తాయి.

తెక్కలి గొనడం అంటే, ఎత్తుకుపోవడం.

"తెక్కలి పాటు" అంటే అకస్మాత్తుగా ముంచుకొచ్చిన ఆపద.

నవీన కాలంలో ఈ తెక్కు - 'టెక్కు'ని ఆవహించి టెక్కుకున్న గౌరవ అర్థాలు మరుగున పడిపోయి, టెక్కు అనేది మనుషులకు ఉండకూడని లక్షణంగా మిగిలిపోయింది.

నిజానికి జాతి టెక్కుని నిలబెట్టడం మనందరికి కర్తవ్యం కదా !!

ఎప్పటికైనా మన టెక్కు మనదే !

# అచ్ఛ-అచ్ఛు

**అచ్ఛ** తెలుగు, అచ్ఛ బంగారం, అచ్ఛబియ్యం, అచ్ఛవెన్నెల, అచ్ఛాదు... ఈ తెలుగు మాటల్లో వున్న 'అచ్ఛ' అంటే స్వచ్ఛమైనది, కల్తీలేనిది, తెల్లనిది, నిజాయితీ కల్గింది - అనే అర్థం. "అసలు" దీనికి పర్యాయ పదం.

'అచ్ఛాదు' మంచివాడని !

అచ్ఛవెన్నెల - నిర్మలమైన ఆకాశంలో స్వచ్ఛంగా కన్పిస్తుంది - పుచ్ఛపువ్వులా!

'అచ్ఛ పువ్వుల వెచ్ఛగాలులు' అనే అద్భుత ప్రయోగం వుంది.

మురికి తేరిన తర్వాత నీరు స్వచ్ఛంగా వుంటుంది కాబట్టి అచ్ఛనీరు అంటారు స్వచ్ఛమైన మంచినీటిని !

అచ్ఛన పుచ్ఛడం అంటే మరుగుపరచడం. 'దాచేస్తే దాగదు వ్యక్తి ప్రతిభ - దాన్ని అచ్ఛనపుచ్ఛడం ఎవరి తరం?' అని ప్రయోగిస్తుంటాం.

'అచ్ఛనలు' ఆడపిల్లలు ఆడుకునే ఆటలు. అచ్ఛనగాయలు, అచ్ఛన గుండ్లు

ఇలాంటి ఆటలే! "హెచ్చిన శోకము మదిలో నచ్చనలాడంగ..." అంటాడు పాల్కురికి సోమనాథుడు.

అచ్చంకారాలు అంటే, లావాదేవిలు జరిపేటప్పుడు చేసుకునే ఒప్పందాలు. ఒట్టుపెట్టుకోవడం, వాగ్దానం చేయడం లాంటివి. సంస్కృతంలో 'సత్యంకారాలు' అంటారు. తమిళంలో ఈ పదం బాగా వాడుకలో వుంది.

'అచ్చారం' అంటే అడ్వాన్స్‌గా కొంత సొమ్ము పుచ్చుకొని, ఒప్పందానికి అంగీకారం చెప్పడం. 'అచ్చారం' పుచ్చుకున్నాక ఇంక వెనక్కి వెళ్ళడం సాధ్యం కాదు!

పెళ్ళి సంబంధాలు కుదుర్చుకునేప్పుడు కూడా ఈ మాట ప్రయోగంలో వుంది. 'అచ్చారాలు' అయిపోతే, విఘ్నేశ్వరపూజ చేసి, వినాయకుడి మూటగట్టి పెళ్ళిపనులు మొదలెడదామని చూస్తారు ఇళ్ళలో ఆడవాళ్ళు.

అచ్చ లాంటిదే 'అచ్చు' కూడా!

అచ్చు గుద్దినట్లు చెప్పడం అంటే, వున్నది వున్నట్లు కుండబద్దలు కొట్టినట్లు చెప్పడం అని !

'అచ్చుగుండ్లపేరు' అంటే, మంచి బంగారపు నెక్లెస్.

'అచ్చుకుప్ప' అంటే ధనవంతుడు.

'అచ్చుగా తీర్చేస్తా మీ అప్పు' అంటే, నిజాయితీగా తీర్చేస్తాననే.

అచ్చిక బుచ్చికలాడి డబ్బుచ్చుకుపోయిన వాడి గురించి హరిశ్చంద్రో పాఖ్యానంలో మంచి వర్ణన వుంది !

'అచ్చులదొడ్డి' అంటే, తూకంరాళ్ళ మీద తూనికలు కొలతల శాఖ వారు ప్రభుత్వ అనుమతి ముద్రవేసే కార్యాలయం. మచ్చులదొడ్డి అని కూడా అంటారు. ముద్ర వేయడాన్ని సికావేయడం అనీ, ఆ అధికారిని సికా తాసిల్దార్ అనీ పిలిచేవారు.

జీవితాన్ని భగవంతుడి అచ్చాఫీసుగా భావించాడు కవి ఆరుద్ర.

అచ్చు కూటమి అంటే ప్రింటింగ్ ప్రెస్. "ఇది ఆనంద అచ్చకూటమిలో అచ్చయినది-" అని తెలుగు పుస్తకాల మీద ఎప్పటికైనా అచ్చతెలుగులో అచ్చువేస్తారంటారా...??

అచ్చాఫీసు అని - పత్రికా కార్యాలయాన్ని కూడా వ్యవహరిస్తారు. పత్రికలకు 'ప్రెస్' అనే నామాంతరం వుంది కదా !

బసవ పురాణంలో పాల్కురికి సోమనాథుడు "అందరి మొగముల యందచ్చులొత్తి యరిచి..." అంటాడు. అంటే, అందరి మనసుల్లోనూ చెరగని ముద్ర వేశాడని!

"ఆత్మమూర్తి యబలతలంపున నచ్చొత్తినట్లు సేసె" అని నాచన సోమన

కూడా ఉత్తర హరివంశంలో 'చెరగని ముద్ర' అనే అర్థంలోనే అచ్చొత్తు అనే మాటని ప్రయోగించాడు.

'అచ్చుపరచడం' అంటే, స్పష్టం చెయ్యడం.

అచ్చు+యిక=అచ్చుయిక - అచ్చిక - అంటే, స్వచ్ఛత !

"అచ్చిమెచ్చు"గా వుంటేనే పనులు అవుతాయి-అంటే, అణకువగా వినయంగా వుండి మంచితనంతో పనులు సాధించుకోవాలని.

"ఇంద్రియాల్ని ఇష్టం వచ్చినట్లు పోనిస్తే నరకం అచ్చుపరుస్తుంది" అని మహాభారతం.

"నీకూ నాకూ అచ్చుదల కుదరదులే... బేరం వదిలెయ్" అంటాడు విసిగిన వ్యాపారి.

'అచ్చోసిన అంబోతు' - స్వేచ్ఛగా తిరగడానికి సంకేతం. ఇప్పుడంటే పశువులకు సెమన్ బ్యాంక్‌లు ఏర్పడ్డాయి. పూర్వపు రోజుల్లో, వూళ్లో ఆవుల కోసం ఒక ఆలపోతు (ఆంబోతు) పిర్ర మీద అచ్చు (ముద్ర) వేసి స్వేచ్ఛగా వదిలేసేవారు. దానికి ఊళ్ళో అల్లుడిగారి మర్యాదలన్నీ జరిగేవి ! అది ఆవులకు పుత్రప్రాప్తి కల్గించడానికి ఉపయోగపడేది. కాల క్రమేణా ఈ అర్థాలకు వ్యంగ్యం తోడయ్యింది ! తిరుగుబోతు, పచ్చి వ్యభిచారి అనే అర్థాలలో ఈ అచ్చోసిన ఆంబోతుని నవీనంగా వాడ్తున్నాం !

మత తత్వం మనదేశాన్ని అచ్చు కట్టినట్లు నిలువునా చీల్చింది - అని బాధపడ్తుంటాం మనం.

అచ్చిరావడం అంటే, కలిసిరావడం.

తండ్రి తద్దినం పెట్టమంటే, తద్దినాలు తనకు అచ్చిరాలేదనే కొడుకు లుంటారు - ఈనాడు కూడా!

'అచ్చిక వచ్చిన భూమి అడుగుడే చాలును' అనేది తెలుగుసామెత అచ్చంగా. అప్పనగా అనే మాటలు 'తేరగా', బేవార్సుగా, అప్పళంగా - ఈ అర్థాలలో బాగా వాడుకలోనే వున్నాయి.

అచ్చు ముచ్చు తెలీనివాడు అమాయకుడు. బియ్యంలో మెరికల్ని 'ముచ్చు' అనీ, మంచి బియ్యాన్ని 'అచ్చు' అనీ అంటారు. 'అచ్చు ముచ్చు' అనే ఈ జాతీయానికి 'దొంగ-దొర' అని అర్థం.

ఎవరికి అచ్చుపరిచిన పనులు వారు చేసుకోవాలి గదా !

అచ్చమైన ముచ్చట్లు ఈ అచ్చు గురించి మరికొన్ని చెప్పుకోవచ్చు - కానీ, అచ్చొత్తేవారికి ఇబ్బంది - 'కాలం' దాటకూడదు కదా !

# గుండా

"అక్కణ్ణించి 'అడవి' గుండా అరగంట ప్రయాణం" - ఇలా పంచమీ విభక్తి ప్రత్యయంగా "గుండా" (VIA) పదాన్ని వాడ్తుంటాం.

'గుండా'ల గుండా వెడితేనే అధికారం పదిలంగా వుంటుందని రాజకీయ నాయకులు ప్రబలంగా నమ్ముతుంటారు కూడా !

వీళ్ళంతా 'గుండా'లతో గుండకూడి పరిపాలిస్తున్నారని ప్రజలు చాలా బాధపడ్తుంటారు. గుండకూడటం అంటే గుంపుకట్టడం, ముఠాకట్టడం - అని!

గుండాల గురించి ముచ్చటించుకునేందుకు భలే విశేషాలున్నాయి.

'గుండా' అనే హిందీ పదం 'బద్మాష్' అనే అర్థంలో బయల్దేరి, ఇంగ్లీషుతో సహా అనేక భాషల్లోకి చేరింది. ఆ విధంగా గుండా సర్వాంతర్యామి అయ్యాడు. తెలుగులో గుండడు ఈ గుండాయే ! అయితే, వీడు హిందీలోంచి రాలేదు. మన గుండడు అచ్చమైన తెలుగువాడు.

నిజానికి గుండడు కేవల బంటు. దాసుడు మాత్రమే ! బానిసీడు, బంటు, వరపుడు, గుండడు - ఈ నాలుగూ సేవకుడికీ, పరిచారకుడికీ, దాసుడికీ, బానిసకీ అచ్చ తెలుగు పేర్లు. 'గుండడు' అంటే దాసుడు కదా... ఎవరికి దాసుడు...??

మన ఊరే తీసుకుందాం! 'మోతుబరు', 'దొడ్డ', 'లంబు' 'గరిమ' ఇలాంటి విశేషణాలు కల్గిన గొప్ప వ్యక్తుల దగ్గర పనిచేసే వ్యక్తికీ, ఓ అనామకుడైన రైతు దగ్గర పనిచేసే వ్యక్తికీ, మాటతీరులోనే ఎంత తేడా వుంటుందో మనకు అనుభవమే కదా... ఈ తేడానే గుండడిని అంటే సేవకుణ్ణి - 'గుండా'ని చేసింది.

'గుండవ' అంటే దాసి. గుండడు - దాసుడు. ఇద్దర్లో ఎవరైనా 'గుండా'గా మారవచ్చు.'యస్ బాస్' తరహా పాత్రధారులు వీళ్ళంతా !

ఆకతాయ, గుండగొయ్య, అడిబండ, మొండికట్టె, గులాము, మొప్పె, గోపు - ఈ పేర్లన్నీ గుండాలకు సమానార్థకాలు తెలుగులో.

'ఆకతాయులు మూఁకలై దేశమంతయుఁ జెఱచి...'' వంటి కవి ప్రయోగాలున్నాయి.

సంస్కృతంలో ఆతతాయి, తెలుగులో ఆకతాయి అయ్యాడు.

'గుండగొయ్య' అంటే, దుష్టుడు, మూర్ఖుడు, తుంటరి అని! 'అడిబండ-' పరమమూర్ఖుడు. యజమాని చెప్పిన అకృత్యాలను పూర్తిచేసి 'యస్‌బాస్' అంటూ చేతులు కట్టుకు నిలబడతాడు.

'మొప్పె' అంటే కరకుదనం గల మూర్ఖుడని ! మొండిరాయి లాంటివాడు.

'గోపు' అనేవాడు మొదట గోవుల్ని కాయడానికి దొర దగ్గర పనికి కుదిరి,

క్రమేణా గుండా గిరీకి ఉపయోగపడడం మొదలెట్టినవాడు. గుండాడించ డానికి చాలా నేర్పు కావాలి. గుండాయిజాన్ని చెలాయించడం మన పాలకులకు అదనపు అర్హత కదా !

రామాయణంలో రావణుడికి మారీచసుబాహులు, భాగవతంలో కంసుడికి పూతనలాంటి రాక్షసులు ఇలా గుండాడేందుకు బయల్దేరి భంగపడ్డవాళ్ళే!

గుండ+ఆడు=గుండాడు అంటే పిండికొట్టడం. గుండాడు, గుండాడించు పదాలు గుండగా చేయు, మెత్తగా పొడికొట్టు అనే అర్థంలో వాడ్తుంటాం. అలాగని మనకి గుండాడించి ఇచ్చే పిండిమర యజమానిని గుండా అనకండి! ఈ అర్థం వేరే.

ప్రస్తుతం మన చర్చ దుండగంతో గుండాడే గుండా గురించి! "దుండ గంబునం బూల గుండాడ వికలిత వృత్తిఁ గల్పక వాటి వీటిఁబోయే" అని వరాహ పురాణంలో దుండగంతో గుండాడటం గురించి కన్పిస్తుంది. గుండాడటం అనేది అత్యంత ప్రాచీన కాలం నుంచీ తెలుగులో వాడుకలో వున్న మాట !

గుండక్రియ - ఓ మధురమైన రాగం. సంగీతశాస్త్రానికి సంబంధించిన మాట ఇది.

తోకలేని కోతిలాంటి జంతువుని గుండంగి అంటారు. బహుశా, దీనికి గుండాల వంటి లక్షణాలేమైనా వుండి వుంటాయి.

మన తెలుగు సిన్మాలలో గుండా పాత్రలకు తప్పనిసరిగా గుండు వుంటుంది. అందుకని, మనవాళ్ళు "గుండాడు" అని పిలుస్తుంటారు - గుండున్న వాడని !

గుండాలు ఎప్పుడూ నిప్పుగుండాలే !

జనసామాన్యానికి యమగండాలే.

# అదురు

అదరగొట్టేవాళ్ళూ, అడలగొట్టేవాళ్ళూ, అదరవేసేవాళ్ళూ, అదిరందని అనిపించే వాళ్ళూ ప్రాచీనకాలం నుంచీ తెలుగువారికి కొత్తేమీ కాదు.

అది+ర్+అయ్య-అద్దిరయ్య-అంటే, ఆశ్చర్యపడటం.

'అదిర' అంటే ఆశ్చర్యం. "అదిరా ! మది రాయి వంటిది-" అని ఊర్వశి నవ్వుతూ పలికిందిట.

అదిరించు - ఆశ్చర్యంతో కదిలిపోయేలా చేయడం.

అదిరిపాటు - ఉలికిపాటు.

అదిరిపడ్డాడు - అంటే, వాడిలో అదురుపుట్టిందని !

అదరు గుండె చిన్న సంఘటనకే చలించిపోతుంది.

'అదరుగ్రోవి' అంటే, తుపాకీ గొట్టం ! భయపెట్టి వణికిస్తుంది కదా.

'అదరు గండడు-' భయపెట్టేవాడు.

అదిరిపడి మేల్కొన్నాడు - అంటాడు ఎఱ్ఱన హరివంశంలో !

'అదరులు' అంటే నిప్పుకణాలు. "చిచ్చుటదరులు ఎగిశాయి" అనీ "అదరుటగ్గులకోటులు" అనీ చక్కని కవిప్రయోగాలున్నాయి.

అదురంటింది, అదరేశాడు లాంటి మాటలు అలనాటి మన పూర్వులైన తెలుగువాళ్ళు మాట్లాడుకున్నవే ! ఇప్పుడు మనమేదో అదరగొడ్తున్నాం. అనుకోనవసరం లేదు.

"పిరికపందలది అదురుగుండె."

"అదురుగుండె - పిక్క బెదరు" అనేది మంచి తెలుగు జాతీయం.

"అదురు బెదురు లేని యువత జాతికి కావాలి."

"అదరంటా పరిశీలిస్తే..." అంటే, లోతుగా ఆలోచిస్తే... అనడం.

అతని భాగ్యం అదిరేలా ఆ అందమైన అమ్మాయి భార్యగా దొరికింది - అని కువలయాశ్వచరిత్రలో ఓ పాత్ర అంటుంది.

అదిరే వేటు ఒక్కటి తగిలితేగానీ ఆ అదిరిపాటు అణగదు.

సమయానికి సమాచారం చేరవేయడానికి "అదిరిపాటు"గా అంటే, అమితవేగంగా వస్తారు రాజుల వేగులు.

"అదుకు - బిదుకు" మంటూ గడుపుతుంటారు యుద్ధభయంతో సరిహద్దుల్లో ప్రజలు.

'మిన్నదిరింది' అంటే, ఆకాశం దద్దరిల్లిందని!

అదిరింది గురూ... అన్పించుకోగలగడం ఆధునికుల పరమ లక్ష్యం! BE THE BEST అనడం పాతకాల సిద్ధాంతం. BE THE TOP OF THE BEST అన్పించుకోవడం పోటీయుగంలో ఈనాటి యువతరానికి అత్యవసరం కూడా!

అదీ అదరగొట్టే వాడికి కావలసిన ప్రాథమిక లక్షణం !!

# అదవ - యదవ

కంసుడు మదం అణగ్గొట్టేసరికి అదవలై తలలు వంచుకుని యాదవులు ఇళ్ళకు పోయారని పోతనగారు భాగవతంలో వర్ణిస్తాడు.

'అదవ' అంటే రక్షణ లేనివాడు - అని!

'అదవకాలు' ఈడుస్తూ నడుస్తాడు వికలాంగుడు.

'అదవ బతుకు' - ఒకరి మోచేతికింద నీళ్ళు తాగే బతుకు.

'అదవెట్టుకోవడం' అంటే, తనగోడు మొరపెట్టుకోవడం.

'అదవ పడటం' అంటే, కంగారు పడటం.

'అదవ కాపురం' బలహీనుడి కాపురం.

"నీకునేనేం అదవ చిక్కినాననా... ఇన్ని మాటంటున్నావ్ !" అంటుంది ఓ అబలా !

'అదవదలైన పయ్యెదలు నందము తప్పిన హారవల్లులన్' అని జక్కన విక్రమార్క చరిత్రలో అందంగా ఉపయోగించాడీ మాటని!

'అధవః' అంటే సంస్కృతంలో అనాథ! 'విధవ' అనేది అన్నిరకాల ఆధారాలూ కోల్పోయి అన్ని మంగళ ప్రదమైన శుభలక్షణాలూ కోల్పోయిన స్త్రీ.

'అధవ' పదం అదవ, యదవగా తెలుగులో వ్యాప్తిలో వుంది. అ(య)దవ, వెధవ కూడా వీడే !

'అదవ తాగుడు' అంటే నీచంగా దిగజారి అదుక్కొని తాగడం. తాగుబోతులకు తాగిన తర్వాత ఉచ్చనీచాలుండవు. 'KNAVE' అనే ఇంగ్లీషు మాట ఇలాంటి అదవ తాగుబోతులకు వర్తిస్తుంది. NIGGAR BOOZING అంటే అదవ తాగుడు !

"తన చెలు లిండ్లయందదవ త్రావుడు త్రావుచు" అంటూ ఎంగిలితాగుడు తాగేవాళ్ళని నిరసించాడు తెనాలి రామకృష్ణుడు - ఇది పాండురంగ మహాత్మ్యంలో ప్రయోగం.

ఒకరు త్రాగి గ్లాసులో మిగిల్చిన అడుగూబొడుగూ సారాన్ని కక్కుర్తి కొద్దీ తాగడాన్ని 'అదవతాగుడు' అంటారు.

యదవలూ, అదవలూ, వెధవలూ మాత్రమే ఇలాంటి పని చెయ్యగలరు!!

# గోరు

'గోరుమోపి గిల్లని చిగురాకు' అనే చక్కని ప్రయోగానికి అర్థాన్ని ఊహించి చూడండీ...!' "ఎవరి దృష్టీపడని స్వచ్ఛమైన కన్నెపిల్ల" అని ! పిల్లలమర్రి పిన వీరభద్రుడు శకుంతలా పరిణయం కావ్యంలో చేసిన ప్రయోగం ఇది.

"పూవుల గోట మీటు తఱి" అని ఆముక్తమాల్యదలో కృష్ణదేవరాయలు చేసిన మరో అద్భుత ప్రయోగం కూడా ఇలాంటిదే !

"రవయుంగరంబుల రత్నాల దీప్తులు వాలారుగోళ్ళపై జాలువాఱు..." అని శ్రీనాథుడు హరవిలాసంలో గోళ్ళ విలాసాన్ని వర్ణిస్తాడు.

మొత్తం మీద 'గోరు' మహాకవుల కవితావస్తువే. కాదేదీ కవిత కనర్హం కదా !!

వీణలాంటి తీగ వాయిద్యాలను వాయించడానికి వేలికి చిన్నగోరుని తగిలించుకొంటారు. బంగారపు గోరునే చేయించుకొంటారు స్థితిపరులు.

'గద్దగోరు' అనేది దొంగతనాలు చేయడానికి కావలసిన పనిముట్లలో ఒకటి. చోర కళాకారుల సామగ్రిలో ఇది ముఖ్యమైంది !

అరటిపువ్వుపై దొప్పలు తీసి చూడండి - లోపల కేసరాలు అందంగా అమరి వుంటాయి. ఈ కేసరం తలభాగాన్ని "కదళీకేసరాగ్రవృత్తాంతం" అంటారు. తెలుగులో చాలా క్లుప్తంగా 'గోరు' అని పిలుస్తారు. దీన్ని 'దొంగ' అని కూడా కొన్ని ప్రాంతాల్లో పిలిచేవాడుక వుంది. గోరుతో గిల్లి ఈ దొంగని తీసేసి కూర వండుకుంటారు.

'గోరంత' అంటే అల్పమైంది-అని. గోరంత దీపం కొండంత వెలుగు నిస్తుంది కదా...

"గోటనన పనికి, గొడ్డలేల-?" అంటుంది ఓ కవి ప్రయోగం. 'గోరంతాలస్యంబునఁగొండంత ప్రయోజనము దప్పుననఁగా వినమే..." అంటాడు కళాపూర్ణోదయంలో పింగళిసూరన... గోరంత ఆలస్యం అయితే, కొండంత ప్రయోజనం తప్పిపోవచ్చన్న సంగతి వినలేదా... అని !

గోరు కొనని 'గోరుముక్కు' అంటారు.

గోళ్ళు తీసేందుకు ఉపయోగించే చిన్న చాకులాంటి పనిముట్టుని 'గోరుగల్లు,' గోరులి (గోరు+ఉలి) అంటారు. నెయిల్‌కట్టర్ అనే ఇంగ్లీషు మాటకు ఇది చక్కని సమానార్థకం! ముల్లు తీసేందుక్కూడా దీన్ని వాడతారు. గోరుగోలు, గోరుగండ్లు, గోరుగొండి అనే పేర్లు కూడా వున్నాయి. 'గోరుగాలం' అనేది ముల్లు తీసేందుకు వాడే లావుపాటి సూది !

బంతి ఆడేప్పుడు మునివేళ్ళతో గోళ్ళు తగిలేలా బంతిని పట్టుకుని విసరడాన్ని 'గోరించడం' అంటారు. గోరించడం అంటే బంతులాటే! "చెండు గోరించిన చెలువున" అనేది కవి ప్రయోగం !

క్రికెట్టాటలో బంతిని గుండ్రంగా తిరిగేలా గోటితో తిప్పి విసరడం "స్పిన్ బౌలింగ్ !" దీన్ని 'గోరించడం'గా అన్వయించవచ్చుకూడా ! "గోరింపు బంతి" "గోరింపులాడు" వంటి ప్రయోగాలూ వున్నాయి.

గోరించడానికి బంతులాటతో పాటు ఇంకా మరికొన్ని అర్థాలున్నాయి. రోగం వచ్చి మూలపడ్డవాడు చేసే మూలుగుడుని గోరించడం అంటారు.

గర్వంతో నిర్లక్ష్యంగా మాట్లాడడాన్ని కూడా గోరించడం అనే అంటారు.

హత్య చేయడాన్ని, సంహరించడాన్ని కూడా 'గోరించడం' అనడం పూర్వకవి ప్రయోగాల్లో తరచూ కన్పిస్తుంది.

'గోరింపులాడు' అనేమాటని రౌడీమూక చేసిన ఆగడాలకు సంబంధించి వాడ్తుంటారు.

'చుక్కలు గోరాడు సున్నపు మేడలు' అనే పెద్దన గారి ప్రయోగంలో 'గోరాడు' అంటే తాకడం అని!

చీరలు నేసేప్పుడు సన్నని గీతలా కన్పించేందుకు వేరే రంగుదారాన్ని వాడతారు. గోరుతో గీసినట్లుంటుంది కాబట్టి దీన్ని 'గీరు' అంటారు. జంటగీర్లు కూడా నేస్తారు.

అనేక గీర్లున్న చీరని గీర్లంచు అనీ, పంచెని గీరంచు పంచె అనీ, ఇలాంటి రెండు పంచల్ని కలిపి గీరంచు పంచెల చాపు అనీ పిలుస్తారు.

'గోరు బుగిడీ' అంటే అంచునేతలో చిన్న గోరంతమేర కొలుకులు పడేలా నేసిన డిజైను -

గీరు, గోరు రెండు పదాల్నీ వాడతారు. గోరంచు ధోవతి, గీరంచు చాపు అనీ పిలుస్తారు.

గీరలు పడేలా నేయడాన్ని గీర్లిడడం అని కూడా అంటారు.

కుండలు చేసేటప్పుడు మూతి దగ్గర గోటితో సన్నని గీతపెడతారు. గోరుగీత అంటారు దీన్ని. 'గోరుసుట్టు' అనికూడా అంటారు.

గోరుముష్టి అంటే, గోళ్ళు మునిగేదాకా చేతిని ముంచి తీసి వేసే ముష్టి. రవ్వంత, కొద్దిగా.... అనే అర్థంలో వాడదగిన మాట ఇది !

'గోరుచిక్కుడు' - చిన్న చిక్కుడు అనే అర్థంలో, గోరంత చిక్కుడు గోరుచిక్కుడు అయి ఉంటుంది. గోరుతో విరిచి పీచు తీసే అలవాటు కూడా గోరుచిక్కుడుకు ఆ పేరు తెచ్చిపెట్టి వుండొచ్చు.

గోరుకీ, అడుగున వున్న కండకీ మధ్య లేచిన చిన్న చీముగడ్డని 'గోరుచుట్టు' అంటారు. వేలికొసలు సున్నితమైన స్పర్శని గ్రహిస్తాయి. అందుకని అక్కడ నాడీ సంచలనం ఎక్కువ. కాబట్టి, గోరుచుట్టు మరీ ఎక్కువగా బాధ పెడ్తుంది. గోరుచుట్టు లేచిన వేలిమీద రోకటి పోటు తగిలిందనుకోండి... ఆ బాధ వర్ణనాతీతం.

"ప్రజ వేచఁ దలంచిన గోరుచుట్టుపై రోకటి పోటు చందముగ రోసి జనుల్ ననుఁజూచి తిట్టరే...?" ఈ ప్రజల్ని ఇంతకన్నా వేధిస్తే గోరుచుట్టుమీద రోకటి పోటని నన్ను తిట్టిపోస్తారు - అని చక్రవర్తి భయపడతాడు జైమిని భారతంలో ! అవి ఆ రోజులు కదా...!!

కాసేపు గడిపి వెళ్ళిపోయాడు అనడానికి గోరంత పొద్దుండి వెళ్ళాడు, గోరంత సేపున్నాడు... ఇలా అంటుంటారు.

'గోరుమీటు' అనే స్వీటు అలనాటి తెలుగువారి పిండివంటల్లో ఒక రకం. గోరులా వంపు వున్న ఉలిని గోరుచీరణం, గోరుచీరడం అని పిలుస్తారు.

'గోరిడటం' అంటే గిల్లడమే ! తాంబూలం మడిచి అందిస్తూ, ప్రియుడి చేతిని గిల్లడం గురించి శ్రీనాథుడు నైషధంలో వర్ణిస్తాడు.

గోరుని ఉపయోగించి చేసే పనులు ఇంకా చాలా వున్నాయి. గోకు, గీఱు, దువ్వు, కోయు, త్రుంచు, చీల్చు, నాటు, గుచ్చు... ఇలా !

ద్రౌపది మనస్సుని ఇంతకాలం ఆ దుర్యోధనుడి మాటలు గీరిన అమ్ముల్లా (గుచ్చుకున్న బాణాల్లా) బాధించాయట - భారతంలో ప్రయోగం ఇది.

"కూరిమి మీఱ గీఱి" అంటే ప్రేమగా లాలించడం అని ! గోళ్ళతో గోముగా జుట్టులోకి వ్రేళ్ళుపోనిచ్చి దువ్వడాన్ని 'గీఱు' అంటారు.

గోకుడు పాఱ నేలని గోకడానికి, అంటే - పై పొరలు చెక్కడానికి ఉపయోగ పడ్తుంది. దోకుడు పాఱ, తవుగోల అని కూడ అంటారు.

వెన్న కాచినప్పుడు గిన్నె అడుగున మిగిలిన నేతి మడ్డిని 'గోకుడు' అంటారు. గోకి తియ్యవలసి వస్తుంది కాబట్టి ఈ పేరు వచ్చి వుండవచ్చు. కొన్ని ప్రాంతాల్లో గోదావరి, గోదారి అని కూడా పిలుస్తారు దీన్ని.

'గోకురు' అనేది కొబ్బరికోరుకు ఇంకో పేరు. ముళ్ళుముళ్ళుగా వుండే గుండ్రటి మువ్వని కొబ్బరికోరం అంటారు. కోరంతో కోరి కోరుని తీస్తారు. గోకి తీసిన కోరుని 'గోకురు' అని పిలుస్తారు.

గోరుముద్దలు కమ్మగా వుంటాయి. అన్నం కలుపుకునేప్పుడు గోరుమీంచి తీసిన చిన్న ముద్ద గోరుముద్ద. గోరంత ముద్ద !

'గోరు రాజనాలు' అనే పేరుతో ఒక రకం ధాన్యం వుండేవి.

కస్తూరిపట్టెలు, చెన్నంగులు, శ్రీరంగాలు, చింతపూలు, గోరు రాజ నాలు... ఇవన్నీ అలనాటి ధాన్యాలు.

గోరువంక అనేది చక్కటి పేరు.

గోరువంకని గోరవంక, గోరంక, గోరింక, గోరంకి ఇలా రకరకాలుగా వ్యవహరిస్తుంటారు. 'గోరంకుః' అనే సంస్కృతపదం ఈ పేరుకి మాతృక. వంకరగోరు కల్గిన పక్షి అనీ, గోరంత వంక - చిన్న వంకర గోరు (వంపు) కల్గిన పక్షి అనీ దీనికి మరొక అర్థాన్ని కూడా చెప్తారు.

రతిశాస్త్రపరంగా - కేళీకలా పాలప్పుడు గిచ్చినందువలన పడిన గోటి గాటుని 'గోరువంక' అంటారు. 'నఖ క్షతం' అంటే తెలుగులో ఇదే ! గోరొత్తు గోటనొక్కు గోరు నెలవంకలు అని కూడా అంటారు.

గోరంత వెచ్చగా - అంటే, కొంచెం వేడిగా వుంటుంది కాబట్టి, గోర్వె చ్చన, నులివెచ్చన, గోరువెచ్చ - ఇలా పిలుస్తుంటారు అల్పమైన వేడిని.

గోర్వెచ్చ చమురు 'అంటుకొని' తలంటి పోసుకునే వాళ్ళు మన పూర్వీకులు! షాంపూతో స్నానం మొదలయ్యాక తలంటుకోవడం ఎక్కడిదీ - తలకి డిటర్జెంట్లు కలిసిన నురుగు ద్రావకాలే (షాంపులు) రుద్దడం తప్ప !!

పశువులు కొమ్ముల్తో నేలని కుళ్ళగించి దుమ్ము ఎగజిమ్ముతూ వుంటాయి.

దీన్ని 'గోరాడటం' అంటారు. మదోత్సాహం కలిగినప్పుడు పశువులు చేసే పని ఇది. కొమ్ములు లేని కుక్కలు, తోడేళ్ళు వంటివి కూడా గోళ్ళతో నేలను చీలుస్తాయి. "కోరాడటం" అని కూడా అంటారు దీన్ని.

ఒళ్ళు మదం ఎక్కిన కొందరు మనుషులు అమాయకులైన ప్రజల్ని ఇలానే "గోరాడ్తుంటారు". పశుప్రవృత్తి కల్గినవారికి ఇది సహజం కదా !!

"అంటే అనుకోనీ... వాడికేం పూడిందా...?" అనడానికి "నోరిమాటకుఁ దనకేమి గోరవోయె? అని ప్రయోగిస్తాడు పోతన !

ఎవడేమనుకున్నా అధికారంలో వున్నవాడికి గోరపోయేది (పూడేది) ఏమీ లేదు గానీ, ఘోరం అయిపోయేది పేదవాడే !!

# అడ్డు - అడ్డం

**చ**ల్లలమ్మగఁ బోవు గొల్ల కొమ్మల నడ్డుకొన్న.... కృష్ణలీలలు తెల్సినవే!

ఆడపిల్లల కాలేజీ గేట్ల దగ్గర ఇలాంటి దృశ్యాలు కన్పిస్తూనే వుంటాయి. చరిత్ర వున్నంతకాలం !

పురుషాధిక్య సమాజంలో ఆడపిల్లల్ని వేధించడం ఒక సరదా అనేది కుర్రకారులో వ్యాపించివున్న ఓ దురభిప్రాయం!

"కన్నుదోయికి అన్యకాంత లడ్డంబైన మాతృభావము జేసి మరలువాడు-" అంటే, పరాయి ఆడవాళ్ళు కళ్ళకు అడ్డంగా వస్తే తల్లిలా భావించుకుని తప్పుకు పోయేవాడు - అని! పోతనగారి పలుకులివి!

"ఐనా ఓ మాట అడ్డంగా చెప్తాను విను-" అని భారతంలో శల్యపర్వంలో ఓ మంచి ప్రయోగం-" అడ్డు చెప్తున్నాననుకోకు..." అన్నట్లు!

అడ్డుపుల్ల వేశాడు అంటే, అవరోధాల్ని సృష్టించాడని! కుటుంబపరమైన తగువుల్ని కులపెద్దలు విచారించేటప్పుడు గుండ్రటి గిరిగీసి ఆరోపణలు చేసిన వ్యక్తి అందులో ఓ పుల్లవేస్తాడు. ఆ ఆరోపణల్ని ఖండించేవాడు దానిపైన అడ్డుపుల్ల వేస్తాడు. విచారణ కొనసాగుతుంది. ఇది కొన్ని కులాలలో ఇప్పటికీ వున్న ఆచారం.

'అడ్డుదావా' కూడా అడ్డుపుల్ల లాంటిదే. నేరం ఆరోపించిన వాడి మీదకే నేరాన్ని నెట్టే ప్రయత్నం అని కూడా అర్థం చెప్పుకోవచ్చు.

'అడ్డుసవాలు' అంటే, ఎదురు ప్రశ్నించడం. ఎదురు తిరగడం.

"అడ్డకాలు" పెట్టి వేధించడం కొందరికి సరదా! పరిగెత్తేవాడికి అడ్డంగా కాలుపెడితే ఎగిరి ముందుకు పడతాడు. అడ్డకాలు పెట్టేవాళ్ళకు అదొకాట!

"అడ్డవాటు"గా వచ్చి మన స్వంత విషయాల్లో తల దూరుస్తుంటారు కొందరు.

'అడ్డతల' పెట్టి, మనవల్ల ఏమీ కాదంటూ మనల్ని నిరుత్సాహ పరిచేవారూ వుంటారు.

'అడ్డాట' చాలామందికి ఇష్టమైన ఓ పేకాట!

అడ్డసవరం - అనేది ఓ ఆభరణం.

'అడ్డసారె' అంటే పాచిక!

నేరస్థుల కార్ఖానాని 'అడ్డా' అంటారు. అండర్‌గ్రౌండ్ డాన్‌ల పోటీ ప్రభుత్వ కేంద్రాన్ని 'అడ్డా' అని పిలుస్తారు. అడ్డాలో మనుషుల్ని అడ్డుకోగల ధైర్యం ఎవరికుంది?

'అడ్డుగొడ్డు' అనేది ఒకప్పటి అందమైన తెలుగు తిట్టు. అడ్డగొట్టు వెధవలు, ఒడ్డారం (నా) కొడుకులు - ఇలా తిడ్తుండేవారు - ఆ రోజుల్లో.

"అడ్డదిడ్డంగాళ్ళు" ఎప్పటికీ ప్రమాదమే! ఇది కూడా పాతకాలం తెలుగుతిట్టే!

అడ్డవాటుగా ఓ చెంపదెబ్బ పీకిందంతే... మళ్ళీ దాని జోలికి పోలేదు వాడు-" అంటుంటాం ఇప్పటికీ.

పొగరెక్కి ప్రవర్తించేవాణ్ణి చూసి, వాడిని కన్నతల్లి ఆక్రోశిస్తూ అంటుంది. "అడ్డాలనాడు బిడ్డగానీ, గడ్డాలనాడు బిడ్డా?" అని!

అడ్డమైన గడ్డీ తినకు, అడ్డమైన సావాసాలూ చెయ్యకు-" అని పిల్లల్ని హెచ్చరిస్తాం.

"అడ్డూ అదుపూ" అనేది, అందంగా అమరిన జంటపదం.

"అడ్డంగా పుట్టి అమ్మని ఏడ్పించాడు - అడ్డంగా పెరిగి ఊరుని ఏడ్పిస్తున్నాడు-" అని తిట్టదగిన వ్యక్తులు చాలామంది కన్పిస్తారు.

'కడుపులో బిడ్డ అడ్డం తిరిగాడు' అంటుంది మంత్రసాని !

నాలుగు పంకాయ ముక్కలు 'అడ్డం' వేసి పులుసుకాచి వంటయ్యిందని పించే వాళ్ళుంటారు.

అడ్డుగోడ మీద పిల్లి ఎటు దూకుతుందో తెలియదు. కానీ, అడ్డుగోడ మీద దీపం పెడితే, రెండువైపులా వెలుతురొస్తుంది. జాతికి ఇలాంటి జీవదీపాలు కావాలి. 'గేహళీదీప న్యాయం' అంటారు సంస్కృతంలో ఈ సామెతని !

"అడ్డగట్టు" అనేది ఓ సుఖవ్యాధి. ఆధునికవైద్యంలో "సిఫిలిస్" అంటారు దీన్ని.

ఇన్ని విషయాలు ముచ్చటించుకొని, "అడ్డగాడిద" గురించి చర్చించక పోతే అన్యాయమే మరి !

గాడిద తన మర్మావయంతో ఒక చిన్న తప్పుచేసి 'అడ్డగాడిద' అని తిట్లు తింది - తెలుగువాళ్ళతో! గాడిద అడ్డగాడిద ఇలా అయ్యిందంటారు :-

'దుప్పి భోజనం' అనే మాట వినేవుంటారు కదా ...! ఏ పనీ లేని మగదుప్పి తన మర్మావయవాన్ని నోటితో అందుకుని ఆస్వాదిస్తుంది. నాలుగు కాళ్ళ జంతువుల న్నింటికీ ఈ అలవాటు సహజమే! 'FELLATIO' అంటారు ఈ అలవాటుని.

కానీ, కష్టించి పనిచేయాల్సిన బాధ్యత వున్న గాడిద ఈ పనిచేసి 'అడ్డగాడిద' అన్పించుకొంది. బాధ్యత మరిచి ఎవడు వ్యవహరించినా వాడు అడ్డగాడిదే మరి!

చివరగా ఒకమాట-

మనల్ని అద్దుపెట్టి బ్యాంకులోనో, చీటీల కంపెనీలోనో లోను పుచ్చుకొని మళ్ళీ కన్పించనివాడు మనల్ని అడ్డాడినట్టేకదా !

అందుకే - దేన్నయినా అద్దుకోండి గానీ, ఎప్పుడూ "అద్దు"గా వుండకండి! "అద్దం"గా పోవాల్సి వస్తుంది !

# దుబారా

గుప్పిట పట్టి ఒకేసారి కరివేపాకు దూసినట్లు మాయమాటలు చెప్పి నమ్మించి మనసొమ్ముని ఎవడైనా ఇలా దూసుకుని తినేశాడనుకుందాం... వాణ్ణి దూయు+పర+తిండి అనే మూడు అర్థాలు కలిపి "దూబరదిండి" అంటారు.

ఈ దూబర దిండి "నక్క చిక్కుల మారి, పెక్కుకురూపి, బొంకులబాన-" అని చెన్నబసవ పురాణంలో అత్తనూరి పాపకవి గారు వర్ణించినంత దుష్టుడు. అన్ని అవలక్షణాలూ వున్నవాడు. తేరతిండిగాడు.

ఈ దూబర దిండి పాలిట పడ్డవాడు 'దూబర' అయిపోతాడు.

దూబర అంటే, నిష్ఠురమైన, పనికిమాలిన అని అర్థం. దుబారా ఇలానే ఏర్పడింది. ఇందుకు మనం అనుకున్నట్లు, కరివేపాకు దూసినంత తేలికగా రూపాయినోట్లని దూయు+పారవేయు లాగా ఖర్చుచేస్తే ఏమౌతుంది? దుబారా అయిపోతుంద.

అటమటమయ్యే నాభజనమంతయు భూవరా ! అనే ఆ కవి ప్రయో గంలో 'అటమట' అంటే వృథా అయ్యిందని.

"సుఖమూలమైన కాయంబు చపచపగా విడనాడి" అంటే వృథాగా వదిలేశాడని !

"ప్రోచికోలు మాటలు" వృథాప్రసంగాలు, వ్యర్థపదాలు... అని !

"వారి ముచ్చట వితావితలు చెయ్యకు" అన్నప్పుడు వ్యర్థపరచవద్దనే అర్థం... ఇవన్నీ 'దుబారా' అనడానికి సమకార్థకాలు. వ్యర్థపరచేవాటిలో పరాకాష్ట దుబారా చేయడం !

రేపు గురించి, ఆలోచనలేని విలాసవంతమైన దుర్వినియోగాన్ని దుబారా - అని మనం నిర్వచించవచ్చు కూడా !

తేరతిండిగాడు, పరపిందరతుడు, పరపిండాదుడు పరాన్నభోజి, బోగుబడి, దూబరదిండి... వీళ్ళంతా జనాల్ని బాదుకుని బతికేవాళ్ళు.

ఇలాంటి వాళ్ళలో ఒక్కడికి మనం తగిలినా మనమే "దుబారా" అయిపోతాం... కాదూ...??

# చుక్క

ఆకాశంలో మినుకుమినుకు మనేవన్నీ చుక్కలే!

నడి సముద్రంలో పడవ నడిపేవాడికి చుక్కలే దిక్కు చెప్తాయి.

"దిక్కెక్కడ దిక్కెక్కడ - ఉదధి మధ్యన దిక్కెక్కడ... చుక్కలు రెక్కలు విప్పారినప్పుడు నడివీధిని చుక్కలాడ..." అనే వేటూరి సుందర్రామూర్తి పాట గుర్తుకొస్తుంది... ఈ మాటవింటే !

పడవ నడిసేందుకు 'చుక్కాని' ఉపయోగపడ్తుంది. కానీ, నడిచే దారిని చెప్పేది చుక్క !!

సంస్కృతంలో శుక్ర అంటే, కాంతి, స్వచ్ఛత. ఈ అర్థంలోంచే 'శుక్రగ్రహం' కూడా ఏర్పడింది. ప్రాకృతభాషలో సుక్క అంటే, శుక్రగ్రహం అనీ, పాళీభాషలో 'సుక్క' అంటే, నక్షత్రం అనీ, కన్నడంలో 'చుక్కి' అంటే శుక్రగ్రహం అనీ, శుక్రాచార్యుడు అనీ, తమిళంలో చుక్కై అంటే, నక్షత్రం అనీ అర్థాలున్నాయి.

చుక్కపొడుపు అంటే, తెల్లారబోయేముందు పొడిచిన శుభనక్షత్రం... అదే శుక్రగ్రహం. దీన్నే వేగుచుక్క అని కూడా అంటారు.

శుక్రగ్రహం జోతిశ్శాస్త్రరీత్యా శుభగ్రహమే కానీ, శుక్రాచార్యుడు రాక్షసుల గురువు. కాబట్టి, అతని ముఖం చూస్తే అయ్యే పనులు కాకుండా పోతాయనే నమ్మకంతో శుక్రగ్రహం వున్న దిక్కున నడక ప్రారంభించేవారు కాదు.... మన పూర్వులు.

అనుకున్న పని చెడి, అంచనాలు తలకిందులయినప్పుడు 'చుక్కెదు రయ్యింది' అనడం, అలా పనులు చెడగొట్టిన వాణ్ణి 'ఎదురుచుక్క' అనడం ఇలా మొదలయ్యింది.

చుక్కవాలింది - అంటే, ఎదురు తిరిగింది, ప్రతికూలించింది - అని!

పరమ భాగవతులకు చేరువపంట, పచ్చి పాపాత్ములకు ఎదురుచుక్క మా బెజవాడ 'కనకదుర్గ' అని మనం కూడా సుగుణ్మక (పాజిటివ్) అర్థంలో ఈ పదాన్ని వాడుకోవచ్చు. ఆగడాలను ఆపి, రౌడీలకు ఎదురుచుక్క అయిన పోలీసాఫీసర్‌ను పదికాలాలపాటు ప్రజలు గుర్తెట్టుకొంటారు.

చుక్కల్లో చూసి మాట్లాడేవాడు అహంకారి, పొగరుబోతు - అని !

పెరుగుతున్న ధరల్ని 'చుక్కలంటాయి' అంటాం.

చుక్కలు గోరాడు సున్నపు మేడలు - అంటే ఆకాశహర్మ్యాలు అనే అర్థంలో పెద్దనగారు చేసిన ప్రయోగం ఇది !

చుక్కల పేరు అంటే తారాహారం. నక్షత్రాల ఆకారంలో చేసిన బంగారపు గొలుసు.

చుక్కలచేరు, చేర్చుక్క అనేవి పాపిడిచేరుకు పేర్లు.

చుక్కరేడు, చుక్కగమికాడు, చుక్కలదొర, చుక్కలరాజు, చుక్కలరాయుడు - ఇవన్నీ చంద్రుడికి తెలుగుపేర్లు.

"పూర్ణచంద్రికల దిక్కుల కెల్లను దెలివి దీపించి, చుక్కలగమికాడు చూపెట్టమింట..." అంటాడు, నిట్టలరాజు కాచభూపతి - రంగనాథ రామా యణం ద్విపద కావ్యంలో !

"చుక్కల రాయని గేరుమోము గలవాడు" అని శ్రీరామచంద్రుణ్ణి త్యాగయ్య కూడా కీర్తించాడు.

"చుక్కలతెరువు, చుక్కల త్రోవ - ఇవి ఆకాశాన్నీ తారాపథాన్నీ సూచించే పదాలు.

"చుక్కబొట్టు" చుక్క ఆకారంలో పెట్టిన బొట్టు. బొట్టు మనకే కాదు, పశువుల ముఖానిక్కూడా అలంకారంగా వుంటాయి. గుమ్మాలకు చుక్కబొట్లు పెట్టి శోభాయమానంగా అలంకరిస్తారు మనవాళ్ళు.

అవిసె ఆకుబొట్టు, పూర్ణచంద్రతిలక, నెలవంకబొట్టు, గుమ్మడి విత్తు బొట్టు, దోసగింజ బొట్టు... ఇలా బొట్లు అనేక రకాలు. బొట్టు ఆడవారికీ, మగవారిక్కూడా అలంకారమే ! పాంట్లూ, షర్ట్లూ వేసుకోవడం మొదలెట్టిన ఈ నూరు సంవత్సరాల్లో మగవారి అలంకరణలో చాలా మార్పులు వచ్చాయి. బొట్టుబిళ్ళలు అనే స్టిక్కర్లు వచ్చాక ఆడవాళ్ళు కూడా ఇలాంటి పేర్లనీ, ఇలాంటి అలంకారాన్ని దాదాపుగా మరిచిపోయారు.

"ఘనసార పంక మొక్కలతాంగి దెచ్చిన ముట్టి వ్రేలనే చుక్కబొటువెటి" - అంటూ అల్లసానిపెద్దన మనుచరిత్రలో విరహంలో పడ్డ వరూధిని గురించి చెప్తూ, ఆమె ముఖం కడుక్కొని వచ్చాక, ఓ చెలికత్తె, పచ్చకర్పూరం వేసి పలుచగా తీసిన గంధాన్ని అందిస్తే, దాన్ని వేలితో తాకి నుదుట చుక్కవంటి బొట్టు పెట్టుకొందిట ! పచ్చకర్పూరం మానసిక తాపాన్ని తగ్గిస్తుంది కదా... అందుకని !

చుక్క తొలివేల్పు గంగ - అంటే, తారకాసురుణ్ణి జయించినవాడు - కుమార స్వామి - అని!

చుక్కనుదుటి పిట్ట - అంటే, గరుత్మంతుడు.

ఉల్క ఎప్పుడు రాల్తుందో తెలియనట్టే, కొందరు బంధువులు ఎప్పుడు వచ్చి

వాలిపోతారో తెలియదు. ఉన్నపాటున ఊడిపడ్డాడు - అంటాం. "అంతం జుక్క తెగిపడిన వడుపున" అని తెనాలి రామకృష్ణుడు పాండురంగ మహాత్మ్యం కావ్యంలో చుక్కతెగిపడ్డట్టు అకస్మాత్తుగా వచ్చాడంటాడు ఓ బంధువుని.

'ధ'కు కడుపున చుక్కబెట్టిన 'థ' అవుతుంది - అంటాం.

బిందువు, నక్షత్రం, తిలకం - ఈ మూడింటికీ చుక్క అనే అర్థం. బిందువుల్ని కూడా చుక్కలనే అంటారు.

చల్లచుక్క, నేతిచుక్క, నీటిచుక్క లాంటి పదాలు మనవాడుకలో వున్నవే!

'ఒక్క చుక్క సిరాతో కోటి మెదళ్ళను తట్టి లేపుతాను' అనేది ఆధునిక కవి నినాదం!

చక్కని చుక్క, టక్కరి దొంగ జానపద గాథల్లో నాయికా నాయకులు.

సంస్కృతంలో చుక్ర అంటే, పుల్లనిది - అని! ఈ చుక్ర - తెలుగులో చుక్కగా మారి చుక్కకూర, చుక్కకాడ వంటి పేర్లు ఏర్పడ్డాయి - పుల్లనికూర అని.

'చుక్కకార', 'చుక్కపిల్ల' అనే చేపలు కూడా వున్నాయి - అయితే, 'పులుపు'తో వీటికి సంబంధం వుండివుండకపోవచ్చు-

బళ్ళో అందరికన్నా ముందొచ్చిన మంచి విద్యార్థి చేతిలో బెత్తంతో 'శ్రీ' అని రాసేవారు. మంచిమార్కులొచ్చిన ప్రతిభావంతుడైన విద్యార్థికి మాష్టారిచ్చే ప్రోత్సాహకం అది. రెండోవాడిగా వచ్చిన వాడి చేతిలో చిన్నగాపొడిచి చుక్క పెట్టేవారు. మూడోవాడికి చేతిలో చిన్నదెబ్బ వేసేవారు.

ఇక్కడో చిన్న గమ్మత్తయిన అంశం వుంది.

రెండోవాడి చేతిలో గుచ్చిచుక్కపెట్టేది దేనికంటే ఇంకొంచెం కష్టపడితే మొదటివాడిగా రాగలిగేవాడివి కదా... అని ఉద్దీపింపచేయడానికి (MOTIVATION).

'చేతిలో చుక్కబెట్టారు' అనే పలుకుబడి ఇలానే మొదలయ్యింది. మొదటి స్థానానికి రానీకుండా తొక్కేశారనీ, అర్హతకు తగ్గ గుర్తింపు ఇవ్వలేదనీ నిరుత్సా హంగా చెప్పేందుకు ఈ మాటని బాగా వాడ్తుంటారు. 'ఇంటర్వ్యూకు వెళ్తే చేతిలో చుక్కబెట్టారు' అని ప్రయోగించవచ్చు కూడా.

'చుక్క బావుంటే, అన్నీ బావుంటాయి' అంటే, తారాబలం బావుండాలని!

'చుక్క తిరిగింది' అంటే, దశ తిరిగిందని !

ఇంతకీ 'చుక్కేసుకోవడం' అనే ఆధునిక పద ప్రయోగానికి నవీన అన్వయం "మందుకొట్టడం..." అనే గదా !!

# ఎసరు

హాని కల్గించడం అనే అర్థంలో ఎసరుపెట్టాడని బాగా వాడ్తుంటాం.

అన్నం వండటంకోసం గిన్నెలో ముందుగాకాగ బెట్టేనీటిని 'ఎసరు' అంటారు.

ఎసరు పెడితే అన్నం వండడం మొదలయినట్టే కాబట్టి దుర్మార్గాన్ని తలపెట్టడానికి 'ఎసరు' పెట్టాడన్న వాడకం వచ్చింది.

'ఏసరు' అని కూడా అంటారు.

"To do some thing extra - ordinary -" అద్భుతాలు చేసే ప్రయత్నాల్ని ఎసరేగడం, ఏసరేగడం అంటారు.

చెలరేగడం లాంటిదే "ఎసరేగడం" కూడా ! కానీ, చెడుని సూచించేందుకు ఎసరేగడం వాడతారు.

హద్దులుమీరడం – Beyond bounds – అనే అర్థంలో 'ఎసరేగడం' వెనక ఇంత కఠినమైన భావం వుంది కాబట్టే ఎసరుపెట్టడం దుర్మార్గం తలపెట్టడానికి పర్యాయంగా మారింది !

మంచిపనిని తలపెట్టడానికి "ఎసరుపెట్టాడు" అనంకదా !

ఎసరుపెట్టడం, ఎసరేగడం ఒకటే !! కాకపోతే ఎసరు పెట్టేవాళ్ళు, ఎసరేగేవాళ్ళూ మన జోలికి రాకుండా జాగ్రత్త పడగలగాలి !

# ఆవు

"బాలురకుఁబాలు లేవని బాలెంతలు మొఱలు వెట్టఁ బకపక నగి యీ, బాలుండాలము సేయుచు నాలకుఁగ్రేపులను విడిచెనంభోజాక్షీ" పోతనగారి ఈ పద్యాన్ని ఎలా మరిచిపోగలరు ఎవరైనా?

ఏడాదిలోపు వయసున్న ఆవుదూడని 'క్రేపు' అంటారు. 'ఆ'లకు అంటే, ఆవులకు క్రేపుల్ని విడిచాడట – అల్లరికృష్ణుడు... క్రేపు వలన ఆవుకు చేపు పుడ్తుంది. తన క్రేపు మీద తల్లి ఆవుకు గల వాత్సల్యమే చేపుకి కారణం.

"ధారణీగవికి రత్న మహౌషధంబులు చేఁపు పుట్టించిన క్రేపుఁగుఱ్ఱ..." అంటుంది వరాహ పురాణం. భూమి అనే ఈ గోమాతకు రత్నాలు మహౌషధుల చేపు పుట్టించిన క్రేపు కుఱ్ఱ – ఆవుదూడ వంటి వాడు – అని ! విష్ణుమూర్తి గురించిన వర్ణన ఇది !

నేపాలీ దేశీయులు గోరక్షకులు. అందుకని వీళ్ళకి గూర్ఖాలనే పేరు సార్థకమయ్యింది. పశుపతినాథుని పరమభక్తులు కదా...

కన్నడంలో 'గోకల్లు' అంటే, నిలువుగా పాతిన పెద్ద మైలురాయిలాంటిది. పశువులు ఈ రాయికి శరీరాన్ని రుద్దుకుని కాసేపు తనివితీర్తాయి. గోకల్లుల్ని పశువులు మేసేచోట పాతించి తమ పశుభక్తిని చాటుకునేవారు పూర్వులు.

నూరు ఆవులూ, వాటి దూడలూ, ఓ ఆంబోతు... ఇవన్నీ విశ్రాంతిగా తిరిగేందుకు వీలైన స్థలాన్ని 'గోచర్మం' అంటారు. ఇంత వైశాల్యం గల నేలలో పండిన గ్రాసం ఒక కుటుంబానికి, ఒక సంవత్సరానికి సరిపోతుందిట.

గోష్పాదం (ఆవుగిట్ట) అంత పిలక వుండాలని వేదవిదుల విశ్వాసం.

కొందరు అమాయకులైన భర్తలుంటారు. సాధుగోవులాంటివాళ్ళు. పరమ సాధ్వీమణులైన స్త్రీ రత్నాలూ వుంటారు. భర్త ఏంచేసినా కాదనలేనివారు... గంగిగోవులాంటి వాళ్ళు !

"ఆవులు తలచిన చోట పూరి మొలిచింది-" అంటే, అన్ని సౌకర్యాలూ అమరాయని అర్థం. మంచి తెలుగుజాతీయం ఇది -

ఆవును చంపి చెప్పులు దానం చేసినవాడు - అంటే, చిన్న మంచికోసం పెద్ద తప్పుచేసినవాడని !

'అంబా' అని నోరారా 'అమ్మ'ని పిలిచే జంతువు ఆవు ఒక్కటే !

పశువులు ఇళ్ళకు వచ్చే వేళని గోధూళి వేళ అంటారు. 'ఆలపొద్దు' అని కూడా అంటారు. ఆ సమయానికి పొడిచే చుక్క 'ఆలపొద్దు చుక్క'.

గొర్రెలు, మేకలు నడిచినప్పుడు రేగిన ధూళి కన్నా ఆవులు నడిచినప్పటి 'గోధూళి'కి పవిత్రత ఎక్కువని విశ్వాసం.

తన దూడకు పాలిచ్చి తిరిగొచ్చి పెద్దపులి దగ్గర మాట నిలబెట్టుకున్న ఓ ఆవు కథని బట్టి 'సత్యగోవు' అనే పదం ఏర్పడింది. కానీ, శివపురాణంలో కామధేనువు చిన్న అబద్ధం ఆడిన నేరానికి పరమశివుడు ఆవు ముఖం చూడకూడదని శాపం ఇచ్చిన కథ ఇంకొకటి కన్పిస్తుంది. పవిత్రమైన పంచ గవ్యాలూ ఆవుకు వెనకనించే వస్తాయి కాబట్టి, ఆవు పృష్ఠభాగానికే నమ స్కరించడంలో నిజాయితీ వుంది.

ఆవు నలుపైతే పాలు నలుపా? అని ప్రశ్నిస్తుంది ఓ తెలుగుసామెత !

'ఆ' అంటే ఆవు ! 'ఆ'కి బహువచనం 'ఆలు' !! ఆలు అంటే పశువులు.

"అదిగో ద్వారక - ఆలమందలవిగో..." అనే తిరుపతి వేంకటకవుల పద్యం అందరికీ గుర్తుండే వుంటుంది.

ఆదోక, ఆ తోక అవతోక - అంటే తెలుగులో 'ఆవు' అని !

ఆబద్ద, ఆబసి, ఆబెయ్య అంటే ఆవుదూడ.

ఆ బెరుగు - ఆవుపెరుగు !

ఆలనెయ్యి - ఆవునెయ్యి.

ఆలకాపరి, ఆల్రేడు - ఇవి, గొడ్లు కాసేవాడికి మంచి తెలుగు పేర్లు - గౌరవప్రదంగా వుంటాయి.

'వెదమొదవు' అంటే, ఎదకొచ్చిన ఆవు. ఆబోతు వెంటాడవలసిన ఆవు.

పొట్టి ఆవుని 'గిట్టఆవు' అంటారు.

క్రేపు, క్రేపుకుర్ర అంటే ఆవుదూడ. ఒకటి రెండేళ్ళు వచ్చేసరికి, అది ఏపుగా ఎదిగి - గిబ్బ (లేక) గిత్త అవుతుంది. "ఎద్దుపట్టని కోడె" అని కూడా అంటుంటారు దీన్ని.

"గిత్త తత్తడివాడు బుత్తిముత్తులిడంగఁజాలు వాఁడౌదల జాల్చువాఁడు అని శివుణ్ణి కూచిమంచి తిమ్మకవి అచ్చతెలుగు రామాయణంలో కీర్తిస్తాడు. గిత్త తత్తడివాడు అంటే గిత్తని వాహనంగా కలవాడని ! ఆ పరమశివుడు బుత్తి (భుక్తి) ముత్తి (ముక్తి) ఇవ్వగలవాడట. కోరేవారిని ఔదలదాల్చగలడట !!

మగదూడని 'కోడె' అనీ, ఆడదూడని 'పెయ్య' అనీ పిలుస్తారు.

నాలుగేళ్ళ వయసున్న ఆవుని 'పడ్డ' అంటారు. తొలిచూలు ఆవుని కూడా 'పడ్డ' అనే అంటారు. 'మొదువు' అనే మరో అందమైన పేరు కూడా వుంది - తొలిచూలు 'పడ్డ'కి !

ముదురు దూడని 'తఱపి' అనీ, ముదురు దూడగల ఆవుని 'తఱపి ఆవు' అనీ పిలుస్తారు.

గంగి, గంగిగోవు - ఇవి సాధుగోవు అనదగిన ఆవుకు పేర్లు. చాలా కష్టపడి పాలు పితకవలసిన ఆవుని "అట్టి" అనీ, 'నట్టి' అని అంటారు.

రంగురంగుల్లో కన్పించేది శబలగోవు, చామనరంగు ఆవు 'కపిలగోవు! ఎర్రావు, పుల్లావు అని కూడా అంటారు కపిలగోవుని. ఆవుల్లో కపిలగోవు' శ్రేష్ఠతరమైంది.

వెల్లావు, పుల్లావు, బట్టావు, పొట్టావు, పొట్లావు, బోడావు, ఎర్రావు, నల్లావు, కర్రావు - ఇలా చాలారకాల 'ఆవు'లున్నాయి తెలుగులో !

"ఆలనాపాలనా" అనే పదం చక్కని పశుపోషణని సూచిస్తుంది. ఆలపాటి ఇంటి పేరున్నవారు పాడిపరిశ్రమ చేసిన కుటుంబాలలో కన్పిస్తారు. 'ఆలపాడి' అంటే, పాలిచ్చే ఆవుల సంపద.

'ఆలగోడు - బాలగోడు' అనే జటపదం సరిగా జరగని పశుపోషణని సూచిస్తుంది.

గౌతముడి చేలోపడ్డ ఆవుని చేతితో తాకగానే చచ్చిపడి, గోహత్యాపాతకం తెచ్చిపెట్టిందాయనకి ! అనవసరంగా నెత్తిమీద వచ్చి పడే అంశాల్ని ఇలా గౌతముడి గోవుతో పోల్చి చెప్తుంటారు.

ఆవు శరీరాంగాలలో గోరోజనం అత్యంత ఖరీదైంది. ఆవు కాలేయం (లివర్) లోపలి గాల్‌బ్లాడర్‌లో వుండే పసుపుపచ్చని (BILE) బైల్ పదార్థాన్ని 'ఆవుపిత్తం" అంటారు. ఈ గాల్‌బ్లాడర్‌ని ఎండబెడితే లోపలి పిత్తం చిన్న పలుకు లుగా ఎండి వుంటుంది. ఈపలుకుల్ని గోరోజనం, గోరోచనం, రోచనం, గోరజం. ఇత్కిల, కాంచని, రోచన ఇలా అనేక పేర్లతో పిలుస్తారు.

ఈ గోరోజనం లివర్‌వ్యాధుల్లో అద్భుతంగా పనిచేస్తుంది. ముఖ్యంగా సిర్రోసిస్ ఆఫ్ లివర్, జలోదరం వంటి ప్రాణాంతక వ్యాధుల్లో ఇది దివ్యౌషధం.

మనిషి లివర్ లోపల గాల్‌బ్లాడర్‌లో కూడా ఈ గోరోజనం ఉంటుంది కదా... అది బలంగా, సమృద్ధిగా వుంటే, ఆ మనిషి పర్వతాలు ఫలహారం చెయ్య గలుగుతాడు. విషాన్ని కూడా హరించుకోగలుగుతాడు. గోరోజనానికి అసలు అర్థం ఇదీ !

కానీ, నిత్య వ్యవహారంలో అబ్బో ! వాడికెంత గోరోజనమో..." అంటుంటారు... కొంచెం అతిశయం ఎక్కువగా ప్రదర్శించే వ్యక్తిని చూసి ! విషాన్ని కూడా తిని తట్టుకోగలవాడికి 'గోరోజనం' (అతిశయం) వున్నా అందం గానే వుంటుంది కదా !

"ఆవులూ, ఆవులూ కుమ్ములాడి లేగలకాళ్ళు విరగద్రొక్కినట్లు"

"ఆవులు తొలిచూలు - బర్రెలు మలిచూలు"

"ఆవూ దూడా వుండగా మధ్యన గుంజ అరిచినట్లు"

"ఆవు వుండగా గాడిద పాలు పితికినట్లు"

ఇలాంటి తెలుగు సామెతలు ఆవులపైన చాలా వున్నాయి.

ఆవుల కన్నా గేదెల సంఖ్య మన ప్రాంతంలో ఎక్కువ. అయినా, ఆర్యసాంప్రదాయానుసారం 'ఆవు' పూజనీయమే. ఆవు ఆర్య సాంప్రదాయం అయితే, గేదెద్రావిడ సాంప్రదాయం అనీ, ఆవు అగ్రవర్ణాలకు ప్రతినిధి అయితే, గేదె దళిత వర్ణాలకు ప్రతినిధి అనీ కొన్ని వాదనలు కూడా వున్నాయి !

'గోవులు లేని ఊళ్లో గొడ్డు గేదె శ్రీ మహాలక్ష్మి' అనే సామెత అందరికీ తెల్సిందే !

ఆవులు, గేదెలు కూడా పశుసంపదే మనకి ! 'స్వమ్' అంటే సొంతం - సొంతాస్తి, సొంతసంపద... అని ! తన సంపదలు - అని చెప్పుకోవడానికి తెలుగువారు 'స్వమ్' అనే సంస్కృత పదంతో చేసిన చమత్కారం... స్వమ్ములు - సొమ్ములు - సొమ్మలు అంటే పశుసంపద అనే అర్థాన్ని సృష్టించుకోవడం !

రావిశాస్త్రి గారి 'సొమ్మలుపోనాయి' విశాఖమాండలికంలో రాసిన ప్రసిద్ధ కథ

చివరిగా ఒక మాట !

గోదావరి అనే నది పేరుకీ, ఆక్స్‌ఫర్డ్ అనే నది పేరుకీ వున్న సామీప్యత గురించి భాషావేత్తలు చాలా విషయాలు చెప్తారు. భిక్షు చమన్‌లాల్ వ్రాసిన 'హిందూ అమెరికా' గ్రంథం చదివితే, ప్రాచీన అమెరికాలోని భారతీయత తెలుస్తుంది !

# నిట్ట - నిలువు

నిట్టనిలువునా ముంచేశాడు - అంటాం - నమ్మకద్రోహం జరిగి నప్పుడు - నమ్మినప్పుడే గదా... మనల్ని ఎవరైనా ముంచగలిగేది? నమ్మేటప్పుడే చూసుకోవాలండీ... అని మనల్నే ఎదురు తప్పుబడతారు కూడా!

నిట్ట - అంటే, ప్రవాహం. ప్రవాహంలో నిలువునా ముంచేశాడు అనే అర్థంలో 'నిట్ట నిలువునా ముంచు' అనే మాట వ్యాప్తిలోకి వచ్చింది. ఆసాంతం ముంచేశాడని!

'నిట్ట' అనే పదానికి ఇదొక్కటే కాదు ఇంకా మరికొన్ని అర్థాలూ, ప్రయోగాలు కూడా వున్నాయి.

నిట్టనిలువునా తలకొట్టించేవాడు, అంటే, పొగరుబోతు, అహంకారి, అవమానపరిచేవాడు - అని!

నిట్టసిగ మిట్ట పడింది - అనే చక్కని కవిప్రయోగానికి అందంగా అమరిన కొప్పు - అని అర్థం.

కొంతమంది సాయం అడిగితే నిట్టపోతుంటారు. వారినేం చెయ్యగలం? అలాంటివారిని అడగడం మనదే తప్పు!

పెట్టిపుట్టిన అదృష్టజాతకులు - 'సౌఖ్యరసం' నిట్టలోమునిగి తేల్తుంటారు.

నిట్టచూపులతో ప్రియుడికి వీడ్కోలు చెప్పిందట - ప్రియురాలు! అంటే, అతను వెళ్ళినవైపు తదేకంగా చూస్తూండిపోయిందని!

నిట్టక నిల్వు, నిట్టనిల్వు అనే పదాలకు నిటారుగా నిలబడటం అనే అర్థం కూడా వుంది.

కలాన్ని నిట్టంగా (నిలువుగా) పుచ్చుకు రాయవద్దంటారు.

నిట్టపాటుగా వున్నదంటే నిటారుగా నిలబడివుందని!

నిట్టాడి పాకలో మధ్యన నిలువునా పాతిన స్తంభాన్ని నిట్రాడు అంటారు.

మైలురాయి, సరిహద్దురాయి - వీటిని 'నిట్రాయి' అని పిలుస్తారు.

వెన్నుపాముకి 'నిట్టెం' అనే మరో పేరుంది!

నిట్టపొడిచింది - అంటే పొడవుగా సాగింది - పైకెదిగింది - అని !

నిట్టలంగా వుంది - అంటే, అధికంగా వుందనీ, ఆ ప్రాంతం అంతా వ్యాపించిందని అర్థం ! నింగీ నేల అంత పొడవున అగ్నిశిఖలు నిట్టలంగా వ్యాపించాయి" అంటాడు పోతన.

నిట్ట అంటే ఉప్పొంగు అనే అర్థం కూడా వుంది. నిట్టగమ్మింది, నిట్టపొడిచింది, నిట్టతొలికింది, నిట్టలు తోసింది వంటి కవి ప్రయోగాలున్నాయి.

"వేడుకలు నిట్టలుద్రోసే వాలుకన్నులు" - అంటాడు - కేయురబాహు చరిత్రలో మంచనకవి!

"నిబిడలావణ్యంబు నిట్టద్రోప" అని కావ్యాలంకార చూడామణిలో విన్నకోట పెద్దన ఈ ప్రయోగం చేశాడు.

"వంతెనలు నిట్టదొట్టే లాగా, ఏడురోజులు మహోధృతంగా వానలు కురిశాయని పద్మపురాణంలో మడికి సింగన వర్ణన.

స్నేహరసం నిట్టలు పొడిచింది. నిండారు వెన్నెల నిట్టపొడిచింది - వంటి అద్భుతమైన కవి ప్రయోగాలున్నాయి.

ఆత్మీయులు కలిసినప్పుడు మనసు ఆనందంతో నిట్టపొడుస్తుంది. ఆ ఆనందం మహాప్రవాహం లాంటిది. అందులో నిట్టనిలువునా మనం మునిగిపోతాం...

'నిట్ట' చక్కని తెలుగుమాట. వాడకంలో పెట్టినకొద్దీ అందంగా అమరే పదం. ఎన్నో అర్థాల్లోనో దీన్ని వాడుకోవచ్చు.

# ఆడ - ఆడు

ఆడ, ఆడు రెండు పదాలూ అటు ఆడా, ఇటు మగా ఇద్దరికీ వర్తించేవే. అతడు, ఆమె సంగతి సరే... ఇంకా చాలా అర్థాలున్నాయి. చాలా ప్రయోగాలున్నాయి. సరదాగా ముచ్చటిద్దాం మాటల లోతుల గురించి!

అక్కడ, ఆడది, ఆడు (క్రీడించడం), చలించడం, సంచరించడం, తిరగడం, విహరించడం, నర్తించడం, మాట్లాడడం, గుచ్చుకొనడం, నిందించడం, పాడడం, ఆచరించడం, నాటుకోవడం, నలిగేలా చేయడం... ఇలా చాలా అర్థాల్లో ఆడ - ఆడు పదాలను మనం తరచూ వాడ్తుంటాం.

అండాలు (స్త్రీ బీజాలు) కలిగింది కాబట్టి 'ఆడది' అనే మాట ఏర్పడిందని భాషావేత్తలు చెప్తారు. "ఆఁడది" అని అరసున్నా పెట్టిరాస్తే స్త్రీ శబ్దపరంగా ప్రయోగించినట్లు. అరసున్నా లేకుండా 'ఆడది' అంటే, 'అక్కడిది' అన్నట్లే !

ఇది భాషాశాస్త్రపరమైన అంశం. అరసున్నా ప్రయోజనం ఇలాంటప్పుడు కన్పిస్తుంది. అయితే, సందర్భానుసారం దాని అర్థం మనకు అర్థం అయిపోతుంది కాబట్టి, అర్థానుస్వారాల్ని (అరసున్నా) 'ఁ'ల్నీ వాడడం ఎత్తేయమని గిడుగు రామమూర్తి పంతులు గారి వంటి వ్యావహారిక భాషావాదులు పెద్దపెట్టున ఉద్యమం నడిపారు.

'ఆడ కళ్ళు' - అంటే పిరికి వాళ్ళు అని !

ఆడకూతురు, అనే మాటని పరిపూర్ణ స్త్రీత్వం కల సౌందర్యవతి - అనే అర్థంలో ఎక్కువగా వాడతారు. లేదా, అమాయకురాలు, ఆదుకోవలసినది అనే అర్థంలో కూడా వాడ్తుంటారు.

"ఒక ఆడకూతురు వంటరిగా వుంటే, దుష్టపు కళ్ళు ఎగాదిగా చూస్తున్నాయి-" లాంటి మాటలు మనకు విన్పిస్తుంటాయి.

ఆడువారికి ఆవకాయ, మగవారికి బోడి టెంకెలు - అనేది తెలుగు సామెత. 'గుజ్జు' వాళ్ళకీ, టెంకె వీళ్ళకీ - అని !

"ఆడపిల్లను కన్నవాళ్ళు ఐదు బిరుదుల్ని తెగకోసుకోవాలి" అంటుంటారు. ఇది మన సామాజిక దుస్థితి -

"ఆడుదాని బుద్ధి అపర బుద్ధి."

"ఆడది బొంకిన గోడపెట్టినట్లు. మగవాడు బొంకిన దడి కట్టినట్లు-"

"ఆడ... మాణిక్యాలు, మగ... చెత్తకుప్పలు"

"ఆడ పెత్తనం - తంబళి దొరతనం"

"ఆడు తీర్పరులు".. ఇలాంటి తెలుగు సామెతలు చాలా వున్నాయి.

ఆడుకోడి అరిస్తే ఇల్లు అడుగంటుతుందని జపాన్ దేశంలో లోకోక్తి. దీని అర్థం ఆడదక్షత, ఆడదిక్కులేని ఇల్లు అడుగంటుతుందనే !

'ఆడుపాటు' అంటే, స్త్రీత్వం.

ఆడ అనే మాటకీ ఆడంబరానికి అదృష్టవశాత్తూ ఏ సంబంధం లేదు. 'ఆడంబరి' అంటే, ఆడంబరం కలవాడు - అని ! ఆడంబరాలు మగారికే ఎక్కువ !

ఆడపాప అంటే, దాసి, చెలికత్తె.

రాజాస్థానాలలో కొందరు చెలికత్తెలు పెళ్ళిచేసుకోకుండా వుండిపోతారు. వీళ్ళని ఆడపాపలనేవారు. కార్వేటి నగరంలో ఇన్నూరుమంది ఆడ పాపలుండేవారట. దేవదాసీల వ్యవస్థ నడిచిన కాలంలో దేవదాసీల్ని కూడా ఆడపాపలనే అనేవారు.

భర్తకు సోదరిని ఆడబొట్టె అనీ, ఆడపడుచు అనీ, ఆడబిడ్డ అనీ పిలుస్తారు.

అభాగ్యజీవిని 'ఆడముండ' అంటారు. ఇది పెద్ద బూతు మాట కాదు మనవాళ్ళకి. కొందరు మగముండల్లో కూడా అభాగ్యులుండొచ్చు కదా... మగవాళ్ళని 'ముండడు' "లేక ముండుడు" అంటారు. "ముండుడు" అంటే, తల గుండు చేయించుకున్నవాడని ! కాళ్ళు, చేతులు తెగి అభాగ్యుడిలా దిక్కులేక పడివున్న వాణ్ణి కూడా "ముండుడు" అనే అంటారు.

సాధువులు, సన్యాసులు గుండు చేయించుకొంటారు కాబట్టి 'ముండుడు' అంటే, సన్యాసి అని కూడా అర్థం వుంది - సజావు అర్థం (Positive) లో !

'ముండ' అని బ్రాహ్మణ విధవలకు 'శిరోముండనం" చేస్తారు కాబట్టి ఆ పేరుతో పిలుస్తారు. ఈ మాటకు ఉంచుకున్న స్త్రీ అనే అర్థం కూడా వుంది. 'ఆడముండ' అంటే, నీచస్త్రీ - అని ! "వెధవముండ" పదాన్ని తిట్టుగానే మనం వాడ్తున్నాం - మగనైనా... ఆడనైనా... దానికి ప్రత్యేకమైన అర్థం ఏమీ లేదు - చేతకానివాళ్ళని నిందించడం తప్ప !

ఆడంగి - ఆడ+అంగి' స్త్రీల అవయవాలు కలవాడు - లేదా, ఆడవాళ్ళలాగా అవయవాలు కదిలిస్తూ వ్యవహరించేవాణ్ణి "ఆడంగి" వాడంటారు.

ఆడంగి మాటలు - ఆడలక్షణాలు గల మాటలు.

ఆడవాళ్ళు కన్పిస్తే చొంగ కార్చుకుంటూ, వెంచాగిరీ చేస్తూ వుండే పౌరుష హీనుణ్ణి ఆడంగి లెంక అంటారు. దీన్ని 'స్వూనిజం' అనే మనోవికారంగా చెప్తారు మనస్తత్వవేత్తలు. 'ఆడంగిలెంక' అంటే 'ఆడంగిదాస్యం! ఇలాంటి వాళ్ళని ఆడంగి అబ్బన్నలని కూడా అంటారు. "ఆడంగులలో పెదబావగారు" అని గమ్మత్తుగా సంబోధిస్తారు -

ఆడదాని చేతి అర్థం, ఆడపడుచుసిరి పదాన్ని - చేతిలో నిలవనివి అనే అర్థంలో వాడ్తుంటారు.

ఆడుతోడు లేకుండా పుట్టిన వాడికి, అంటే - అక్కచెల్లెళ్ళు లేనివాడికి దయా దాక్షిణ్యాలుండవు అని మనం క్రూరంగా ప్రవర్తించేవాణ్ణి నిందిస్తుంటాం "ఆడుతోడున పుట్టవే -" అని ప్రయోగించాడు పెద్దన.

'ఆడుగోడు పోసికోవడం' అంటే, ఆడవాళ్ళని ఏడ్పించడం "ఈ ఆడుగోడు పోసికోనేల - నీవంటి పుణ్యమతికి -" తిరుపతి వెంకటకవుల ప్రయోగం ఇది !

వీరుడు, ధీరుడు అనదగిన పౌరుషం గల మగాడే లేని ఊరుని ఏమని పిలవాలి? 'ఆడువీడు' అంటే పౌరుషహీనుల ఊరని.

ఆడుగొందెలో పడటం అంటే, పదిమంది ఆడవాళ్ళ మధ్య ఒక మగాడు ఇరకాటాన పడటం.

తమిళదేశంలో ప్రసిద్ధులైన పన్నెండు మంది ఆళ్వారుల్ని 'ఆడువారు' అంటారు. ఇక్కడ 'ఆళువారు'కు భ్రష్టరూపం 'ఆడువారు'! అంతే!

'ఆడుకట్టు' - అంటే, స్త్రీల వస్త్రధారణావిశేషం.

స్త్రీజననాంగాన్ని 'ఆడుగురి' అంటారు.

'ఆడుగూచి' అంటే, పరమగయ్యాళి అని.

'ఆడుగోల' అనేమాటని స్త్రీ హత్య జరిగిందనడానికి వాడతారు. ఆడుగోలపాతకం - స్త్రీ హత్యాపాతకం !

బోల్డెదంత మంది ఆడాళ్ళున్నారనడానికి 'ఆడుమొత్తం' అనే పదప్రయోగం భారతంలో కన్పిస్తుంది.

ఆడు - అనేది ఆటకు సంబంధించిన పదం.

"మేయాడక నిద్రవోయే" భారతంలో కవిప్రయోగం ఇదీ ! శరీరం కదలకుండా నిద్రపోయిందంటాడు.

చేయాడదు, నోరాడదు, కాలాడదు లాంటి ప్రయోగాలు మనమూ చేస్తుంటాం.

ఆడు అంటే 'తిరగడం' కూడా!

"కురుసేనపై గ్రద్దలాడఁజొచ్చె" అని భారతంలోనే మరో అద్భుతమైన ప్రయోగం ఇది. కారం ఆడటం, మర ఆడటం, పిండి ఆడటం మనకు అలవాటులో వున్న మాటలే ! ఇక్కడ ఆడటం అంటే పిండిని చేయడమే ! యంత్రాన్ని ఆడించడం ద్వారా !!

నీళ్ళాడడం అంటే, స్నానం చేయడం.

"... గంగనాడ వచ్చి", "ఆడ బోయిన తీర్థం ఎదురయ్యింది" వంటి ప్రయోగాలూ జాతీయాలూ వున్నాయి మనకి !

స్త్రీలు పసుపు రాసుకొని స్నానం చేయడాన్ని "పసుపాడు" అనే ప్రయోగంతో వర్ణించాడు శ్రీనాథ కవిసార్వభౌముడు.

ఆడు అంటే, ఆట !

"గలహ బంధుఁడు నారదుఁడాడె వేడుకన్" అంటుంది భారతం.

ఆడి ఆడించుకొంటుందిట ఊర్వశి. వాల్మీకి రామాయణంలోది ఈ కవిప్రయోగం. తిట్టి తిట్టించుకోవడం అని అర్థం ఈ ప్రయోగానికి !

"తోడికోడలు చూడ నాడి కొనును" అంటే నిందలు వేస్తుందని ! ఆడిపోసుకోవడం అనేది ఉసురు పోసుకోవడం అనే మాటలానే, ఎదుటివ్యక్తిని నిందలపాలు చేయడం అని !

"వీళ్ళకు నన్నాడుకునే నోరు కల్గింది - ఏమనాలి -" అంటే, మాటలు పడాల్సి వచ్చిందని !

"చాల కల్లలాడి... అనే త్యాగరాజ కీర్తన ప్రశస్తి సంగీతాభిమానులకు తెల్సిందే !!

# దొబ్బు

'దొబ్బు' అని బహిరంగంగా అంటే, పెద్దవాళ్ళు దొబ్బు లెడతారు. నిందించు, తోయు, గెంటు, దొంగిలించు, రమించు... ఇన్ని అర్థాల్లో ఈ మాటని విస్తృతంగా ప్రయోగిస్తుంటాం. అయినా, అశ్లీలం అనే ముద్ర ఈ పదానికి ఏ కారణంగానో తప్పలేదు.

"మందస బలంబున నందరు ద్రొబ్బి తెచ్చి -" అంటే మంది బలంతో అందర్నీ దొబ్బితెచ్చాడట ! గెంటేశాడనే అర్థంలో ఇది నన్నయ గారి ప్రయోగం!

"శైలతటంబులందు ద్రొబ్బించితి" అని పోతనగారు భాగవతంలో - దొర్లించడం అనే అర్థంలో ఈ మాటని వాడాడు.

"నీట ద్రొబ్బించిన –" అనేది పొన్నిగంటి తెలగనార్య కవి ప్రయోగం! గుండెలు పగిలాయి అనే అర్థంలో !

"మెదబట్టి వెడల ద్రొబ్బిన –" అని విప్రనారాయణ చరిత్రలో చెదలవాడ మల్లయ్య కవీ ద్రొబ్బు పదాన్ని ప్రయోగించాడు.

"నాకంజాక్షి బోద్రొబ్బె" అని కళాపూర్ణోదయంలో పింగళి సూరన కవి నిరభ్యంతరంగా వాడేశాడు ఈ మాటని !

ఉషఃకాంత చంద్రుణ్ణి మరిగి సూర్యుణ్ణి వెళ్ళదొబ్బేసరికి పడమటి కొండల్లో కుంకాడని పోతనగారు చేసిన వర్ణన రమణీయం.

పోతన గారికి 'దొబ్బు' బాగా అలవాటు. పండ్లూడ వ్రేసి ద్రొబ్బుడు (పళ్ళు రాలదొబ్బండి) లాంటి ప్రయోగాలు చాలాసార్లు చేశాడు.

"అప్పు ఎగదొబ్బాడు"

"అరగంటనుంచీ వీడు నన్ను దొబ్బేస్తున్నాడు"

"ఇప్పటి దాకా ఎక్కడ దొబ్బించుకున్నావ్ ?"

"జేబులో పర్సు దొబ్బేశారు"

"దొబ్బులు పెడితే గానీ చివరికి, పనికాలేదు"

"ఈ పనిలో బాగానే దొబ్బినట్టున్నాడు"

"రాత్రంతా వాడితో దొబ్బించుకొంది" లాంటి మాటలు మనకి తరచూ వినపడేవే.

"ఎగద్రొబ్బు" అంటే పైకి తొయ్యడం కూడా !

దొబ్బులాడుకోవడం అంటే, త్రోపులాడుకోవడం.

దొబ్బులాడుకొంటున్నారంటే కలహం మాత్రమే కాదు – ప్రణయకలహం కూడా కావచ్చు.

జారు పైటని సరిచేసుకునేందుకు ఒకసారి ఇలా తీసి అలా వేసుకున్నప్పుడు... గుబ్బల మిసమిసద్రొబ్బులాడ కన్పించాయట ! అయ్యలరాజు నారాయణా మాత్యుడు హంసవింశతిలో చేసిన ఈ వర్ణనలో అశ్లీలం 'మిసమిసలు' అనడంలో వుందా... దొబ్బు అనడంలో వుందా?

మహాకవులే ప్రయోగించిన ఈ పదాన్ని వాడుకోకుండా బూతు అని వదిలివేయడానికి మనకేం 'దొబ్బు' చెప్పండి...!!

# ఆలి - ఆల - ఆలు

ఇంటికి వచ్చిన పరమశివ భక్తుణ్ణి "ఆలి" చేసిందని తన "ఆలి" రెండు చేతులూ నరికేసిన ఓ శైవుడి కథ బసవ పురాణంలో కన్పిస్తుంది.

ఇన్నాళ్ళ తన తపసునంతా ఆలి చేసుకొని మేనక వెంట పడ్డాడట. విశ్వామిత్ర మహర్షి! ఆలి అంటే, నాలి, హీనం, పరిహాసం, గేలిచేయడం అని!!

ఆలి, ఆల, ఆలు పదాలు తెలుగులో ఒకే అర్థంలో పదేపదే ప్రయోగంలో వున్నా వీటికి అర్థాలు ప్రయోగాలూ వేర్వేరు వీటి గురించి అనేక ముచ్చట్లు ఎన్నో వున్నాయి - సరదాగా పరిశీలిద్దాం రండి !

సంస్కృత పదం ఆలి - అంటే, శుద్ధాంతఃకరణం అనీ, గొప్ప ఆశయం కల్గిన వ్యక్తి అనీ, తేలు, తుమ్మెద, సఖి, చెలికత్తె, పంక్తి, వరుస, శ్రేణి, సమూహం, వంతెన, ఆనకట్ట... ఇలా ఇంకా ఎన్నో అర్థాలున్నాయి.

ఆలింగనం, ఆలించడం సంస్కృతంలోంచి తెలుగులోకి వ్యాపించిన ప్రయోగాలే!

ఆలకించడాన్ని తెలుగులో ఆలించడం అని కూడా అంటారు. శ్రద్ధగా వినడం అని దీని భావం. శ్రద్ధగా వినడాన్ని 'ఆలక్ష్య' అని కూడా అంటారు. ఆలక్ష్యం అంటే, మంచి విజన్ కలిగి వుండటం కూడా!

ఆలకించక పోవడాన్ని, అశ్రద్ధగా వుండటాన్ని 'ఆలం' అంటారు. భవిష్యత్తుకొక దిశ, దశ ఏర్పరచుకోలేని, విజన్ లేని మూర్ఖత్వాన్ని 'ఆలం' అంటారు. ఆలము చేయడం అంటే ఇది - భవిష్యత్తును నిర్లక్ష్యం చేయడం.

తెలుగులో ఆలం అంటే యుద్ధం. ఉర్దూలో ఆలం అంటే ప్రపంచం. ఆలంపన అంటే చక్రవర్తి. సంస్కృతంలో 'ఆలం' అంటే శ్రేష్ఠమైంది అని!

హరితాళం అనే లోహం ఆయుర్వేద ఔషధాలలో ఉపయోగిస్తుంది. హరిత వర్ణంలో వున్న ఆలం - అంటే శ్రేష్ఠమైంది - అని ఈ పేరొచ్చింది.

ఇక్కడ సరదాగా ఓ కథ చెప్పుకొందాం.

గాంధీగారు జాతీయోద్యమం ప్రారంభించిన తొలిరోజుల్లో వర్తక వ్యాపార సంస్థల బందు జరిగేది. ఇది తెలుగువారికి క్రొత్త అలవాటు 'హర్తాళ్' కోసం గాంధీ గానీ, కాంగ్రెస్ గానీ ఎప్పుడు పిలుపిచ్చినా తెలుగువారు ముందుండేవారు. ఇది "హరితాళం" అంటే, కొట్లు మూసేసి, హరిభజన చేస్తూ కూర్చోవడం అని జాతీయ వాదాన్ని ఆధ్యాత్మికతో ముడిపెట్టి దుగ్గిరాల గోపాలకృష్ణయ్య గారు అనేవారట! హర్తాళ్ అంటే మొత్తం 'మూసివేత' అని దీని అర్థం.

సరే - మళ్ళీ 'ఆలి' ముచ్చట్లలోకి వద్దాం.

భారతం విరాట పర్వంలో కీచకుడు ద్రౌపదితో అంటాడు... "ఆలము చేసి నా తగుల మ్మాటటి పుచ్చఁగ నేల...?" అని ! తన వ్యామోహాన్నీ ఆలంచేసి ఆరడి పుచ్చుతోందట ద్రౌపది ! ఇలా ఎందుకు చేస్తున్నావని కీచకుడి ప్రశ్న.

"నుడువు లాలములైన నోరునొక్కు" అనే ప్రయోగం కావ్యాలంకార చూడామణిలో విన్నకోట పెద్దన గారిది. అతిగా మాట్లాడటాన్ని ఈ పదం సూచిస్తుంది. మాటల ఆలాలు, ఆలమాటలు వాచాలతని సూచిస్తాయి.

అధిక ప్రసంగం, అదనపు ప్రసంగం అనడానికి తెలుగులో ఆల మాటలు సమానార్థకం.

"చదువు దొరఁ కొనిన నరునకుఁ గాలంబు నాలంబు" అనే రాయలవారి ఆముక్తమాల్యద వర్ణన - చదువుకున్న వాడికి కాలం ఆలంగా గడిచిపోతుంది - అని !

ఆలపుచ్చడం అంటే, నిర్లక్ష్యం చేయడం. "పేద ప్రజల్ని ఆలపుచ్చిన పాపానికి ఆ పార్టీ తగిన శాస్తి అనుభవిస్తోంది –" అంటారు.

'ఆలి'ని ఆలపుచ్చితే' సాని మేలుచేస్తుందా...? అని అడుగుతుందో తెలుగు సామెత.

యీలకూర కటిక ఉప్పగా వుంటుంది. ఆలిని వదిలేసిన వాడికి ఈల కూరలో ఉప్పు వేసుకున్నా చాలదు అని సామెత ! అంటే, అంత నిస్సారంగా వుంటుంది వాడి బ్రతుకు అని !

'ఆలి'కి అన్నం పెట్టడాన్ని కూడా ఊరికి ఉపకారంగా, దేశం కోసం త్యాగంగా భావించుకునే వాళ్ళున్నారు.

ఆలు కాదు – అది చేవ్రాలు. జ్ఞానం వున్నవాడికి సంతకం. అసమర్థుడికి నిశాని... అంటుందో ఆధునిక కవిత.

నీతోడు, నాతోడు, అమ్మతోడు, దేవుడితోడు, అన్నాచెల్లెలు తోడు, క్రింద భూదేవి తోడు, పైని ఆకాశం తోడు – అని రకరకాల ఒట్లు అందరి మీదా వేస్తారు గానీ, 'ఆలి తోడు' అని పెళ్ళాం మీద ఎవరూ ఒట్టు వెయ్యరు. పిల్లల మీద తోడు అంటాడు కావాలంటే! ఆలిని పందానికి వద్దేందుకు విలువ వుందిగానీ, పురుషస్వామ్య వ్యవస్థలో ఒట్టెయ్యడానికి విలువ లేనిది ఆలి ఒక్కటే!

'ఆలతేడు' అంటే ఆవులకు ప్రియుడు – ఆబోతు.

ఆలరి అంటే, పరమదుష్టుడు. అనాథ కూడా! అడిగేవాడు లేక ఆలరి దుష్ట శీలుడయ్యాడు. ఆలరిమూకని వెంటేసుకొని "ఆలాలు" (ఆగడాలు) చేసే ఈ 'ఆలరోడు' చట్టసభల్లో చేసేది 'ఆలరి' అందామా...??

'ఆలము' అంటే యద్ధం. సంస్కృత పదం 'హారః' లోంచి ఈ పదం తెలుగులో రూపొందిందంటారు భాషావేత్తలు.

ఆలముసాలించు - అంటే, యుద్ధాన్ని ఆపమని! ఆగడాలు ఆపమని కూడా!

'మదనాలం' అనే ప్రయోగానికి అర్థాన్ని ఊహించుకొని చూడండి! మదనకదనం వంటిదే! 'శయ్యాసమరం' అంటే ఇంకా బావుంటుంది !!

# గొడ్డు

'బొడ్డు పల్లెను గొడ్డేటి మోసపోతి నెట్లు చెల్లింతుఁడంకంబు లేదునూర్లు-". అని బాధపడ్డాడు మహాకవి శ్రీనాథుడు.

బొడ్డుపల్లెలో గొడ్డేటి మోసపోవడం అంటే, పండని పొలం గుత్తకు తీసుకొని వృథా శ్రమపడి నష్టపోయాడని! 'గొడ్డేరు' అనే మాటకు శ్రీనాథుడి అర్థం ఇక్కడ - 'ఫలించని కౌలు' అని! లేదా వృథా శ్రమ అని!

"చెలియలికి నాకు గొడ్డేటు కలకపుట్టె-" అనేది కూడా శ్రీనాథుడి ప్రయోగమే ! ప్రేయసితో అతనికి వృథాగా తగువు ఏర్పడి పరిష్కరించుకోవడానికి వ్యర్థంగా చాలా శ్రమపడ్డాడనే భావన ఈ పదం ద్వారా సూచితమౌతోంది.

'బొడ్డున పుట్టిన పాపానికే నిన్ను గొడ్డేటి తెస్తినే కోడలా..." అంటాడు అన్నమయ్య. నిర్దిష్ట లక్ష్యం కోసం ఎంతగానో పరిశ్రమించడంగా నిఘంటువులు 'గొడ్డేరు' మాటకు అర్థానిచ్చాయి. కానీ, అంతటి శ్రమ కూడా నీ వలన వృథాశ్రమ అయ్యింది - అనే వ్యంగ్యం గొడ్డేరు అనడంలో వుంది.

'గొడ్డు' అనే మాటకు మనం చెప్పుకోవలసిన ముచ్చట్లు ఇంకా వున్నాయి.

ఉప్పు లేకుండా వట్టి కారం మాత్రమే వేసి వండిన కూరని 'గొడ్డు కారం'గా వుందంటాం. అంటే, ఉప్పులేకుండా రుచీ పచీ లేని వంటకం, పరమ కారంగా వుందని !

ఒక్కమెతుకు కూడా లేని గంజినీళ్ళని గొడ్డుగంజి, గొడ్డంబలి, గొడ్డుజావ అంటారు.

ఏ ఆధరవులూ లేకుండా వట్టి అన్నం "గొడ్డన్నం" అవుతుంది. ఆఖరికి బిచ్చగాళ్ళక్కూడా అన్నంతో పాటు ఏదొక పచ్చడైనా కనీసం పెట్టి పంపుతాం. అది కూడా లేనిది 'గొడ్డన్నం' !

"గొడ్డు - గోద" అనే జంటపదాల్లో 'గోద' అంటే ఆబోతు... అనేక ఆవులూ, దూడలూ, ఆబోతు కలిసిన సమూహాన్ని "గొడ్డు - గోద" అంటారు.

"ఊరేమన్నా గొడ్డు పోయిందా ? ఆమాత్రం బతకలేమా ?"

"లోకం గొడ్డుపోలేదు - పండితులున్నారు - పరిష్కరిస్తారు"

"విడే కావాలా? కులం గొడ్డు పోలేదు-" లాంటి ప్రయోగాలు చాలా విన్పిస్తాయి. మనకి !

"వీళ్ళంతా గొడ్డు పోయిన మనుషులు - పౌరుషంగల మనిషి వీళ్ళలో ఎవడు?" అని, పారిపోయి వచ్చిన వాళ్ళని ఉద్దేశించి అంటాడు మహాభారతంలో!

"ప్రహ్లాదుణ్ణి చంపడానికి చేసిన ప్రయత్నాలన్నీ గొడ్డుపోయాయి" అని నృసింహపురాణంలో ప్రయోగం.

"ఆశ్చర్యంతో వాళ్ళ నోటిమాటలు గొడ్డు పోయాయి"

"ఖజానాలో నిధులు గొడ్డుపోయాయి" ఇలా ఎన్నయినా ప్రయోగాలు చెయ్యవచ్చు. "వట్టిపోయిన గొడ్డు" ఇలాంటి ప్రయోగమే !

"గొడ్డువాడు గొడ్డు కేడిస్తే, గొడారి తోలు కేడుస్తాడు." అంటే ఎద్దు ప్రాణం అటూ ఇటూగా వున్నప్పుడు, నోరులేని ఆ మూగజీవి బ్రతుకుతుందో లేదో అని యజమాని ఏడుస్తుంటే, ఈ పశువు చస్తుందో లేదో... అని దాని తోలు కోసం ఎదురు చూసేవాడు ఏడుస్తాడని సామెత భావం. "గొడారి బేరం" అనే మాట పుట్టింది ఇలానే.

'వంధ్య'ని గొడ్రాలు అని పశువుతో పోల్చడం వినడానికి అమానుషం గానే వుంటుంది. అయితే, అచ్చ తెలుగులో గొడ్డు, వంజ, గొంజ - ఈ మాటలకు వంధ్య అని అర్థం. గొడ్డుమోతు, గొడ్డుబోతు అని కూడా అంటుంటాం. ఇక్కడ గొడ్డు (పశువు)కీ, గొడ్డు + ఆలు - గొడ్రాలుకీ ఏమీ సంబంధం లేదు. సంతానం లేని స్త్రీని పశువుతో పోల్చారని ఆరోపించనవసరం లేదు-

గొడ్డుబోతుకు కాయము కొట్టు - అంటే, వ్యర్థ ప్రయత్నం చెయ్యవద్దని! దశమూలాలు (పదిరకాల వనమూలికలు), త్రికటుకాలు (శొంఠి, పిప్పళ్ళు, మిరియాలు) వీటితో బెల్లాన్ని కలిపి దంచిన మిశ్రమాన్ని 'కాయం చూర్ణం' అంటారు. 'కట్టెకారం' అని కూడా పిలుస్తారు. దీన్ని ప్రసవం తర్వాత బాలింతలకు పెడతారు. గర్భాశయం త్వరగా కుంచించుకోవడానికీ, వాతం చెయ్యకుండా వుండేందుకు ఆ సమయంలో ఇది ఉపయోగపడ్తుంది. దీన్ని గొడ్డుబోతులకు పెడితే ప్రయోజనం వుండదు కదా... అని 'గొడ్డుబోతుకు కాయము కొట్టు' అనే సామెత పుట్టింది.

గొడ్డాగాకారని గొడ్డుగాకర, పోతుకాకర అని కూడా పిలుస్తారు. ఒక రకమైన కాకరతీగ ఇది. దీని వేరుకి సంతానోత్పత్తి శక్తి వుందని ఆ పేరుతో పిలుస్తారు. 'వంధ్యా కర్కోటకీ' అంటారు సంస్కృతంలో !

గొడ్డుతనం పోయి సంతానవతి కావడాన్ని 'గొడ్డువీగడం' - అంటారు.

"గొడ్డు వీఁగి కనియేఁ గొడుకు నెంతయు -" అంటాడు ఎర్రన ! శ్రీనాథుడు కూడా ఈ పదాన్ని ప్రయోగించాడు. ఆలస్యంగా కన్నబిడ్డడు అనే అర్థంలో !

తీక్షణమైన వాసనని గొడ్డు వాసన అంటారు.

"వాడుగొడ్డుపోయాడు" అంటే సర్వ సంపదలూ హరించుకు పోయాయయని!

సర్వలోకాలూ ఆయన సంతతే అయినా, విష్ణుమూర్తి కొడుకులేని వాడు కాబట్టి 'గొడ్డు' అనే.... పేరు ఆయనకీ వుంది !

గొడ్డు అంటే - అజ్ఞాని, మూర్ఖుడు, పశువు కూడా.

ఫలానా వ్యక్తిని పరోక్షంగా సూచించడానికి కూడా 'గొడ్డు' అనే మాటని వాడతారు.

"ఆ గొడ్డు మంచిదైతే ఆ ఊళ్ళోనే అమ్ముడు పోయేది కదా..." అంటే, పరాయి సంబంధాలు చూస్తున్నప్పుడు అయిన వాళ్ళు ఎందుకు ఒప్పుకోవడం లేదో... అని ఎవరైనా అనుమానించడం ఇలా సహజమే !

# నీరు

నీళ్ళేగదా... ఏముందీ అనుకోకుండా వుంటే, నీళ్ళు గుండెగదు ముచ్చట్లు గుమ్మరిస్తాయి.

'నీరం' అనే సంస్కృతపదానికి సంబంధించిన నీరు తెలుగుభాషకు ప్రాణం పోసింది.

నీరద - నీటినిచ్చేదిమేఘం... 'నారం' అంటే కూడా నీరే ! నారం అంటే జ్ఞానం అనే మరో అర్థం కూడా వుంది. జ్ఞానం ఇస్తాడు కాబట్టి నారదుడనే పేరు ఆయనకు సార్థకం అయ్యింది. 'నారం' అంటే, నీరు ఇస్తుంది. కాబట్టి నీరదని 'నారద' అని కూడా పిలుస్తారు. 'నారద నీరద మహతీ నినాద -' అనే వేటూరి సుందరమూర్తిగారి శంకరాభరణం పదాల అర్థం ఇది.

నీటిని వర్షించే మేఘానికి 'మేఘపుష్పం ఘనసిరి' అనీ, మొగలువిరి అనీ ఎంతో అందమైన పేర్లున్నాయి.

'నీరామని' అంటే వర్షఋతువు.

'నీటి దారి' అంటే వానకురిసే మబ్బు. నీరు మోపరి, నీరుతాల్పు, నీటి తాలుపు అని కూడా అంటారు.

నీటి రాయుడు - సముద్రుడు ! నీటిఎకిమీడు, నీరుతట్ట, నీరుకుప్ప, నీరువాము... ఇలా సముద్రుడికి తెలుగులో చాలా పేర్లున్నాయి.

'నీటితాత' అని వాయుదేవుణ్ణి పిలుస్తారు.

నీళ్ళున్న ప్రదేశాన్ని 'నీటి పట్టు' అనీ, 'నీరుటెంకి' అని కూడా అంటారు. 'నీర్నేల పన్ను'ని విధించే వారట ఒకప్పుడు.

'నీర్గండి' అంటే కాలువ, తూము అని అర్థం.

"ఆకాశం నీరు బుగ్గలా వుంది." అని దట్టంగా మబ్బు పట్టినప్పుడు వర్ణిస్తే

అందంగా వుంటుంది. "నీటిబుగ్గ లాంటి ఈ సంపదలు, ఈ సుఖాలు, ఈ అధికారాలు అశాశ్వతం" అంటారు వేదాంతులు. "దుఃఖంలో మునిగిన ఆమె కళ్ళు నీటి బుగ్గలు". అని వర్ణిస్తాడో కవి -

గుండె కరిగిపోయింది అన్నట్లే, 'చిత్తం నీరయ్యింది' అనే ప్రయోగం మహాభారతంలో కన్పిస్తుంది.

'నిద్ర నీరయ్యింది' అనేది మరో గొప్ప చమత్కారం.

"ఆమె కళ్ళ దగ్గర గండుమీను చేపలుంచితే, సిగ్గుపడి అవి నీరు కారిపోతాయి-" అంటాడు అద్దంకి గంగాధర కవి.

"నీటిని నడుముకు తెంపగల జాణ" అంటే, అసాధ్యాన్ని సుసాధ్యం చేయగలదన్నమాట!

'నీట ముంచినా నీవే... పాలముంచినా నీవే...' అని దేవుణ్ణి వేడుకుంటాం.

'నీరు వరి' - అంటే, నీవార తృణం దర్భగడ్డి.

నీళ్ళు నమలడం అంటే, నచ్చులు గొట్టడం లేక తొట్రు పడటం. తప్పు చేసి దొరికిపోయి తప్పించుకోలేని దీనావస్థలో మాట్లాడే తీరుని నీళ్ళు నమలడం అంటారు. నోరారా మాట్లాడలేని స్థితి. మనసు స్వచ్ఛంగా వున్నప్పుడే నోరారా మాట్లాడతాం. అది లేనప్పుడు నీళ్ళు నములుతాం.

నీరుకారు రంగు - అంటే లేత ఎరుపు రంగు. పదే పదే ఉతకడం వలన తెల్లని బట్టలు నీరు కావెక్కుతాయి. సలిలకాషాయం అనే శ్రీనాథుడి ప్రయోగానికి అర్థం నీరుకావి రంగు అనే !

సంధ్యవేళ కన్పించే అరుణ కిరణాన్ని 'నీరుకాళ్ళు' అంటారు. అవి సంధ్యాకాంతులు !

'నీరుకొద్దీ తామర' అనేది ఓ మంచి జాతీయం.

నీరు ముట్టడానికి వెళ్ళాడు అంటే నీరుడు (టాయిలెట్) కు వెళ్ళాడని 'అల్పాచమనం', 'కాళ్ళు ముడవడం' వంటిదే ఈ ప్రయోగం కూడా !

నీరు విడిచేయడం, నీళ్ళొదిలేయడం - అనేవి శీఘ్రంగా ఇక్కణ్ణించి బిచాణా యెత్తి వేయడమే మేలని గిరీశం తీసుకున్న నిర్ణయం లాంటివి.

'నీళ్ళు చెల్లు' అంటే ఋణానుబంధాలు తీరిపోయాయని !

పాడైపోయిన పనిని, 'మంటగల్సింది' అన్నట్లే, 'నీటగల్సింది' అనే అలవాటు కూడా మనవాళ్ళకుంది.

"మబ్బుల్లోని నీళ్ళు నమ్మి దొనలోని నీళ్ళు తెగగొట్టినట్టు" అనేది తెలుగు సామెత! "మబ్బుల్లో నీళ్ళుచూసి ముంత ఒలకబోసుకోనా?" అనే తెలుగు సినిమా పాట గుర్తుకొస్తుంది ఈ సామెత వింటే !

నీటికీ దాటికీ దూరమైన – అంటే, తింటానికీ త్రాగడానికి లేని గర్భదారిద్ర్యం అని !

'కళ్ళు నీరాడు,' 'కళ్ళలో నీరాగు' అనేవి దుఃఖ తీవ్రతని తెలియజేసే మాటలు. 'కాగిన మేనిలో గన్నుదమ్ముల నీరాఁగి యాడిన మాట లివియె–'' అంటాడు అన్నమయ్య.

నీరు పల్లమెరుగు కదా ! యవ్వనం కూడా అంతే ! చెయిజారేందుకో, కాలుజారేందుకో అవకాశం వున్న వయసు కాబట్టి యవ్వనాన్ని 'నీరుపాయం' అంటారు.

నీరెత్తాడంటే, పొలాలకు నీళ్ళు పెట్టాడని !

నీరు మట్టంగా వుందీ ప్రాంతం అంతా – అంటే, పూర్తిగా నీటితో నిండిపోయి మునిగిపోయిందని. "నీరుముంపు" అని కూడా అంటారు.

చెరువులూ, బావులూ, నీళ్ళు లేక ఎండి పోయాయి అని చెప్పడానికి "నీరొట్లు గట్టాయి" అంటుంటారు – బియ్యం నిండుకున్నాయి అన్నట్లు!

ఈరు అంటే, అల్పమైంది చిన్నది – అని! ఈరెండ, నీరెండ అనే పదాలు ఇలానే ఏర్పడ్డాయి. నీరెండ అంటే, సాయంకాలపు ఎండ అని!

నీరున్న ఉల్లిపాయ కాబట్టి 'నీరుల్లి' అన్నారు దీన్ని ఎఱ్రగడ్డ, పలాండు అని కూడా అంటారు.

'నీళ్ళలోపలి ముల్లు' పొంచి వున్న ప్రమాదం లాంటిది.

'నీరుకాకినెపం' అంటే లేని నేరాన్ని ఆరోపించడం. నీరుకాకి అనే పక్షి, కాకి కాదు. నేతి బీరలాంటి పేరిది. కానీ, కాకి అనే అంటున్నాం.

'నీరాపనిందలు' అనే ప్రయోగం కూడా వుంది. అపకీర్తికి కారణం అయ్యేవి ! నీలివార్తలు గాలివార్తలు కదా !... 'నీలాపనిందలు' అనే మాట గాలివార్తలతో కూడిన అపనిందలన్నమాట !

నీర్చిచ్చు – నీటిదెయ్యం – అనే పదాలకు బడబాగ్ని అని అర్థం.

'నీఱు' అంటే, నిప్పు, భస్మం అని ! ఇక్కడ నీరులో 'ఱ' వుంటుంది గమనించండి. "నీఱు చిచ్చెగయింప నేర్పిన" అని గౌరనకవి హరిశ్చంద్రో పాఖ్యానంలో వర్ణించింది. మాయలాడి అనే అర్థంలో ! గొడవలు సర్దుమణిగిన తర్వాత చల్లారిన చిచ్చుని రగిల్చడాన్ని నీఱ్చిచ్చెగెయ్యడం' అంటారు అంటే ఆ యిద్దరి మధ్య బడబాగ్నిని సృష్టించడమేనని !

వాస్తు శాస్త్ర ప్రకారం ఇల్లు కట్టేప్పుడు అన్ని దిక్కుల నుంచీ నీటిని తెచ్చి ఈశాన్యంలోంచి బైటకు పంపుతారు. ఇలా నీరు వెళ్ళే దిక్కు కాబట్టి ఈశాన్య దిక్కుకు "నీరాళ్ళగొంది" అనే పేరు ఏర్పడింది. తెలుగు 'దిక్కు లేని భాషనీ, తెలుగులో దిక్కులకు పేర్లు లేవనీ అంటుంటారు. కానీ, అచ్చ తెలుగులో 'నీరాళ్ళగొంది' లాంటి చక్కని ప్రయోగాలున్నాయి.

మీరెప్పుడైనా నది ఒడ్డున నిలబడి గమనించి చూడండి - నీటి వరవడికి ఒడ్డున వున్న తుంగమొక్కలు నీళ్ళ మీదకు వాలి, ఆ ప్రవాహంలో పడి కొట్టుకు పోతున్నాయా... అన్నట్లుంటాయి. వాస్తవానికి, ఎక్కడి తుంగ మొక్కలు అక్కడే వుంటాయి.

నీరువంకే వున్నట్లు కన్పిస్తుంది. తుంగ కాబట్టి "నీర్వంక తుంగ" అనే చక్కని జాతీయం ఏర్పడింది. "అర్జంపు దొరలకు నీర్వంక తుంగ జేసి - అని చదలవాడ మల్లయ్య కవి ఈ జాతీయాన్ని చక్కగా ఉపయోగించుకున్నాడు కూడా. మనిషి ఇక్కడే వున్నా మనసు ఎక్కడో వుండడాన్ని ఈ జాతీయం సూచిస్తుంది! 'నీర్వంకతుంగమాయె మనసు' అని అన్నమయ మనసు లగ్నం కావడం లేదనే అర్థంలో ప్రయోగించాడు ఎంతో అందంగా!

నీటిమీద రాతలు, నీటిమీద చేవ్రాలు వంటి మాటలు వృథా ప్రయాసనీ, వ్యర్థ ప్రయత్నాలనీ సూచిస్తాయి... కానీ, నీరు గురించి ఎన్నో విశేషాలున్న ఈ 'నీటి మీద రాతలు' ఒక్కక్షణం సేపు మిమ్మల్ని అలరించాయనే అనుకొంటాను.

# దేబె - దేవుడు

దేవుడి దగ్గర ఎంతటివాడైనా దేవురిస్తాడు.

త్యాగరాజ స్వామి శ్రీరామునికి అనేక "పరిదేవనలు" చేశాడు. దీనంగా గోడు వెళ్ళబోసుకోవడానికి దేవుడే కదా... దొరికేది మనకి!

దేవుఁడు అని అర్థానుసారం (అరసున్న)తో రాస్తే వేలుపు అవుతాడు. అరసున్న లేని దేవుడు - నీటిలో తడివి ఎత్తడాన్ని సూచిస్తుంది. వెదకడం, బతిమాలుకోవడం, మిదుకు మిదుకు మనడం. వనరించడం, వాచారించడం, వనపున పడడం... ఇవన్నీ దేవురించడానికి సంబంధించిన పదాలు ! దీనాలాపం అనే అర్థంలో !

చిలికిన పాలలోంచి లేక మజ్జిగ లోంచి దేవుతూ వెన్నతీస్తారు! వెన్నతీసి తడవడం చేస్తారు. తడవడం అంటే దువ్వడం, నిమరడం లాంటిది. వెదికి పట్టుకోవడం కూడా !

ఇలా... దేవుతూ, తడవుతూ మన పనులు నెరవేర్చుకోవల్సి వుంటుంది. నిత్య జీవితంలో ! అదీ అసలు సంగతి!

వసుదేవుడంతటి వాడు చేసిన పని ఇదే!

ఇచ్చేవాడి కోసం లేనివాడు దేవుళ్ళాడతాడు. వాడు దొరికినప్పుడు దేవురిస్తారు. అలా ఇతరుల్ని దేవురించే వాణ్ణి 'దేబె' అంటారు.

దేవురు గొట్టు, దేబురు గొట్టు, దేబిరి గొట్టు - లాంటి పదాలు ఇలానే ఏర్పడ్డాయి.

"అభం శుభం తెలియక అరిచే ఈ దేబెలు మాకొకలెక్కా" అని ప్రత్యర్థుల్ని ఎత్తి పొడిచారు తిరుపతి వేంకటకవులు.

"పద్మినీ జాతిస్త్రీతో రతి వేడుక దేబె అయిన షండుడికి ఏం తెలుస్తుందీ.... అంటాడు వేణుగోపాల శతకంలో !

"వయసు దిగిపోయి పల్లిక దేబె రూపమున వగమాలి బ్రతికి యెవ్వరి నుద్ధరింప?" అని ద్విపద సారంగధర చరిత్రలో - "వయసు దిగిపోయింది. ముగ్గుబుట్టలా శరీరం తయారయ్యింది. ఎందుకూ పనికి రాని దేబెలా మిగిలాను. ఎవ్వరిని ఉద్ధరించాలి...?" అంటుంది ఓ వృద్ధ!

తన అవసరం కొద్దీ ఇతరుల్ని దేవి (దువ్వి) తడిమి "ఈ వఱదను కనురోఁ తల దేవుళ్ళం బడితి -" అన్నట్లుగా ఇచ్చేవాడి కోసం. దేబె దేవుళ్ళాడుతూనే బ్రతుకుతుంటాడు.

దేవుఁడు (భగవంతుడు) దగ్గర కూడా ఇలా దేవుడు - అంటే, దువ్వడం, తడమడం, దేవురించడం వంటివి చెయ్యలేకపోతే దేవుడంతటి వాడు కూడా "పోరా... దేబె" అంటాడు మనని !!

# ఆట

**జూ**దం ఆట ధర్మరాజు జీవితాన్నీ, పావురాలాట సారంగధరుడి జీవితాన్నీ, బొంగరాల ఆట బాలచంద్రుడి జీవితాన్ని పెనుమలుపులు తిప్పిన కథలు మనం చదూకున్నవే !

'ఆట' అనేది - ఆటలతోపాటు, పాటలతోసహా నటనాట్యకళాభినివేశాలన్నింటికీ వర్తించే పదం.

మొదటి ఆట వదిలేశారు అంటాం. నాటకం ఆడారు అంటాం. గజ్జెకట్టి ఆడితే ఆమెకు ఎదురేలేదని ప్రశంసిస్తాం.

ఆడవే... మయూరీ... నటనమాడవే మయూరీ... అనే నారాయణ రెడ్డిగారి పాటని గుర్తుచేసుకొంటాం.

'ఆటపాక'లు - థియేటర్లు లేని వూళ్ళల్లో ఆట (నాటకాలు) కోసం వేసిన పాకలు - రిహార్సల్సు వేసుకునే చోటు కూడా!!

'ఆటకూటమి' రంగస్థల కళాకారుల సమాఖ్యలాంటిది. లేదా, సురభి నాటకసంస్థ వంటిది.

ఆటచేడియ, ఆటవెలది, వెల్లాటగత్తె, ఆటది... ఇవన్నీ డాన్సింగర్ల్ అనదగిన స్త్రీకి తెలుగులో పేర్లు.

నిజానికి నిర్మలమైన స్త్రీని వెలది అంటారు. వెలదికి ఆట (నృత్యం) వచ్చు కాబట్టి, ఆటని, తన జీవికగా చేసుకొంది కాబట్టి ఆటవెలది అన్నారు. కాలక్రమంలో ఆటవెలది వేశ్యకు పర్యాయవాచకం అయ్యింది!

దేవదాసీ వ్యవస్థ కొనసాగినంత కాలం ఈ మాటకు ఈ అర్థమే మిగిలిపోయింది. ఆ తర్వాత ఆటవెలది మరుగున పడిపోయింది.

'ఆటరి' అనే ఓ అందమైన అచ్చతెలుగు పదం వుంది. నటుడు, నర్తకి, క్రీడాకారుడు – వీళ్ళందరినీ 'ఆటరి' అనే పేరుతో పిలుస్తారు.

పేరు చివర అడ్వకేట్. నోటరి – అని రాసుకున్నట్లే, ఆటరి అని నటనాట్య క్రీడారంగాలలోని ప్రముఖులు రాసుకునే రోజులు రావాలి. పదాలకు కొత్త గౌరవాలను మనం కల్పించుకోగలగాలి. 'ఆటగాడు' అంటే, నటుడు – క్రీడాకారుడు – వ్యాఖ్యాత కూడా !!

'ఆటపాటలు' జంటపదం. వినోద కార్యక్రమాలను సూచించేదిగా వుంటుంది.

ఆటపాటలు బాగా వచ్చిన కోడలు పిల్ల కావాలని కోరుకుంటారు చాలామంది పెద్దలు.

ఆటతోటలు అంటే, విహారస్థలాలు. ఎప్పుడైనా సరదాగా నాలుగు రోజులు తిరిగి రావడానికి, అన్ని హంగులూ వుండి సురక్షితమైన ప్రాంతాన్ని ఎంచుకొనేవారు రాజులు. ఆటతోటలు అలాంటి ఎంపిక చేసిన స్థలాలు.

"ఆటగీము"కూడా ఇలాంటి పదమే! 'ఊటీ' లాంటి టూరిస్ట్ కేంద్రాలలో హాలిడే రిసార్ట్స్ పేరుతో పెద్ద పెట్టున వ్యాపారం సాగుతోంది కదా... ఈ హాలిడే రిసార్ట్స్ వంటివే ఆటతోటలు, ఆటగీము వంటివి. ఆటగీము అంటే గెస్ట్‌హౌస్ అనే అర్థం చెప్పవచ్చు.

'ఆటపట్టు' విహారస్థలం.

"అట్టి హరికీర్తనలు నీకాటపట్టు" అంటాడు ఎఱ్ఱన.

"రామేశ్వరతీర్థం కరకంఠున కాటపట్టు –" అని శ్రీనాథుడు. ఆడుకునే చోటు అని కూడా అర్థం చెప్పవచ్చు.

'ఆటపాటు' అంటే ఉత్సాహంగా జీవించడం.

పేకాటలో మధ్యలో డ్రాప్ అయినా డబ్బులు కట్టక తప్పదు కదా... అందుకని "ఆటమాని వడ్డించుకోవడం" అంటారు దీన్ని.

ఆటకట్టింది అంటే, అవతలివాడి పని అయిపోయిందని! చదరంగం ఆటకు సంబంధించిన పదం ఇది.

'సాగదింక ఆట' అనేది హెచ్చరిక!

'ఆట విడుపు' పదాన్ని ఆటకు విరామం, కోలాహలం అనే అర్థాల్లో బాగా వాడ్తుంటాం.

వేదాధ్యయనం చేసే విద్యార్థులకు అనధ్యయన దినాలు - అధ్యయనం లేని 'హాలిడే'లు అరుదుగా వస్తాయి. ఆరోజు ఆడుకోవడం కోసం పిల్లల్ని స్వేచ్ఛగా వదిలేసేవారు. అది ఆటవిడుపు. ఆటకోసం విడుపు - అని !

ఇప్పుడు కూడా, బెల్ కొట్టగానే పిల్లలు బిలబిలా మని కోలాహలంగా బయటకు వస్తారు. ఈ కోలాహలంకూడా ఆటవిడుపే !

సినిమా ఆట మధ్యలో విశ్రాంతికి ఆటవిడిచినప్పుడు హాలుబైట ఇలాంటి కోలాహలమే వుంటుంది.

నీకు నేనంటే ఆటగా వుందే... అంటే, తనని తక్కువగా అంచనా వేసుకొని లోకువ చేసి వ్యవహరిస్తున్నాడని.

ఆటపెట్టడం అంటే, పీడించడం. ఆటపట్టించడం అంటే హేళన చేయడం. ర్యాగింగ్ వగైరా !

గానుగలో పెట్టి ఆడిస్తున్నాడు - అనడంలో చాలా లోతైన అర్థం వుంది. తక్కువ జీతం ఇచ్చి ఎక్కువ శ్రమని పిండుకొంటున్నప్పుడు ఎవరైనా ఈ మాటల్ని ఉపయోగిస్తారు.

ఆటకు గినిశాడు అంటే, మాట్లాడినదానికి కోసం తెచ్చుకున్నాడని ! భారతంలో ప్రయోగం ఇది.

ఆటల్లో అరిటిపండు - బాగా ప్రాచుర్యంలో వున్న తెలుగు జాతీయం. ఆటలాడేప్పుడు దెబ్బలు తగిల్తే, అరటిపండు దొరికినట్లు తేలికగా తీసుకోవాలని చెప్పడానికి ఈ జాతీయాన్ని వాడ్తుంటాం.

తేలికగా తీసుకునేవి, అప్రధానమైనవీ అయిన అంశాల్ని కూడా ఆటల్లో అరిటిపండుతో పోల్చి చెప్తుంటాం.

సభలూ, సెమినార్లూ జరిగినప్పుడు వాటతో ఏమాత్రం సంబంధం లేని అధికార్లూ, మంత్రులూ ఆటలో అరిటిపండుల్లా మధ్యలో వచ్చి కాసేపు సంబంధం లేని విషయాలేవో మాట్లాడేసి వెళ్ళిపోతుంటారు. పానకంలో పుడకలని మనం తిట్టుకొంటూ వుంటాం.

ఇలాంటి అసందర్భాల్ని తేలికగా తీసుకొంటేనే, నిజానికి మనకు మనశ్శాంతి. అసలు... మనశ్శాంతి వుంటేనే గదా... మన ఆట సాగేది... !!

# ఆకతాయి

దుష్టుడు, తుంటరి అనే అర్థంలో ఆకతాయి పదాన్ని ప్రయోగిస్తుంటాం. సంస్కృత 'ఆతతాయి' తెలుగు 'ఆకతాయి' కన్నా ప్రమాదకర వ్యక్తి. తెలుగు ఆకతాయి తుంటరి మాత్రమే ! కొద్దిగా దుష్టుడు.

సంస్కృత ఆతతాయిలు ఆరుగురున్నారని సూర్యరావుచాంధ్ర నిఘం టువు వివరణ ఇచ్చింది.

1) కొంపలంటించి చంపేవాడు

2) విషంపెట్టి చంపేవాడు

3) కత్తిపెట్టి నరికి చంపేవాడు

4) డబ్బుకోసం హత్యచేసేవాడు

5) ఆస్తికోసం హత్య చేసేవాడు

6) అక్రమసంబంధాల కారణంగా హత్య చేసేవాడు

వీరిలో ముగ్గురు రకరకాలుగా హత్యలు చేసేవారు ముగ్గురు రకరకాల కారణాలతో హత్యలు చేసేవారు.

ఈ వివరణ బట్టి, చిల్లర నేరస్తుల్ని తుంటరి మనుషుల్నీ ఆకతాయిలనే పేరుతోనూ, బడా నేరస్తుల్నీ, హంతకుల్నీ, ఆతతాయిలనే పేరుతోనూ పిలవడం మర్యాద పూర్వకంగా వుంటుంది కదా !

# తగులు

'పెను తగులం' అంటాడు పోతన - పెద్ద సంసార జంజాటాన్ని.

"పెను తగులం వదుల్చుకొని అనఘుని, విశ్వతోముఖుని అనన్య రీతిలో భజించ"మంటాడాయన !

నిజానికి తగులు అంటే, ఆసక్తి. కానీ, ఈ తగుల్ని తగులుకొంటూ ఇంకా చాలా మాటలు పుట్టుకొచ్చాయి.

"అక్కడికి వెళ్ళాక నాకింకో పని తగిలింది"

"ఈ పిల్లవాడు నన్నే తగులుకొని నావెంటే తిరుగుతున్నాడు"

"ఆపదలు తగులుకొంటాయి"

"అంటురోగాలూ తగులుకొంటాయి"

"రాజులు తమ్ముల్లని వారి వెనుకఁదగులుదురు" అని భారతం.

ఇష్టం లేనిపనిని బలవంతంగా చేయించడాన్ని "తగులకట్టడం" అంటారు. అలా తగుల కట్టిన పనిని పూర్తి చేసినా అధి తగులబడ్డట్టే వుంటుంది.

తగులు ఆట - తగులాట - అంటే, మన్మథుడు ఆడేఆట.

ఉత్తర రామాయణంలో కంకంటి పాపరాజు గారు "మన్మథుడే మనిద్దరికీ తగులాట ఇచ్చాడు -" అంటాడు.

"తనువు గల్గిన మేలు తగులాయమే గాని..." అంటాడు భాగవతంలో పోతనగారు.

ఇలాంటి తగులాటకు - "తగులాట గత్తె" "తగులాటగాడు" సిద్ధంగా వుంటారెప్పుడు.

'దానికి మనసు వాడి మీద తగులుకొన్నట్లుంది' అని చెవులు కొరక్కుంటారు ఇరుగూ, పొరుగూనూ... !

"తగిలేదాకా మేళం - అగపడితే తాళం" అని రాధికా స్వాంతనంలో "అవసరానికి మనుషుల్ని మార్చుకునే బుద్ధి అనే అర్థంలో ఈ ప్రయోగం" కన్పిస్తుంది.

"జగతి నాయకుని సౌందర్య జాలంలో దేవకాంత "తగులం బడ్డది" అని కేయూర బాహుచరిత్రలో మంచనకవి "వ్యామోహ పడిది -" అనే అర్థంలో ప్రయోగించాడీ మాటని.

"లాభాలు మిగుల్తాయి - నష్టాలు తగుల్తాయి"

"తగులూడటం అంటే భవబంధాలు తెంచుకోవడం.

"తగులు విడిబేరం' అంటే, ఒక్కటొక్కటే విడివిడిగా అడిగి తెచ్చుకోవడం. "కామగవీ సురతరువులు వేయాఋను నిచ్చుఁ దగులు విడిబేరముగా" అంటాడు పాండురంగ మాహాత్మ్యంలో తెనాలి రామకృష్ణుడు !

కామగవీ అంటే కామధేనువు. సురతరువు అంటే కల్ప వృక్షం. ఇవి రెండూ కోరిన కోర్కెలు వెయ్యింటినైనా తీరుస్తాయిట. కానీ విడివిడిగా ఒక్కక్కటే అడగాలట ! - అదీ తగులు విడిబేరం !

ఇక్కడో ధర్మ సందేహం కలగవచ్చు - 'విడిబేరం' అంటే సరిపోతుంది కదా... ఈ 'తగులు విడిబేరం ఏమిటీ' - అని ! తమతో తగులై వున్నవారికి, తగులొనర్చిన వారికి - అంటే, తమ పరమ భక్తులకు మాత్రమే ఈ కోర్కెలీడేరే అవకాశం వుంటుందని సూచించడానికే 'తగులు విడిబేరం' అంటాడు.

"తానును ఆ పరిణామంబులకు తగువైయుండును" అని అన్నమయ - "తాను కూడా అందుకు సంబంధించిన వాణ్ణే" అనే అర్థంలో ఈ మాటను ప్రయోగిస్తాడు.

"ఆ మాత్రం నీకు తగులం కామా... ?" అనడుగుతాడు నాయకుడు జానపద గాథల్లో నాయకని !

"రసిక రాజ తగు వారము కామా ... ?" అనే పాత తెలుగు సినిమా పాట – మీకు కావలసిన వాడినేనని చెప్తుంది.

"తగుదునో... తగనో..." అని సంకటంలో పడతాం.

"తగదిది తగదిది ధరణీ ధరవర సుకుమారీ... నీకిది తగదని నేనన లేదా ..." అనే మల్లాది వారి పాట గొప్పది !

'తగులంపూని తగిలాడు' అంటే, వ్యామోహం కొద్దీ వెంపర్లాడాడని ! 'తగులు కొండి' తార్చి బతుకుతుంటాడు. 'తగులు కొలుపులు' అంటే, వలపించే మార్గాలు.

'సమయానికి తగు మాటలాడి' అని త్యాగరాజకీర్తన.

'తగుపొద్దు' అంటే కొద్దిసేపు అని. "ఈ మధ్య అమెరికా వెళ్ళి, కొడుకు దగ్గర తగుపొద్దు గడిపి వచ్చాడు –" అని చెప్పుకొంటాం తెల్సినాయన గురించి.

"ఈ తగులు కోలు వ్యవహారాలు నాకు గిట్టవ్" అని ఖండిస్తారు తప్పుడు పనుల్ని పెద్దలు.

"మేధావులకు తగులు పడని విద్య వుందా?"

"నదికి నీరు తగిలింది"

మనసుకు తగిలింది' అంటే బాధపెట్టే మాటలేవో పడ్డట్టు.

"తొగతగులు" అంటే మనఃకారకుడైన చంద్రుడు. తొగ అంటే కలువపూవు. దాని తగులు అంటే ప్రియుడు – చంద్రుడు. ఇదీ సంగతి !!

# హఠాత్తు

హఠాత్తుగా మంత్రిగారు వస్తున్నారంటే, ఊరుఊరంతా హడావిడి పడిపోతుంది. అందాకా ఎందుకు, అదాటుగా నలుగురు చుట్టాలు ఇంటికి భోజనానికి వస్తారన్నా ఇంటిల్లిపాదీ ఆదరబాదర అయిపోతారు.

హఠాత్ అనే సంస్కృత పదం, హఢ అనే ప్రాకృతపదం, అదాటు అనే తెలుగు పదం ఇవన్నీ ఒకే అర్థంలో ఏర్పడిన మాటలు. అదటు అన్నా ఇదే.

"అమాంతం మీద పడ్డాడు" అంటాం. అవచాటం, హఠికం, అకందం అగంతుకం – ఇవన్నీ ఆకస్మికంగా జరిగే సంఘటనల్ని సూచించే పదాలు. ఎంతో అందంగా అమరిన చక్కని ధ్వన్యనుకరణ పదాలు. హఠాత్తు అనే అర్థంలో ఇంకా చాలా వున్నాయి.

"చటుక్కున వచ్చి చక్రం అడ్డువేశాడు."

"దడాలున తలుపేశాడు."

"పెద్ద 'ఉద్దవడి'లా తుఫానుగాలులు హోరెత్తిస్తున్నాయి."

"పుటుక్కున ఊడిపడింది."

"కటుక్కున కొరికాడు."

"రివ్వున ఎగిరి పోయింది."

"చెంగున దూకింది."

"చట్టున పట్టుకున్నాడు దొంగని".

"డబ్బాటుగా జరిపేశాడు పెళ్ళి – ఓ అచ్చటా లేదు ఓ ముచ్చటా లేదు"

"కసుక్కున నమిలేశాడు"

తళుక్కున మెరిసింది.

"తుసుక్కున ఉమ్మేశాడు"

"చురుక్కుమంది"

"తుస్సుమని పేలింది"

"గొబ్బున కానివ్వండి – చీకటి పడ్తోంది"

"ధడేలున మాట విసుర్తాడు"

"దబ్బున తెమలండి"

"భడేలున విరుచుకుపడింది"

"బుస్సున ఎగిసింది"

"గభాల్న పడిపోయింది" "గభీల్న లేచాడు" "గభీల్న అరిచాడు"

"చర్రున లేచింది కోపం"

"చర్రున పరిగెత్తాడు"

"బర్రున వెళ్ళింది"

"గిర్రున తిరిగింది"

"తుర్రున పారిపోయింది"

"గ్రక్కున విడువంగ వలయు" అంటాడు సుమతి శతకకారుడు.

"చయ్యున పరిగెత్తి కదుల్తున్న బండి ఎక్కేశాడు"

గ్రమ్మున వచ్చేశాడు పని ముగించుకొని

"డిగ్గని ఆవేశంగా లేచి ఉరిమిచూశాడు"

"టకాలున దూకేశాడు"

'కరాలున లాక్కున్నాడు"

"తటాలున కొమ్మ వంచి గోరానెదు నంతలోన" అని కరుణశ్రీ గారి పుష్పవిలాపం పద్యం!

"చటాలున విరిచాడు"

"అదాటు"గా పనులు సాధించగల నేర్పరులలో సాధారణంగా 'అదటు' అంటే బలగర్వం, అదిరిపాటు వంటివి వుంటాయి. ఇవి లేకపోతే, "స్పీడ్" వుండదు మనిషిలో!

"రాక్షసుడు ఆవహించినప్పుడు అచలచాలనచణమైన అదటు కల్గింది-" అని వర్ణిస్తాడు పెద్దన మనుచరిత్రలో.

"ధైర్యం చెప్పి వెన్ను తట్టేసరికి ఎక్కడలేని "అదటు"తో చెలరేగి ఆడాడు" అని మెచ్చుకోవచ్చు క్రీడాకారుణ్ణి !

నిజానికి "జేబులో బొమ్మ వుంటేనే వీరుణ్ణి" అడదగిన వ్యక్తులలో ఈ అదటు ఎక్కువగా కన్పిస్తుంది.

వీళ్ళు, తమ స్వంత శక్తియుక్తుల మీద కన్నా ఇతరుల ప్రోత్సాహ ప్రోద్బలాల మీద ఎక్కువ నమ్మకంతో వుంటారు. ఆత్మవిశ్వాసం లేని వాడికి ఆత్మబలం ఎలా వుంటుందీ ??

'హఠాత్కరించడం" అంటే, బలాత్కరించడం' హఠాత్తుగా వచ్చి బలాత్కరించాడు అనడాన్ని 'హఠాత్కరించాడు' అంటాడు కవి !

హఠాత్తుగా కలిగే వాటిలో కోపం ముఖ్యమైంది కాబట్టి "హఠారం" అంటే ఉగ్రం అనే అర్థం ఏర్పడింది.

హఠాత్తుగానో, అదాటుగానో పనులు చేసేప్పుడు కొంత తొట్రుపాటు సహజంగా వుంటుంది. అలా తొట్రుపడటాన్ని "ఆదరబాదర" అంటారు.

'అదల్ బదల్' అనే హిందీ జంటపదం, 'అదలా బదలా'గా మారింది 'తారుమారు' అనే అర్థంలో అదా బిదా, ఆదర బదర, ఆదర బాదర, ఆదరా బాదరా వంటి పదబంధాలు దీన్ని బట్టే ఏర్పడ్డాయి.

అదాటున చేసినా ఆపని అదా బిదా అయిపోకూడదు. అది మనకు "ఆదుర్దా" కల్గించకూడదు.

# ఆగు

నిశ్చలంగా ఉన్న ఆకాశంలోకి చూడండి... ఎవరో మెట్లుకట్టి ఆ అనంతలోకాలకు దారి ఇదే... రమ్మని పిలుస్తున్నట్లుంటాయి మేఘాలు.

మెట్లుకట్టినట్లు మేఘాలు అందంగా అమరడాన్ని "ఆగడపలు" అంటారు. "ఆగడపలెక్కి చుక్కల తోటకెళ్ళి చుక్కపూలు కోసి తెచ్చి మా పాపాయికిస్తాను-" వంటి రమ్యమైన ఊహనే ఆకాశానికి నిచ్చెన వేయడం అంటారు. 'ఆకాశానికి నిచ్చెన వెయ్యడం' కన్నా "ఆగడపలెక్కి తిరగడం" మరింత అందంగా అమర్తుంది.

"ఆగడపలు వేసినవి అత్తగారూ - అంటే, పురిసెడు వెనక్కి తీయవే కోడలా... అందిట - అని ఓ తెలుగుసామెత.

'ఆగడపలేస్తే అవస్యం వర్షం' అంటారు.

ఆడేలు, ఆడెలు, ఆడెబలు, ఆగడపలు - ఇవి మేఘమాలికలు అనడానికి వాడదగిన అచ్చతెలుగు పదాలు.

చేను పూర్తిగా తడవకుండా అక్కడక్కడా పొడిపొడిగా ఉన్నప్పుడు "ఆగడపలున్నాయి - సరిగా తడుపు" అంటాడు రైతు.

"గడప" అంటే గట్లదగ్గర నాగలితో దున్నడానికి అందని ప్రాంతం. దీన్ని పారతో చెక్కి నీరు పెడతారు.

'ఆగడం' అంటే ఆగిపోవడమే! ఏం ఆగిందీ? ఏదో జరగవలసిన మంచి జరగకుండా ఆగింది. జరగకూడనిది మాత్రం జరిగిపోయింది... అని! ఇలా జరగకూడనివి జరగడాన్ని 'ఆగడం' అంటారు.

"ఈ మహర్షి మావాడే! ఆయన్ని ఆగడం చేస్తారెందుకు?" అని మహాభారతంలో ఓ వేశ్య ఓ మునిని రక్షించినట్లుంది.

"అవయవాలు కదిలేలా అదిమి అదిమి ఏమేమో ఆగడాలు చేశాడమ్మా... ఎలా చెప్పను? సిగ్గునోరెత్తనీయడం లేదు-" అని అనిరుద్ధ చరిత్రంలో ఓ కమ్మని వర్ణన.

"వదిలామంటే మళ్ళీ ఎప్పటిలాగే ఆగడాలు చేస్తావు. నిన్ను పట్టుకోవడం ఎవరి తరమూ కాదు-" అంటారు గొల్లభామలు - చిన్నికృష్ణుడితో, హరివంశంలో!

"లేని ఆగడాలన్నీ వంటిమీద సృష్టించుకొని" చిత్రాంగి సారంగధరుడి బతుకు ఆగడం చేసిన కథ అందరికీ తెల్సిందే!

"ఆగడంతో పురివిచ్చి ఆడాడు-" అంటే, అమాయక జనం మీద దౌష్ట్యం చెలాయించాడని!

చంద్రుడి ఆగడాలు విరహంతో రగిలిపోయేవారిని ఇబ్బందిపెడతాయి.

"ఆగడాల ప్రభుత్వం మళ్ళీ కరెంటు రేట్లు పెంచింది-"

"వాడితో పెట్టుకుంటే ఆగడం అయిపోతావు"

"ఈ ఆగడీడు వంశంలో చెడపుట్టాడు"

అబ్బ దాసయ్యగారిని ఆగడించడం గురించి పాల్కురికి సోమనాథుడు పండితారాధ్యుల చరిత్రలో వర్ణిస్తాడు. అవమానించడం అనే అర్థంలో!

ఆగడీడు ఆగండాలను సృష్టిస్తాడు. ఆగండాలంటే, అబద్ధాలు.

బొంకులబాన, అబద్ధాలపుట్ట, అబద్ధాలకోరు... అనదగినవాడు ఆగడీడు!

ఆగవేగం అంటే అతివేగం. ఆగమేగాల మీద పోవడం అంటుంటాం. ఆఘమేఘాలు అని కూడా అనవచ్చు. కొంచెం ఎక్కువ సంస్కృతంలా కన్పిస్తుంది. అంతే!

'చెయ్యి' అనగానే 'చేశాను' Do అంటే Done అనగలిగే చాతుర్యాన్ని

'ఆగవేగం' అంటారు. పూర్తివేగం (MAXIMUM SPEED) తో వెళ్ళడానికి "ఆగవేగం" అనే పదాన్ని ఉపయోగిస్తారు.

నిలకడలేని మనుషుల్ని, నిరర్థకుల్ని, ఎవ్వరికీ ఉపయోడపడని వాళ్ళని 'ఆగమ్మ పక్షులు' అంటారు. ఏ దిక్కూ లేని పక్షులు... అని !

ఆగభోగాలు అంటే అమితమైన సంపదలు. "ఆగభోగాలు అక్క కుడిస్తే, అంబటి మరకలు బావకుడిచేదని తెలుగుసామెత ! తన నోరుకట్టుకుని తనవాళ్ళని పైకి తెచ్చేవాడికి ఇది వర్తిస్తుంది.

ఇంటికి వచ్చిన చుట్టం ఇవ్వాళ కాకపోతే రేపైనా వెళ్ళకతప్పదు. పుట్టిన ప్రతి ప్రాణీ ఏదొక రోజున గిట్టకా తప్పదు. బజార్లో కొన్న వస్తువుకు సంవత్సరం గ్యారంటీ అంటే, ఆ సంవత్సరం తర్వాత చెడేది గ్యారంటీ అనే అర్థం అంతర్లీనంగా వున్నట్టే కదా! ఇలా పుడుతూ చస్తూ వుండే గుణాన్ని" "ఆగమాపాయి" అంటారు.

"ఆగమాపాయిగా ఎవరికి వాళ్ళు వచ్చి పోతున్నారుగానీ, అక్కడ ఏం కావాలో ఎవరూ పట్టించుకోవడం లేదు–"

"ఆగమాపాయిగా గుడికి వెళ్ళొచ్చినంత మాత్రాన పుణ్యంరాదు"

"శ్రద్ధగా చదవకపోతే బుర్రలో సబ్జెక్టంతా ఆగమాపాయి అయి పోతుంది–"... ఇలాంటి ప్రయోగాలు చెయ్యడానికి 'ఆగమాపాయి' బాగా ఉపయోగపడే మాట !

పంటలు నూర్చి తూర్పార పోస్తే - గాలికి తప్ప, తాలు వగైరా ఎగిరి పోతాయి. అలా ఎగిరిపోయే తప్పల్ని "ఆగాడి" అంటారు. ఆగాడి మనుషులు ఎప్పటికైనా తప్పల్లా ఎగిరిపోవాల్సిందే !

తొందరపాటు నిర్ణయాల్ని "ఆగాయిత్యాలు" అంటారు. ఆకాత్యం, ఆగాయిత్యం, ఆగత్యం, ఆగాయిత్తు, ఓగాత్యం, అఘాయిత్యం ఇవన్నీ వాడుకలో వున్న మాటలే !

"మీరెప్పుడూ యిలాంటి వోఘాయిత్తం మాటలే అంఘావుంఘారు" అంటుంది కన్యాశుల్కం నాటకంలో బుచ్చమ్మ తల్లి వెంకమ్మ !

ఆత్మహత్యకు తలపడటం వంటి ఆగాయిత్యాన్ని చేసే పిల్లల్ని 'ఆగాతమ్మ' అంటారు. 'ఆగాతమ్మ' అని ఆడపిల్ల గురించే ఎందుకు చెప్పడం అంటే, వరకట్న పిశాచాలకు ఇలా బలి అయ్యేది ఆగాతమ్మలే కాబట్టి ! ఇలాంటి సామాజిక అవ లక్షణాల్ని ఆగపెట్టేందుకు మళ్ళీ సంస్కర్తలు పుట్టుక రావాలి. ఒక రామ్మోహన్ రాయ్, మరో వీరేశలింగం మనకు కావాలి.

చెడు జరగకుండా ఆపగలగడాన్ని "ఆగిడి" అంటారు. రోగాలు రాకుండా చేసే వైద్యాన్ని (PREVENTIVE MEDICINE) ఆగిడివైద్యం అనవచ్చు. "ఆగుడు మందు" అనేది మంచి పదం.

మనుషులకే కాదు, సామాజిక రుగ్మతలక్కూడా ఆగుడు మందు కావాలి!!

# చెలగాటం

దేశాధినేతలకు చెలగాటం - జనసామాన్యానికి ప్రాణ సంకటమే కదా! తిక్కపుట్టిన మంత్రి అర్ధరాత్రి నిర్ణయాలు తీసుకుంటే, ప్రజాస్వామ్యంలో ప్రజలు చేయగల్గిందేమైనా వుందా...?

'చెలగు' అంటే, ఉత్సాహించడం, విజృంభించడం, సంతోషించడం, మోగడం, వుండడం, కలగడం, బొబ్బరించడం, ఓడించడం, వికసించడం... ఇలా చాలా అర్థాలున్నాయి.

చెలరేగింది - అంటే, బాగా ఎక్కువగా రేగిందని !

చెలగి ఆడింది - అంటే, చెలగటం - బాగా ఎక్కువగా ఆడటం.

చెలగడం - పీడించి విజయం సాధించడం.

"చెలఁగిచెలఁగి మలఁగిమలఁగి యల్లల్లన క్రాలిక్రాలి బిట్టు తూలితూలి-"

"చెలఁగి యిట్టేము చేసిన సేఁతలెల్లి -"

"పంచ మహా వాయిద్యాలు చెలఁగినాయి"

"కలిమిలేములు వృద్ధిచెందిన చెలఁగుతాయి" ... ఇలాంటి కవి ప్రయోగాలు ఎన్నో వున్నాయి.

పరశురాముడు ఇర్వై ఒక్కసార్లు గండ్రగొడ్డలితో రాపొజుల్ని చెలవినాడట !

నరికేయడం, లేపేయడం, గల్లంతు చేసేయడం అనే అర్థాల్లో కూడా చెలగుపదాన్ని వాడ్తుంటారు. 'కంచెను చెలగేశాడు' అంటే, నరికేశాడని !

"ఆ కాకిగోలతో పిల్లలు చెవులు చెలగిస్తున్నారు' అని విసుక్కొంటారు పెద్దలు.

"చెలగించడం" అనేది తొలగించడం కన్నా పెద్ద ప్రయోగం. ప్రమాద కరమైంది కూడా ! వీధి ఆక్రమణల్ని మున్సిపాలిటీ వారు తొలగిస్తారు. తమ మాట విననివాళ్ళని రౌడీనాయకులు చెలగిస్తారు. అదీ తేడా! భీభత్స భయానక దృశ్యాల్ని సృష్టించడాన్ని చెలగించడం అంటారు.

చెలగబారడం అంటే బాగా విస్తరించడం. "నాటిన ఏడాదికే ఈ చెట్టు చెలగబారింది-" అనేది అందమైన ప్రయోగం. "చెలగబారిన చినదానా... పలకమారావే పడుచుదానా..." లాంటి పాటలు కట్టుకోవచ్చు... సరదాగా! పలకమారడం అంటే కాయ ముదిరిందని!

సభలో మంత్రిగారిని ఒకరిని మించి ఒకరు చెలరేగి పొగిడారని సహించలేని ప్రతిపక్షం వాళ్ళు వ్యాఖ్యానిస్తుంటారు.

'మదంబున చెలరేగిన' అని దుష్టపాత్రల్ని వర్ణించేవారు ఒకప్పుడు.

"చెలరేగిన వాన" - ఎన్నాళ్ళనుంచో ఎదురుచూసిన మంచివాన. "చెలరేగిన జడివాన" "ఈ వేసవి చెలరేగింది-" లాంటి ప్రయోగాలున్నాయి-

"ఇంకొంచెం చెలర్చి ఆడితే సెంచరీ పూర్తిచేయగలిగి వుండేవాడు-"

"చెలరారిన ఆటగాళ్ళు మన జట్టులో వున్నారు"

"చెల్లాట అంటే చెలరేగి ఆడిన ఆట."

"జీవితాలతో చెల్లాటలాడకు" అని నెగెటివ్ కోణంలోంచి కూడా ఈ మాటను ప్రయోగించవచ్చు.

ఏమైనా, చెలరేగే తత్త్వం వున్నవాడే, జీవితంలోనూ ముందుకు దూసుకు పోగల్గుతాడు !

బ్రతుకులతో చెలగాటమాడేవాణ్ణి సమాధానం చెలరేగ గల్గిన వాడే చెప్పగలడు!!

# ఎద్దు

మనుషులు మధ్య ఆర్థిక సంబంధాలు "ఏలేవాడి ఎద్దుపోతే ఏమిటి? కాచేవాడి కన్నుపోతే ఏమిటి?" అనే పద్ధతిలో నడుస్తున్నప్పుడు సమాజం ఒంటెద్దు పోకడలో వున్నట్టే లెక్క!

యజమాని ఎద్దుపోయిందని పాలేరుకు బాధలేదు. పాలేరు కన్ను పోయిందని యజమానికి బాధలేదు... ఇలా అనుకుంటే, మానవ సంబంధాలకు అర్థం లేదు.

"అడిగిన జీతంబియ్యని, మిడిమేలపుదొరను గొల్చి మిదుగుట కంటెన్ వడిగల యెద్దులగట్టుక మడిదున్నుక బ్రతకవచ్చు మహిలోసుమతీ -" అని సుమతీ శతకకారుడి పద్యం.

"ఎద్దు తత్తడి జోదు" అంటే, అచ్చతెలుగులో - 'ఎద్దుని వాహనంగా గలవాడు-' శివుడు అని! కైలాసంలో కాపురంవుండే కాలకంఠుని "కావలి" నంది.

'తాండవ తాళికన్' అంటే శివతాండవానికి లయాన్వితంగా అడుగులు వేసే ప్రజ్ఞ 'నంది' కుంది. 'నంది' అంటే సౌఖ్యమైనది అని అర్థం చెప్తారు పెద్దలు. 'శాలంకాయనం' అంటే నందే నంటారు. నంది చెవుల సందు ల్లోంచి శివుడి తేజోపుంజాల్ని దర్శించుకొని దాని పృష్ఠాన్ని నిముర్తారు భక్తులు.

'ఎద్దు' అనగానే స్పెయిన్ దేశం గుర్తుకొస్తుంది. అక్కడ ఎద్దుల్ని రెచ్చగొట్టి భయంకరంగా వాటితో పొడిపించుకొంటూ, తొక్కించుకొంటూ 'బుల్‌ఫైటింగ్' అనే ఆటని జనం వెర్రెత్తినట్లు ఉత్సవంగా ఆడుతుంటారు.

ఎద్దుమీద కుక్కల్ని ఉసిగొల్పి, 'బుల్‌రింగ్'లో వాటిని ఆడించే ఆట కూడా కొన్ని ప్రాంతాల్లో ఉంది.

అడవికి ఎద్దుని తోలుకెళ్ళి దాన్ని ఎరగా చూపించి, మాటు వేసి సింహాల్ని, పులుల్ని వేటాడే వాళ్ళు పూర్వం! ఎద్దువేట అంటారు దీన్ని. ఒక విధంగా ఎద్దుని బలిపశువుని చేయడమే కదా... ఇది ! చివరికి ఎద్దువేటలా అయ్యింది వాడి బతుకు" అంటే, అందరూ కలిసి చేసిన నేరాన్ని ఒకడిమీదకు నెట్టేసి తప్పుకొన్నారని అర్థం! 'ఏదువేట' అని కూడా అంటారు.

కన్నడంలో "ఎద్దూ", "ఎత్తు", తుళులో "ఎరు", తమిళంలో "ఎరుతు", మరాఠీలో "ఎడుతు", మూలద్రావిడంలో "ఎర్-త్", తెలుగులో ఎద్దు ఒకే కుదురు లోంచే ఏర్పడ్డాయి.

పాలనిచ్చే తల్లి ఆవు. పంటనిచ్చే తండ్రి ఎద్దు.

"ఎద్దులూ బండ్లూ ఏకమైతే కొండమీదకి నిట్టనిలువుగాపోగలవు -" అంటే, ఐక్యంగా వుంటే ఎంతటి అసాధ్యమైన పనినైనా సాధించవచ్చని అర్థం. 'కళాపూర్ణోదయం' కావ్యంలో పింగళిసూరన ఈ ప్రయోగం చేశాడు.

"ఎద్దు తన్నేనని గుఱ్ఱముచాటున కేగు" అనే ప్రయోగం అన్నమయ్యది! ఒకబాధని తప్పించుకోవడం కోసం, అంతకంటే పెద్ద బాధను తలకెత్తుకోవడానికి ఈ జాతీయాన్ని వాడవచ్చు. ఎద్దు తన్నిందని గుఱ్ఱం చాటుకెడితే అది ఎగిరెగిరి తంతుంది!

'ఎద్దు పట్టిన సివము' అనేది కూడా అన్నమయ్య ప్రయోగమే ! 'ఎద్దు పట్టిన సివంలాగా గంతులేయిస్తాడు - వాడితో పెట్టుకోకు అని మనం కూడా హెచ్చరించవచ్చు మిత్రుల్ని -

దుక్కిటెద్దుని 'హాలికం' అనీ, బండి టెద్దుని 'అనడ్వాహం', 'శక్వారం అనీ పిలుస్తారు. ముక్కుతాడు కట్టిన ఎద్దుని 'నస్తితం', 'నస్వొతం' అంటారు. "నసీపోత బలీవర్ధన్యాయం" అంటే, ఎద్దుకు ముక్కుతాడు కట్టి అదుపులో వుంచినట్లు దుష్టుణ్ణి కూడా అదుపులో వుంచాలని.

"అక్షధూర్తిలం" అంటే ఎద్దు.

ఎద్దులమందని 'ఔక్షకం' అంటారు.

'అచ్చుటెద్దు', 'ఆలపోతు', 'ఆలరేడు', 'గడిపోతు', 'గోపతి', 'ముడిగిచ్చ', 'ఇట్చరం' వంటి అందమైన పేర్లు "ఆబోతు"కున్నాయి.

ఇష్టంవచ్చినట్లు చరిస్తుంది కాబట్టి 'ఇట్చర' అన్నారు. "యథేచ్ఛం విహార వృషభరాజ" అని సంస్కృత న్యాయం. 'బసవన్న ! ఇష్టం వచ్చినట్లు తిరుగు, నిన్ను

అడ్డుకునేవారే వుండరు అని దాని పిర్ర మీద ఒక ముద్రవేసి ఆబోతును వూరిమీదకు వదుల్తారు. వూళ్ళో ఆవులకు సంతానప్రాప్తిని కల్గించడం ఈ ఆబోతు విధి. "కామ్య వృషోత్సర్జనం" అంటారు ఇలా అచ్చువేసి ఆబోతుని వదలడాన్ని!

గంగిగోవులాగానే సాధు ఎద్దుని గంగిరెద్దు అంటారు. ఏం చెప్పినా తలవూపడం దాని లక్షణం.

ఎద్దుకి మూపురం అందం. సింధుకాలం నాటి నాణాలపైన కన్పించే ఎద్దు ఎత్తయిన మూపురంతో గర్వంగా నిలబడి వుంటుంది. కందం, కకుత్తు, కకురం, హంసకూటం - ఇవన్నీ మూపురానికి పేర్లు.

ఎద్దు ముద్దులు కులికే జంతువు కూడా.

పుంగనూరు ఎద్లు, ఒంగోలు ఎద్లు, మైసూరు ఎద్లు ప్రపంచ ప్రఖ్యాతి చెందినవే!

కుడి ఎడమల వుండే ఎద్లని సూచించే జంటమాట 'వెలపట దాపట!' ఎటువైపు కట్టే ఎద్దుని అటువైపే కట్టి చాకచక్యంగా నడ్పిస్తారు ఎడ్లవాళ్లు!

"ఎద్దుపుండు కాకికి ముద్దా?" అని అడగడం అంటే, మనమీద అవతలి వ్యక్తికి సానుభూతి లేదని తెలియజెప్పడమే!

ఒకవైపు ఎద్దునీ, ఇంకోవైపు దున్నపోతునీ కట్టి పొలం దున్నాలని ప్రయత్నిస్తే "ఎద్దు 'ఏదాటికీ' దున్న 'కోదాటికీ' లాగుతాయి ! లేదా, 'ఎద్దు' 'ఎండ'కు ఎనుబోతు 'నీడ'కూ లాగుతాయి ! సమవుజ్జీలు కాని విరుద్ధ మనస్తత్వం గల వ్యక్తులిద్దరికి ఒకేపనిని అప్పజెబితే ఇబ్బందులే ఏర్పడతాయి !

"ఎద్దునడిగా గంతలు కట్టడం?" అనే మాట కొంచెం కటువుగా విన్పిస్తుంది. పెళ్ళి విషయంలో అబ్బాయిది గానీ, అమ్మాయిదిగానీ, అభిప్రాయా లతో పనిలేదనీ, తనమాటే 'ఫైనల్' అనీ ప్రకటించే తండ్రి - "ఎద్దునడిగా గంతలు కట్టేది?" అంటాడు.

పత్తిగింజలు తింటావా బసవన్నా అంటే 'ఆహా' - అన్నాడట! గంతకట్టనా బసవన్నా అంటే 'ఊహూ' - అన్నాడట ! పనిదొంగల గురించి ఈ సామెతను చెప్తారు.

కష్టపడి పొలాన్ని దున్ని ఎద్దు అలిసి పడుకొంటే, పిఋజు అనే చిన్న కీటకం గాలి వూది సేద తీర్చానని బడాయిలు చెప్పుకొందిట. 'ఎద్దు దున్నగా పిఋజు వూరడించింది' అనే తెలుగు సామెతకు అర్థం ఇది. గోరంత సాయం చేసి కొండంత గొప్పలు చెప్పుకునే వాళ్ళని చూసి ఈ సామెతని చెప్తారు.

అనాలోచితంగా కొన్ని నిర్ణయాలు చేయడాన్ని 'ఎద్దీనిందంటే గాటిలోకట్టి వేయమన్నట్లు' అంటారు. "ఎందైనా నిటువంటి వెద్దీనెననిన గొందిన గట్టుమటన్న చందములు తగునె-" అంటాడు పాల్కురికి సోమనాథుడు.

ఎద్దుకట్టె వంకెలు అనే పేరుగల వడ్లు వుండేవి.

ఎద్దుతొక్కుట, ఎద్దొక్కులు, ఎద్దోకులు అంటే బావినించి నీరు, మోటదొన్నె లోకి పడేందుకు చేసే ఏర్పాట్లలో వాడే రెండు కొయ్యలు !

'వుంగవం' అంటే ఎద్దు. 'మగావు' అని! "పుంగవుడు" అంటే శ్రేష్ఠుడు. పురుష పుంగవుడు అంటే పురుషులలో శ్రేష్ఠుడని! పుంగవానికీ, పుంగవుడికీ తేడాని గమనించండి! ఆయన్ని పురుష పుంగవం అనకండి. అర్థం మారిపోతుంది.

రోడ్డుకు అడ్డంగా నిలబడి ఎంత హారన్ కొట్టినా తప్పుకోని పశువుల్ని చూసి "ఇనప సరుకు'' అని తిట్టుకొంటాం మనం. ఇనప అంటే నల్లని అనే అర్థంలో ఇనప+ఎడ్లు అంటే ఎనుములు, గేదెలు, దున్నలూ ఇలాంటి జంతువు లని అర్థం. 'ఎనపగొడ్లు' అనే మాట రాయలసీమలో నేటికీ వాడుకలో వుంది. ఎనుము, ఎనుబోతు అనే పదాలు ఇలానే ఏర్పడివుండొచ్చు. ఇనపతేలు అంటే నల్లనితేలు అని !

"వాడికి శృంగభంగం అయ్యింది" అంటాం! అంటే పొగరు అణిగిందని! ఇక్కడో గమ్మత్తు కథ చెప్తారు.

ఓ గానుగ యజమాని దగ్గర అందంగా అమరిన గుండ్రటి కొమ్ములున్న ఎద్దు ఒకటి వుండేదిట ! ఎదురింట్లో తంబళ్ళ వీరయ్య అనే శివార్చకుడికి ఈ ఎద్దుని చూస్తే పరమ అసూయ. అసూయతో పాటు దాని కొమ్ముల మధ్య తాను సరి పోతానా – లేదా అనే ఓ అనుమానం వుండేది ! ఆ అనుమానం తీర్చుకోవడానికి అమాంతం ఎద్దుకి ఎదురుగా వెళ్ళి నిలబడ్డాడట! ఎద్దు ఓ కుమ్ము కుమ్మింది. తంబళ్ళ వీరయ్య ఎద్దుకొమ్ముల మధ్య ఇరుక్కుని గిలగిల్లాడాడు. నలుగురూ మూగి ఎద్దుకొమ్ములు కోసి వీరయ్యని బైటకు లాగారు.

ఈ విధంగా ఎద్దుకి శృంగభంగం అయ్యింది. వీరయ్య అసూయ కూడా తీరింది. అసూయతో పాటు, దాని కొమ్ముల మధ్య తను సరిపోతాననే అనుమానం కూడా తీరింది. గుండు గొమ్ముల అనుమానం, తంబళ అనుమానం, తంబళ తలతిక్క సామెతలు ఈ కథనుంచే పుట్టాయని చెప్తారు.

"నందిని పందీ, పందిని నందీ" చేయగలవాడు తలలు మార్చగలవాడని అర్థం. "నంది అంటే నందే! పంది అంటే పందే! అనేవాడి మాట అక్షరాలా చెలామణీ అవుతోంది!

"బోడెద్దుకు పోట్లు మప్పినట్లు", "ఎద్దులు బెదిరినా గానుగ బెదరదు," "అత్తవారింట అల్లుణ్ణి చూడాలి – ఆముదాల చేల ఆ బోతును చూడాలి."

"దుక్కిటెద్దు దేశాంతరం వెళ్ళినట్లు."

"చదువులేని ఎద్దు – కదలలేని మొద్దు"

"ఎద్దు నమ్మినవాడు ఎల్లుండే వస్తాడు"

"వెల్లటూరిలో ఎద్దునీ, పరుచూరులో పడుచునూ ఇవ్వకూడదు-" అనేవి తెలుగులో ప్రసిద్ధమైన సామెతలు.

బరువులులాగే ఎద్దుని ముష్కహీనం అంటే బీజాలు లేకుండా చేస్తారు (CASTRATION). పిచ్చలు (వట్టలు) కొట్టడం అని మన రైతాంగం అంటుంటారు. వీటికన్న "ఎద్దుపట్టడం" అనే మాట కొంచెం సభ్యతగా అన్పిస్తుంది. "వానింబట్టి కట్టింపు - మొండెనెద్దుపట్టింపుము" అని హరివంశంలో ఎర్రన ఈ మాటని ప్రయోగించాడు - వాణ్ణి ఎద్దుపట్టించమని ఆజ్ఞ !

ఎద్దు బలుపు అంటే, ఒక ఎద్దు మొయ్యగల బరువు. మోపెడు, గంపెడు, బస్తాడు అన్నట్లు, ఎద్దు బలుపు - ఒక నిర్ణీత కొలత ! "ఎద్దు బలుపుడు సరుకు ఇప్పుడే రేవులో దిగింది -" అనేవారు కాబోలు పూర్వం !

'ఎద్దుమొద్దు' అంటే మూర్ఖుడు. మూఢుడూ, అరసికుడు ! ఎద్దుమొద్దు స్వరూపంతో శృంగారం ఏడ్చినట్టే వుంటుంది.

"ముద్దీయన రాదు-గ్రుద్దునయ్యెద్దు మొద్దు -" అంటుందో కవిప్రయోగం.

నంద్యాల, నందిగామ, మహానంది వంటి తెలుగు గ్రామాలు బస వేశ్వరుడి పట్ల మన గౌరవానికి చిహ్నాలు. కన్నడ ప్రజలకు బసవడు అరాధ్యదైవం. లింగాయతులు బసవపురాణాన్ని ప్రామాణికంగా భావిస్తారు.

"ఎద్దునెక్కిన వాడే లింగడు - బొల్లి గద్ద నెక్కినవాడే రంగడు" అనే సామెత శివకేశవులకు తేడాలేదని చెప్తుంది.

# 'దావా'

కొందరికి 'దావాలు' అంటే తగూలాటలు పెట్టుకోవడం ఓ సరదా! గిల్లికజ్జాలు పెట్టుకునే మనస్తత్వం వాళ్ళది.

ఎదుటివారిని తిట్టి, వారి చేత తిట్టించుకుని ఆనందించే మనస్తత్వాన్ని 'మాసోచిజం' అంటారు. దావాలు పెట్టుకొనే వాళ్ళు ఇలాంటి మాసోచిస్టులన్న మాట!

దావాలు పెట్టుకునే వారిలాగే 'దావరం' వున్న వాళ్ళూ వుంటారు. చిల్లర దొంగతనాలు చేయాలనే మనస్తత్వం క్లెప్టోమానియా. అదీ 'దావరం' అంటే ! దావరం వున్నవాణ్ణి "దావరీ" అంటారు. దావరీ ఇలాంటి మేనియాక్. హోటల్‌కెళ్ళి చెంచాలు జేబులో పెట్టుకొచ్చే రకం.

దావరాల వలన లోకానికి దావంతం (దుఃఖం) ప్రాప్తిస్తుంది కదా! "చావంత దావంతాలు ఆయన మీద ఒక్కసారి వచ్చిపడ్డాయి" అని సానుభూతి చూపిస్తుంటాం.

'దావం' అంటే పీడించేది. కార్చిచ్చు, అడవి, తాపం, రోగం, బాధ... వీటన్నింటినీ దావాలని కూడా అంటారు. దావాలొచ్చి పడ్తున్నాయి అంటే ఇలాంటి కష్టాలు దాపురిస్తున్నాయి... అని !

దావాలను తట్టుకొని నిలబడగలిగిన వాడిని "దావరీడు" అంటారు. దావాలను గెలిచినవాడని!

నిజానికి దావానలం అంత పెద్ద మాట ఈ 'దావా' !

బ్రిటీష్ కాలంలో జ్యుడిషియరీ - న్యాయవ్యవస్థ - ఏర్పడ్డ తర్వాత 'వ్యాజ్యం' అనే అర్థంలో ఈ దావా పదాన్ని ఉపయోగించడం మొదలుపెట్టారు. అప్పటిదాకా 'దావా' గిల్లికజ్జాలకు సంబంధించిన పదమే!

దావరికాలు లేకుండా మెలిగినప్పుడే మనశ్శాంతి వుంటుంది ! దేశంలో మతాల మధ్య దావరికాలు మరిచిపోగలిగితే, బృం'దావ'నం అవదూ... దేశం అంతా!

# అక్క

అక్క అంటే నిగమశర్మ అక్కలా వుండాలి. పాండురంగ మాహాత్మ్యం కావ్యంలో తెనాలి రామకృష్ణుడు సృష్టించిన పాత్ర ఈ నిగమశర్మ అక్క. ఆమెకు వేరే పేరు లేకపోయినా ప్రసిద్ధి చెందిన పాత్ర.

తన కన్నా ముందు పుట్టినది అక్క ! ఇంతే అయితే, ఇందులో వ్యంగ్యమూ లేదు - విపరీతార్థమూ లేదు. కానీ, అక్క అనేక కొత్త అర్థాల్ని ఆవిష్కరించింది. సరదాగా చదవండి !

కొంతమంది తమ దినచర్యను అక్క, ఆలీ భాషతో ప్రారంభిస్తారు. 'నీ అక్క' అనేది కొందరికి ఊతపదం, బూతు పదం కూడా !

మూలద్రావిడంలోనూ, సంస్కృతంలో కూడా కుంటెన గత్తె, అబద్ధా లాడేదీ, తార్పుడు వృత్తిలో వున్నదీ, మాయలమారి అనే అర్థాల్లో కన్పిస్తుంది... "అక్క" అనే మాట ! "నీ అక్క" అనేది బూతు అయ్యింది ఇలాగే !

'అక్కలవాడ' అంటే, ఇంగ్లీషులో రెడ్‌లైట్ ఏరియా లాంటిది. భోజన సౌకర్యంతో పాటు పడకసౌకర్యం కూడా వున్న పూటకూళ్ళ ఇళ్ళు ఈ అక్కలవాడలో వుండేవి.

అక్కలవాడలో ఓ వంట(అంద)గత్తెని కుదుర్చుకుని - "వార్చి వస్తానంటు న్నావు - ఎక్కడ వంటకెళ్తున్నావో చెప్పవే వనరుహాక్షీ -" అంటుంది శ్రీనాథుడి క్రీడాభిరామంలో ఓ పాత్ర.

అక్షవాటిక అంటే, జూదం ఆడేచోటు. అక్షవాద అంటే, మల్లయుద్ధం జరిగే ప్రదేశం. వీటిని బట్టే ఏర్పడిన అక్కలవాడల్లో భోజన, పడక సౌకర్యాలు, నైట్‌క్లబ్ కేబరేలతోపాటు "జిమ్" కూడా వుండేదని దీన్నిబట్టి అర్థం అవుతోంది.

అనేకమంది అధికారులు, సైనికులు, వ్యాపారులు, రాయబారులు, ఇదేశీ సంచారులు... వీళ్ళంతా రాచనగరుకొచ్చినప్పుడు ఈ అక్కవాడలు అన్ని అవసరాలూ తీర్చేవిగా ఉపయోగపడేవి. ఇది క్రీ.శ. 13, 14 శతాబ్దాలలో శ్రీనాథుడి రెడ్డిరాజుల కాలంనాటి కథ.

రాయలవారు కూడా ఆముక్తమాల్యదలో 'తద్దినం భోజనం' పీకల దాకా తిని, అది సరిపోక అక్కవాడకు వెళ్ళి, అక్కడ అరకూడు మెక్కిన వాడి గురించి వర్ణిస్తాడు. అరకూడు – అంటే, అరకొరగా వడ్డించిన సగం అన్నం.

పూటకూళ్ళది పుణ్యమునకు జాలదు – అనే రాయలవారి వాక్యం 15వ శతాబ్దినాటి అక్కవాడల్లోని అకృత్యాలకు సాక్షి... వండలేనక్కకు వలపులు బలుమెండు – సామెతలాగా !

కన్నడంలో "అక్కఱ" అంటే అనురాగం. కానీ తెలుగులో ఇది 'అవసరం'గా మారింది.

బహుశా అక్కవాడల్లో "అక్క" – "అక్కఱ' పదాన్ని అలా మార్చేసి వుండాలి.

అక్కఱ గొను అంటే, ఆశించడం.

అక్కఱ తీర్చుకోవడం అంటే బలవంతంగా కోర్కె తీర్చుకోవడం.

'అక్కఱగత్తె' – తీవ్రమైన వాంఛ గల స్త్రీ !

అక్కఱ గండడు – అవసరం తీరాక దులుపుకు పోయేవాడు.

హరివంశంలో గౌరనకవి చెప్పిన అక్కరగండడు పెద్ద వడ్డీవ్యాపారి. నిర్దయుడు. కాబూలివాలా లాంటివాడు.

"అక్కఱకు రాని చుట్టము" అనే సుమతి శతకం పద్యంలో "అక్కఱ" అంటే ఇంట్లో జరిగే శుభకార్యం అని ! మనకు చుట్టమైవుండీ, శుభమో, అశుభమో ఏ కార్యానికీ రానివాడు – అంటే, మన మంచిచెడ్డలతో నిమిత్తం లేనివాడు – అని ! మనకు అవసరానికి ఏ రకమైన సహాయమూ అందించడానికి సిద్ధంగా లేనివాడని !! అలాంటి చుట్టం వున్నా వృథాయే కదా !!

"అక్కఱ తీరాక అల్లుడుగతి" అనే సామెత కొంచెం లోతెక్కువది ! ఆ శోభనం ఏదో జరిపించేస్తే అమ్మాయి మోజులో చచ్చినట్లు చెప్పుకింద తేలులా పడివుంటాడని !

ప్రేమలేఖని అచ్చతెలుగులో "అక్కరచీటీ" అనవచ్చు.

విడిపోయేటప్పుడు చెల్లుచీటీలు రాసుకున్నట్లే, సంబంధాలు కలుపుకునే టప్పుడు రాసుకునే నిశ్చయ పత్రాన్ని 'అక్కర చీటీ' అంటారు!

అకారకరభ అనే వనమూలిక వుంది. ఇది లైంగికోత్తేజాన్ని పెంపొందిం చేందుకు ఉపయోగపడ్తుంది. దీన్ని తెలుగులో 'అక్కలకర్ర' (లేక) 'అక్కలకర్ర' అనడంలో తెలుగువారి కొంటెతనం తేలికగానే అర్థం అవుతోంది !

"అక్కలు" గ్రామదేవతలు కూడా ! అక్కల జాతరలు చాలా ప్రాంతాల్లో ఇప్పటికీ జరుగుతూనే వున్నాయి. శ్రీ కాళహస్తిలో 'అక్క' ఆలయం వుంది. అక్కడ అక్కల కొలువులు జరుగుతాయి.

'అక్క' శబ్దాన్ని తల్లి అనే అర్థంలో మనం బాగా ఉపయోగిస్తాం. 'అక్క'కు 'అప్ప' పర్యాయపదం. కొన్ని ప్రాంతాలలో అప్ప అంటే తల్లి. కొన్ని ప్రాంతాల్లో తండ్రి!

రామప్ప, రామక్క రమణప్ప లాంటి పేర్లలో అప్ప, అక్క నామాంత్య పదాలుగా కన్పిస్తాయి. అక్కయ్య, అక్కంబ, అక్కాంబిక, అక్కమాంబ, అక్కప్ప వంటి పేర్లని రాజాధిరాజులు తమ పిల్లలకు పెట్టుకున్నట్లు చరిత్రలో కన్పిస్తుంది. ఈ పేర్లు ఆ రోజుల్లో ఫాషన్ అయివుండొచ్చు.

అక్కనప్రగడ, అక్కపెద్ది, అక్కబత్తుల ఇంటిపేర్లలో పెద్ది, ప్రగడ, బత్తుల అనేవి వారు చేసే వృత్తిని సూచిస్తే 'అక్క' అనేది వారికి గల గౌరవాన్ని సూచిస్తుంది. అక్కజమ్మపల్లి, అక్కచెరువు అనే వూళ్ళు కూడా వున్నాయి.

ప్రేమించిన వ్యక్తిని అక్కున చేర్చుకుంటాం. ద్వేషించేవారిని అక్కిలపరుస్తాం.

అంతాబాగానే వుంది. 'అక్క' పదానికి సముచిత స్థానాన్నిచ్చి గౌర వించడం మన సాంప్రదాయమే !

కానీ...

"నీయక్క !" "నీయమ్మ" తిట్లేమిటండీ...? అమ్మనీ, అక్కనీ బూతుని చేసి మాట్లాడడం జాతికి సిగ్గుచేటు కాదూ...??

ఈ రోజునించీ ఈ రెండు బూతుమాటల్నీ వాడడం మానేసి, అమ్మనీ, అక్కనీ, జాతినీ గౌరవించడం మొదలుపెడదాం...!!

తెలుగువారికి "అక్కజం" ఎక్కువ. అధికంగా వుండటాన్ని హెచ్చుగా వుండటాన్నీ 'అక్కజం' అంటారు. ఈ అక్కజం ఎక్కువ సేపు నిలబడ దెప్పుడూ! అందుకని "ఆరంభశూరులు" అనే పేరు తెచ్చుకున్నారు మనవాళ్ళు.

అక్కా ! ఔరా ! అని ఆశ్చర్యపడతాం. అక్కా ! ఇదేమిచోద్యము" అనేవాళ్ళు – అబ్బురపడటాన్ని !

"అక్కలూ !" అనేది దుఃఖాన్ని సూచిస్తుంది.

'అక్కు' అనేది హృదయానికి సంబంధించిన పదం. రెక్కలు తెగినపక్షి 'అక్కు' అంటే రొమ్ముతో పాకడానికి ప్రయత్నిస్తుంది. అందుకని దాన్ని 'అక్కుపక్షి' – దిక్కులేని పక్షి అనే అర్థంలో పిలుస్తాం.

తల్లి, బిడ్డని అక్కున చేర్చుకుని హత్తుకుంటుంది. ఆత్మీయతానూరాగాలకు ఈ పదం పెట్టింది పేరు.

'అక్కుగొట్టు' అంటే హృదయశల్యం. లంబాడోళ్ళరాందాసు పాటలో - "గుండెలలో గునపాలూ గుచ్చారే నీవారూ..." అంటాడు. అక్కుగొట్టు అనేది ఈ గుండెలలో దిగిన గునపం లాంటిది! అది తగిలినప్పుడు మనసు "అక్కిల" పడ్తుంది!

హృదయం తల్లడిల్లిపోయింది, కలతజెందింది అనడానికీ, ఎక్కువ గాయపడ్డ మనసుని సూచించడానికీ 'అక్కిల' పదాన్ని వాడతారు. "అక్కిల పడ్డ తల్లి ఆర్రోజులుగా అన్నం ముట్టలేదు. అనేది మంచి ప్రయోగం.

ఇదంతా మన భాషా సంపద! మన తెలుగుపదాల్ని మనం నిఘంటు వుల్లోకి విసిరేసి, మన భావానికి తగిన వ్యక్తీకరణ (EXPRESSION) కోసం తగిన పదంకోసం మనం ఇంగ్లీషు తదితర భాషాపదాల మీద ఆధారపడ వలసి వస్తోంది.

నిజానికి తెలుగులో - అచ్చతెలుగులో - సంస్కృతం అవసరం కూడా పెద్దగా లేకుండానే మనం వాడుకోదగినన్ని మాటలు వున్నాయి.

భాషని అక్కిల చేసుకొంటోంది మనమే ! అక్కిల పరచుకోంటోందీ మనమే ! అంటే, కుంచింపచేసుకోంటున్నాం. అవమాన పరచుకొంటున్నాం కూడా ! మనం మాట్లాడుకోడానికి తెలుగే లేదంటారా...??

# చప్ప

**కొం**దరి మాటలు చప్పగా వుంటాయి. కొందరి ఇళ్ళల్లో వంటలు చప్పగా వుంటాయి. కొందరి నటన మరీ చప్పగా వుండొచ్చుకూడా! రసహీనంగా వుందనడాన్ని 'చప్ప' అంటారు. నిస్సారం, బొత్తిగా రుచిలేనిదని !

కన్నడంలో చప్పగె, సప్పగె, తుళుభాషలో చప్పని, చప్పటు; తమిళంలో చప్పై పదాలు ఈ "చప్ప"కు సమానార్థకాలు.

చప్పిడి అనేది ఇంకా అందమైన మాట. "చప్పిడి మనుషులా ఈ దేశాన్ని పాలించగలిగేది...?" అని కొందరు నేతల్ని చూస్తే అన్పించడం సహజం. చప్పిడిచేస్తే జబ్బు కుదురుతుంది" అంటారు. ఉప్పుకారం, పులుసు ఈ మూడూ సమస్త అనారోగ్యాలకూ కారణాలు. అవి తినకుండా వుండటాన్ని చప్పిడి పథ్యం అంటారు.

సరిగాకాలని మొక్కజొన్న కండెని చప్పగా కాల్చావని విసుక్కొంటాం. చప్పకాల్పులు జరిపితే యుద్ధరంగంలో కూడా చెల్లదు కదా !

చాలీచాలని జీతాలతో బతకడాన్ని చప్పబతుకు అనవచ్చు. కష్టాల్లో కనికరించని దేవుడు చప్ప వేలుపే మరి !

లొట్టవేసుకొంటూ, ఆహా ఓహో అని మెచ్చుకొంటూ, నాకుతూనో, నములుతూనో తినడాన్ని కూడా చప్పరించడమే అంటారు. చప్పలించడం అని కూడా అనవచ్చు.

బార్లా తెరిచిన బారుల్లో నెలజీతం మొత్తాన్నీ మొదటిరోజే చప్పరించే వాళ్ళు చాలా'మందు'న్నారు!

"సెలవులన్నీ చప్పరించేశావు కదా !" అంటే వృథా చేశావు అని! తాత ముత్తాతల కోట్లాది ఆస్తి చప్పరించేసే ప్రబుద్ధులుంటారు.

"మాటలతో జడ్జిగారిని చప్పరించేద్దాం అంటే కుదరదు - సాక్ష్యాలు తెండి -" అంటాడు లాయరు. అంటే, ఒప్పించడం అని !

పెద్దగా చప్పుడు చేస్తూ, చప్పరిస్తూ తింటుందని కాబోలు "చప్పరింత" అంటే, 'పంది' అనే అర్థం కూడా వుంది. చప్పరించే మృగం - పంది! నలుగురిలో వున్నప్పుడు శబ్దం చేస్తూ అన్నం తినడం టేబుల్ మేనర్స్ కాదని ఇందుకే అంటారు.

చపచపగా కాలం గడుపుతున్నాడు - అంటే, పనీపాడూ లేకుండా వృథాగా తిరుగుతున్నాడని! 'చపచపనం' అంటే వృథాబతుకు -

"సుమహిత సంసార సుఖమూలమైన ఈ శరీరాన్ని చపచపగా వదిలేసి యవ్వనాన్ని తృణప్రాయం చేసి" వంటి కవిప్రయోగాలున్నాయి.

"వాడి తెలివితేటల ముందు నీ ఎత్తుగడలు చపచపనం అయి పోయాయి-" అని కూడా అనవచ్చు.

"ఇంక, వాణ్ణి చపచప చేయాల్సిందే !" అంటే సఫా చేసేయాలని! రంగనాథ రామాయణంలో గోనబుద్ధారెడ్డి వాడిన మాట ఇది!

'చప్పట' అంటే అరచెయ్యి. చపటం, చపేటం, చర్పటం అనే పేర్లు కూడా అరచేతికున్నాయి. 'కరతలం' అంటాం దీన్ని. అరచేతులు రెండూ కలిసి చేసే ధ్వనిని "చప్పటలు" "చప్పట్లు" అంటున్నాం. చప్పటలిడు, చప్పటలు కొట్టు, చప్పటలు చరచు, చప్పటలు వెట్టు, చప్పటలు వేయు.... ఇలా కూడా అంటుంటాం.

శ్రీనాథుడు, చప్పటించు అనే ఒక చక్కటి ప్రయోగం చేశాడు.

".... డా కాలిమడమతో చప్పటించి..." అంటూ ! ఇక్కడ చప్పటించడం అంటే చాచి తిన్నడమే !

"ఆయన ప్రసంగిస్తున్నంత సేపూ కోలాహలంగా జనం చప్పటిస్తూనే వున్నారు-" చప్పట్లు కొడ్తున్నారనే గాని, కొడ్తున్నారని అర్థం కాదు. తప్పట్లు తప్పటించు అని కూడా అంటుంటాం మనం.

చదునుగా వుండే ప్రదేశాన్ని కూడా చప్పట అనే అంటారు. 'సపాట్' అనే

హిందీ మాట ఇది. 'చప్టా' అనే అర్థంలో సమతలంగా తయారుచేసిన స్థలాన్ని 'చప్పట' అంటారు.

గుండ్రటి ముఖంమీద అందంగా, సన్నగా ముందుకు పొడుచుకొస్తుంది ముక్కు. కానీ, చప్పటి ముక్కు – చట్టిముక్కు – అణిగి వుంటుంది.

చప్పన్న దేశాలూ తిరిగొచ్చాడు అంటాం. హిందీలో చప్పన్ అంటే యాభైఆరు. మనం 'నూట పదార్లు' అన్నంతగా ఈ మాటని హిందీలో వాడ్తుం టారు. 'చప్పన్న' ఇలా పుట్టింది. అంగ, వంగ, కళింగ, కరాట, కేరళ, కామరూప, గౌడ, వనవాస, కుంతల, కొంకణ... ఇలా 56 దేశాలు ఆనాటి భారతఖండం వివిధ రాజుల్తో పాలించబడ్తుండేవి.

చప్పరం అంటే చలవపందిరి. పెద్ద పెద్ద చప్పరాలు వేసి ముత్యాల తోరణాలు అలంకరించి అంగరంగ వైభవంగా శ్రీరామనవమి జరుపుతుంటారు ప్రతి ఊళ్ళోనూ !

షామియానాలు, దేరాలు, టెంట్లు వీటి గురించి తెలుగులో చెప్పడానికి 'చప్పరం' పదం బాగా వుపయోగపడ్తుంది. గుడారం, పట్టగృహం, శిబిరం, చప్పరం ఇవన్నీ సమానార్థకాలు. చలువ చప్పరాలంటే చలువ పందిళ్ళు, చాందినీకట్టిన పందిళ్ళు.

నాలుగు పలకలుగా – పొడవూ వెడల్పూ సమానంగా వుంటుంది కాబట్టి పందిరిమంచాన్ని "చప్పర మంచం" అంటారు. ఛత్వర అనే సంస్కృత పదం, నాలుగు పలకలుగా వుండే వస్తువుని సూచిస్తుంది. చలువ చప్పరాన్ని కట్టిన పందిరమంచం కాబట్టి చప్పరమంచం అంటారు.

చప్పల్స్ అనే ఇంగ్లీషు మాటకూ చెప్పులు అనే తెలుగు మాటకూ కొంత సంబంధం లేకపోలేదు. 'చెప్పు' గురించి చెప్పుకునేప్పుడు ఈ విషయం చెప్పుకుందాం!

# అదను

"ఇదే అదను లెనిన్‌కథను రచించెదను"... అంటాడు శ్రీశ్రీ.

తగిన సమయం వచ్చింది అనడానికి అదనయ్యింది అంటాం.

"హదను వచ్చుదాఁక నపరాధిపై రోషమాగి చెఱుపవలయు" అని రాజనీతి తెలిసిన కృష్ణదేవరాయలు –' అదను వచ్చేదాకా కోపాన్ని ఆపుకుని శత్రువుపై దెబ్బ తీయాలంటాడు.

కన్నడంలో పద, మరాఠీ తమిళాలలొ పతమ్ – 'తగిన సమయం' అనే అర్థంలో అదనులాంటివే ! తెలుగులో 'పదును' కూడా ఇలానే ఏర్పడింది.

పిల్ల పదును మీదుంది – అంటే, యుక్తవయసొచ్చిందని.

ఇనుమును కాల్చి, సాగకొట్టి నీళ్ళలో ముంచుతారు. అందువలన అది పదునెక్కుతుంది. "నీరు పదును" అంటారు దీన్ని. పదునెక్కిన తర్వాత దెబ్బకొట్టి వంచుతారు. పదును మీదే వంచాలనే సామెత తెల్సిందే! పదును కూడా అదను లాంటిదే!!

"చదువు వలన ప్రజ్ఞ, ప్రజ్ఞ వలన రసజ్ఞత, వీటి వలన అదనుగా సంపదలు లభిస్తాయి-" అనే కవి ప్రయోగంలో, అదను అంటే ఒప్పుగా... అని!

"ఒకనాటి అదును ఏడాది బతుకు" అంటుంది తెలుగుసామెత! వ్యవసాయంరంగానికి సంబంధించిన సామెత ఇది.

"అదను గానిపదును"

"అదును తప్పిన పైరున్ను ముసలివాని బిడ్డలున్ను ఒక్కటె"

"అదునున పొదలో చల్లినా పండుతోంది"

"అదును పదును చెఱుచునది వేపనాగేలు"

"అదునెఱిగి వైద్యం, పదునెఱిగి పైరు" ఇలాంటి వ్యవసాయ సామెతలు తెలుగులో చాలా కన్పిస్తాయి - మనల్ని ఆలోచింపచేసేవి!

అదనైనవాడు అంటే పనికొచ్చేవాడని.

"ఉన్నవారిలో అదనైనవాడికి ఓటెయ్యండి -" అని కోరడంలో తప్పులేదు కదా !

"అదను మరిస్తే ఆదమరిచినట్టే!"

ఏదీ తన సొంతంకాని స్థితిని అదువ అంటారు.

"ఆ యింట్లో అదువకుంటున్నాడు" అంటే, అద్దెకుంటున్నాడని అదువలోంచే 'అద్దె' వచ్చి వుండొచ్చుకూడా !

'అదవరైతు' అంటే, కౌలుచేస్తున్నవాడు అని !

'అదవ పడకలు' మడత మంచాలు అద్దెకిచ్చే లాడ్జింగ్‌లలో దొరుకుతాయి.

'అదవ కాలు' అంటే కృత్రిమ కాలు. వికలాంగులను నడిపించేది ఇదే కదా !

# లంచం

**లం**చం లేకపోతే లంచ్ ముట్టని వాళ్ళు చాలామంది వుంటారు. అచ్చతెలుగులో 'వాతికాసు' అంటే లంచం. లంచగొండిని 'వాతికాసగొండి' అనవచ్చు. వాతికాసుపోతు అని కూడా అనవచ్చు. ఇంకా కడుపు మండితే "వాతికాసురుడు" అని కూడా అనవచ్చు.

అంతమాట అన్నంత మాత్రాన లంచగొండి ఏమీ చలించడు. అతనికి ముట్టవలసింది ముట్టిందా - లేదా - అనేదే ప్రధానం.

సంస్కృతంలో 'లంచ' అంటే బహుమతి, కానుక. తనపని చక్కపెట్టు

కొనేందుకు ఇచ్చే బహుమతిని ప్రాకృతంలో కూడా లంచా అనే పిలిచేవాళ్ళు. కన్నడంలో లంచ, లంచె తమిళంలో ఇలంచమ్, తుళులో లంచ పేర్లతో ఇది సర్వత్రా వ్యాపితం. తన కోర్కెలు తీర్చమని దేవుడికి నైవేద్యాలు, తీరాయని మొక్కుబడులూ చెల్లించుకుంటాం. అధికారులకు కూడా ఇలానైవేద్యాలూ, మొక్కుబడులూ చెల్లించుకోవడాన్ని లంచం అంటారు.

"దొరగారికి ఆప్తుడుగా తిరిగే ఓ కవి గారికి "లంచపంచాలు" సమర్పించుకొని ఆయన ద్వారా కార్యం పూర్తి చేసుకోవాలనుకోవడం గురించి సవరం చిన నారాయణకవి - కువలయాశ్వ చరిత్రలో వర్ణిస్తాడు' దొరకు ఆప్తుడు (లేదా ఏజెంట్) కావడం ఆ కవిగారికి లంచం పుచ్చుకునే అర్హత తెచ్చిపెట్టింది.

స్మశానానికి తీసుకెళ్ళేప్పుడు శవం నోట్లో పెట్టే 'కాసు'ని 'వాతిపాతిక' అంటారు. సాధారణంగా కాటికాపరి దాన్ని ఆశిస్తాడు. దానికోసం కూడా కక్కుర్తి పడే నీచుణ్ణి 'వాతికాసు' అని అంటారు.

వాతికాసురుడు నాటి బుద్ధుడి కాలంలోనూ వున్నాడు - నేటి ప్రబుద్ధుల కాలంలోనూ వున్నాడు.

పిల్లలు చూడండీ... ఏ చాక్లెట్టో, బిస్కట్టో లంచం ఇస్తానంటే చెప్పిన పనంతా చేసి పెడతారు. మన పిల్లలకు మనం ఇచ్చేది లంచం అవుతుందా...? అలాగే, మన ప్రభుత్వంలో ఉద్యోగులంటే ఎవరూ.... మనవాళ్ళే కదా...! మనవాళ్ళకి మనం ఇచ్చేది లంచం ఎలా అవుతుందో చెప్పండీ...?" అంటాడు లంచం ఇవ్వమరిగినవాడూ, తద్వారా ప్రజల సొమ్ముని తెగ తినమరిగిన వాడూనూ !!

# అంటు - అంట - అంటి

'అంటు' అంటే స్నేహం

'అంటు' అంటే అతకడం, కదంబించడం

అంటు అనే మాటకు చుట్టం, పక్కం, నెచ్చెలి, చెలికాడు, నెయ్యుడు, సంగడీడు, పొందుకాడు, నేస్తకాడు, చెలి, సంగడికాడు - ఇలాంటి పర్యాయాలు ఇంకా చాలా వున్నాయి.

స్నేహం, స్నేహితుడు అనే అర్థంలో 'అంటు' పదాన్ని వాడే అలవాటుండేది ఒకప్పుడు !

'అంటు' అంటే పేనుకూడా ! అంటిల్లు పేలకు ఇల్లు ! అంటే, చక్కని జుత్తుగల తలని అంటిల్లు అంటారు. అంటింట్లో చీరబోతులు (పేలు) స్వేచ్ఛగా సుఖావాసంచేస్తాయి "అంట్లు పొడుచు" అంటే పేను అనే !

అంటుకి సొంటు చేరిస్తే అందమైన జంటపదం అవుతుంది.

"ఆయనకి అంటూ సొంటూ లేదు" అంటే బహువిలాస పురుషుడు, బోళ్ళెడు ఆస్తి వుండి, ఎలా ఖర్చు చేయాలో తెలియని వాడని !

"కుండలో అంటూ సొంటూ అంతా వాడికే ఊడ్చి పెట్టాను –" అంటుంది ఆక్రోశంగా, నష్టపోయిన ఓ ఇల్లాలు.

"అంటు పట్టిందంటే ఇంక ఆగదు" – ఆవేశం వస్తే ఎంతైనా తెగిస్తాడనడానికి చేసే మంచి ప్రయోగం ఇది.

అంటిముట్టరాని అగ్రహారంలా వుంటే నలుగురిలో బతకలేం ఆధిక్యతాభావం అన్నివేళలా చెల్లదు.

'అంటిముట్టేవారు' సాటి కులస్థులు 'అంటి ముట్టనివారు' ఇతరులు, పెద్దకులస్థులు.

'అంటువాయకుండా తిరిగాడు –' అంటే వెన్నంటే వున్నాడని !

అంటుపడలేదని బాస చేస్తానంటాడు కృష్ణుడు రాధికా స్వాంతనం కావ్యంలో. "అంటుపడలేదటంచు మిమ్మంటి యిపుడు, బాసలెల్లను చేసెద భాసురాంగి –" అని ! ఇంతవరకూ మరో ఆడదాని మొహమైనా చూడలేదట.

'అంటితే మసి అవుతుంది' అన్నట్లు కొందరు అంటీ ముట్టనట్లు ప్రవర్తిస్తుంటారు – తనకు సంబంధం లేనట్లుండడం.

ఆడుకునే వయసుని, బాల్యాన్ని 'అంటికుంచి ఆడుప్రాయం' అనే ప్రయోగం వుంది–

"అంటికుంచియాడు నట్టి ప్రాయమొకింత నడుచునంతలోన..." అని !

"పొలాలు అంటలేదు" – అంటే విత్తులు మొలవలేదని ! వానలు సరిగా కురవలేదని.

వరకు, దాకా అనే అర్థంలో కూడా 'అంట' పదాన్ని బాగా వాడ్తుంటాం – "చిట్టచివరంటా కాసింది ఈ ఏడాది" అన్నప్పుడు పంట పుష్కలంగా చేతికొచ్చిందని అర్థం.

"కడంటా చదివి పుస్తకం ఇచ్చేశాను"

"ప్రాణాలు కడంటాయి"

"అంట కోసి ఇచ్చాడు"

"మొదలంటా నరికేశారు" ఇలా మనం 'అంట'ని బాగానే ప్రయోగిస్తుంటాం.

తేలు అంట కుట్టింది, చేను అంటకోశారు ప్రయోగాలు కూడా వున్నాయి.

కడకంటా మిగిలివుండేది మన మంచి మాత్రమే !

అంటు అంటే అంటుకోంటం !

'తన తండ్రిని అంటిన తర్వాత తన్నంటడం తగునా' అని సంశయిస్తాడు సారంగధరుడు

'అవివేకి యగురాజు నంటిన ప్రజలందు నెట్టివారును మతిహీను లగుదురు

-' అని నారాయణ కవి రాసిన పంచతంత్రంలో సూక్తి - నమ్ముకొని వుండటం అనే అర్థంలో 'అవివేకి అయిన రాజు నంటిన ప్రజలు కూడా మతిహీనులే' నని ! ఈనాటికి ఇది వర్తించే అంశమే.

'అంటుగత్తెలు' అని తార్పుడు గత్తెల్ని అంటారు. స్నేహం కలపడంలో సహకరిస్తారు కాబట్టి వీళ్ళని 'కూరిమిగత్తెలు' అనికూడా అంటారు.

'అంటుగాడు' కూడా ఇలాంటివాడే ! ప్రియుడనే అర్థం నిఘంటువుల్లో కన్పిస్తుంది గానీ వేశ్యలకు 'ప్రియుడు' అనేదేముంటుంది ?

అంటుకొంది - అంటే తగులుకొందనే !

అంటుకొని పోయాడంటే, దొంగిలించి పట్టుకుపోతున్నాడని.

అంటుజోళ్ళు, అంటుపోగులూ చెవిపోగుల పేర్లు.

ముత్యపు చిప్పలలోపల అంటుకొని వుండే ముత్యాన్ని 'అంటుపూస' అంటారు. 'అంటు' అంటే ప్రాప్తించడం. రోగం అంటు కొందంటే ప్రాప్తించిందనే!

చేతులకు మట్టి అంటకుండా పనిచేయడం ఓ చాకచక్యం. పడకకుర్చీ మేథావులు, వైట్ కాలర్ అధికారులు ఇలాంటివాళ్ళలో ప్రముఖులు.

"అక్షరం ముక్క అంటితే ఒట్టు" అంటుంటాం

పూర్వజన్మ పుణ్యాపాపఫలాలు జీవుల వెంబడి అంటివుంటాయని వేదాంతం. గుండెలోతుల్లోకి అంటుకొంది అంటే గుచ్చుకుందనే !

స్త్రీ కుసుమాన్ని, స్త్రీ ధర్మాన్ని, ఋతుస్రావాన్నీ 'అంటు' అని కూడా అంటారు. 'అంట్లుడుగు' అంటే ముట్లుడగడం ! అంటు పడింది - అంటే మడిమీద లేదని చెప్పడం, లేదా నెలలో ఆ మూడు రోజులు మైలవచ్చిందని చెప్పడం. అక్రమ సంబంధం పెట్టుకుందని కూడా !

'అంటడం' అంటే తలకు బాగా నూనెపట్టించి, మర్దనచేసి కుంకుడు రసంతో స్నానం చేయించడం. వ్యంగ్యార్థంలో బాగా దొబ్బులెట్టి పంపించాడన డానిక్కూడా 'అంటడం' అంటుంటారు.

'అంటునూనె' మాడుకు పట్టించేందుకు తెచ్చిన నూనె.

పోతూ పోతూ 'అంటించి' పోయాడంటే తగువుపెట్టి వెళ్ళాడని !

'మాటకి మాట అంటించడం' అనే మాటని 'ఢీ అంటే ఢీ' అనడం కోసం ప్రయోగిస్తారు.

వాళ్ళిద్దరికీ అంటినట్లుంది - అంటే స్నేహం కుదిరిందని. తగువు మరిచి కలిసి పోయారని !

'లోకాపవాదులు నన్నంటవు' అంటారు నిజాయితీని నమ్ముకున్న వ్యక్తులు

అంటగట్టడాన్ని కూడా అనేకరకాలుగా మనం ప్రయోగిస్తుంటాం -

వెర్రివాడికి ఆ బంగారు బొమ్మని అంట గట్టారట ! అంటూంటాం.

అంటగట్టు అంటే అణగదొక్కడం, లొంగదీయడం అనే అర్థాల్లో కూడా ప్రయోగా లున్నాయి.

అంటు మెడ అంటే, పొట్టిమెడ. తలకాయి భుజాలకు అంటుకుందా అన్నట్లుం టుంది కాబట్టి అంటుమెడ అంటుంటారు.

అంటు అంటే పుట్టడం, అవతరించడం కూడా 'మత విద్వేషాలు మా వూళ్ళోనూ అంటుకున్నాయి –' అంటారు.

అడుసు లోపల తాడిపండు అదిమినట్లు పాతాళం అంటేలా తొక్కేశాడట వామనుడు బలిచక్రవర్తిని ! 'కాలంటన్ త్రొక్కాడు' – అంటే, బలంగా తొక్కిపట్టాడని!

మైలవెధవ, అంట్ల వెధవ అని తిట్టడానికి 'అంట్లబోకి' అని కూడా అంటుంటారు. అంటగిన్నెలా దూరంగా వుంచదగిన వాడని !

అంట్లు తోమేవాడు అంటే ఆడంగివెధవ. పై అధికారుల ఇళ్ళలో పనులు చేసి ప్రాపకం సంపాయించు కోవాలని చూసేవాణ్ణి, మానాభిమానాలు లేనివాణ్ణి అంట్లుతోమేవాడనే అంటారు.

అంట్లు నాకేవాడు – ఎంగిలి మెతుకులకు కక్కుర్తిపడేవాడు.

అంట్లొత్తడం అంటే, మొక్కలకు అంట్లు తొక్కడం అని !

ఎదుగూ బొదుగూ లేకుండా "అంటింతకాయ" లాగా వుంటాడని వ్యాఖ్యాని స్తుంటారు కొందర్ని !

సరిగా తలదువ్వుకోకపోతే జడ అంటలు కడ్తుంది.

కొంపలు అంటుకున్నాయి అంటే రహస్యం బైటపడిందని !

అంటురాయి అని సూదంటురాయిని. అయస్కాంతాన్ని అంటుంటారు.

భక్తి, భయం గౌరవం ఇవన్నీ ఆత్మలో అంటుకోగా శివుణ్ణి అర్చించాడని శ్రీనాథుడి అద్భుత ప్రయోగం.

గుంపులుకూడారు, కపగూడారు, గుమిగూడారు, గుమిగట్టారు అని చెప్పడానికి 'అంటలు గట్టడం' అనే మాటపుట్టింది.

బిగించడం, చేర్చికట్టడం అనే అర్థంలో కూడా అంట గట్టడాన్ని వాడ్తుంటారు. 'బాగా అంటగట్టు' అంటే, గట్టిగా బిగించి కట్టమని !

చతికిలబడు, ఈడిగల్లు, ఈడిలబడు, కుదికిలబడు, కుదికిలుపడు – ఈ అర్థాల్లో ఉపయోగించేందుకు 'అంటసిలబడు' అనే మాటని ముచ్చటగా వాడుతుంటారు. అంటసిలబడ్డాడంటే వాడిపని అయిపోయిందని అర్థం !

'అంటసిల్లడం' అంటే చేరడం, తాకడం అనే ప్రయోగాలు కూడా వున్నాయి.

'అంట' అనే మాటని 'అనడం' అనే అర్థంలో కూడా వాడ్తుంటాం. వస్తాడంట, పోతాడంట, ఏమంట ? – అని ! 'అట' అనికూడా అంటుంటాం.

'అంటగది' అంటే రంకులాడి.

అంటని వేలుపు - అగ్ని ! ధుగమోములయ్య, వేల్పుల మొగము, అంటనివేలుపు, మబ్బుపూవు ఇవన్నీ అగ్నిదేవుడికి తెలుగుపేర్లు.

వేదనామాలకి, సంస్కృత నామాలకి తెలుగుపేర్లు తయారుచేయాలంటే, ఇలాంటి ప్రయోగాలే చెయ్యాలి ! ఇవి కవులు చేసినవికాదు - ప్రజలు చేసినవి!

ఇంగ్లీషు నుంచో, లాటిన్ నుంచో ఒక పదాన్ని తెలుగులోకి అనువాదం చెయ్యాలంటే మనం సంస్కృతాన్ని ఆశ్రయిస్తాం. సంస్కృతంలోకి అనువదించి అదంతా 'తెలుగు' అని సంబరపడిపోతాం !

ఒక సైన్సు పదాన్ని 'వలిత కిసలయ విన్యాసం' అని అనువదించి ఇది తెలుగు మీడియంలో విద్యాబోధన అని మనల్ని నమ్మమంటారు. ఇది తెలుగు విద్యార్థుల దురదృష్టం.

# బెల్లంకొట్టిన రాయి

గాడిదకి తన వీపున వున్నవి గంధం చెక్కలని, అవి చాలా విలువైనవని ఏంతెలుస్తుంది ?

విద్యా వివేక సంపత్తులు లేని వ్యక్తులకు కవి పండితుల విలువ కూడా అలానే తెలియదు.

బెల్లంగడ్డను రాయిపెట్టి పగల కొట్టారనుకొందాం కుంకుడుకాయని పగలకొట్టినా, బెల్లాన్ని పగలకొట్టినా ఆ రాయికి తేడా తెలుస్తుందా ?

స్పందన లేని మనిషిని బెల్లంకొట్టిన రాయిలా వున్నాడనడంలో తప్పులేదందుకే !

"ఉలవలు దంచిన రోకలి వలెనే
యూరక నిల్చున్న
తలచిన కార్యం బేమాయెను
యిక తప్పక పలుకన్న" అనే జానపద గీతంలో చెప్పిన ఉలవలు దంచిన రోకలి బెల్లంకొట్టిన రాయి, గంధం చెక్కలు మోసే గాడిద ఒకే జాతికి చెందినవి !

ఎంత మేలు చేసినా సంతృప్తి చెందని వ్యక్తులు, ప్రతి స్పందించడం ఎరగని వాళ్ళు, ప్రతిభని గుర్తించడం తెలియని అధికారులు వీళ్ళంతా ఇలాంటి గాడిదలే ! లేదా బెల్లం కొట్టిన రాళ్ళే !

# ఒత్తు

ఒత్తగిల్లిందంటే పక్కకొరిగిందని.

ఒత్తిగిలి పడుకొందంటే ముడుచుకుపడుకుందని

రతీదేవి పాలిండ్లను ఒత్తిగిలిన విలుకాని గురించి నైషథంలో శ్రీనాథుడు వర్ణిస్తాడు.

ప్రియుడి రూపం అచ్చొత్తిన రీతిలో మనసులో తిరుగుతుంటే, చిత్తము లొత్తగిల్లుతాయని (చలిస్తాయని) పద్మపురాణంలో చక్కటివర్ణన.

కడుపు వీపుదాకా ఒత్తిగిల్లిందని బక్కచిక్కిన వాణ్ణి కాశీఖండంలో శ్రీనాథుడు వర్ణిస్తాడు.

చేతులు వత్తడం అంటే బతిమాలు కొన్నాడని "ఆరోజు నువ్వేకదరా వచ్చి చేతులొత్తితే సరేనన్నాను" అంటుంటాం.

"మగపెళ్ళివారి ఒత్తుడు ఎక్కువయ్యింది. కట్నం వెంటనే ఇవ్వందే మర్యాద దక్కేలా లేదు" అంటారు.

మరీ అంత ఒత్తి అడిగితే కాదనలేకపోయాను అనీ "పాదాలమీద పడి ఒత్తిచెప్పుకొంది –" అనీ అంటుంటాం.

"అందరినీ కలిపి ఒత్తాడేశాడు అంటే నిందించాడు అని !"

"ఒత్తి పలకితే అబద్ధం నిజమైపోతుందా !" అని నిలదీస్తాం.

"అద్దంలో ముఖంపెట్టి ఎంత ఒత్తిలి (మాటి మాటికి) చూసుకున్నా లేని అందం కన్పిస్తుందా ?"

"అంతమాట అనేసరికి గొంతులో మాట ఒత్తిలి పడింది" అంటే అడ్డం పడింది అని.

బంధించు, బాధించు, పీడించు అనే అర్థాల్లో కూడా ఒత్తు పదాన్ని వాడుతుంటారు.

"ఆయన పై నుంచి ఒత్తాడు కాబట్టి ఆగాడు కాని వీణ్ణి పట్టుకోవటం మనతరం అయ్యేదా ?"

"ఒత్తితి శత్రుభూపతుల నుగ్రరణంబున" అని మొల్లరామాయణంలో ప్రయోగం వుంది.

"ఎవడికి వీలైంది వాడు ఒత్తేశాడు" అంటే నొక్కేశాడని అర్థం.

"నీ పని కాలేదని దేవుణ్ణి ఒత్తితే ఉపయోగం ఏముంది ?" అనడిగితే దైవనింద చేయవద్దని !

"ఎక్కడివక్కడ ఒత్తుకెళ్ళకపోతే (తోసేయ్యకపోతే) ఈ పనులన్నీ ఎప్పటికి అవుతాయి ?"

"కుచకుంభమర్దనాలు చేసిన చేతులు తమ తప్పు తెల్సుకుని పశ్చాత్తాపపడి పాదాలొత్తి కరుణవేడుకున్నాయట -" నైషధంలో శ్రీనాధుడి ప్రయోగం.

"వంక ఒత్తుకొనడం" అంటే జుట్టు, బట్టలు సరిచేసుకొని అందంగా తయారవటం, అలంకరించుకోవటం.

''ఔ గాదని వంకలొత్తుతూ కూర్చోవటం'' అని జక్కనగారు విక్రమోర్వశీయంలో చక్కటి ప్రయోగం చేశారు. ఔనూ - కాదూ అంటూ వంకలొత్తుతూ కూర్చుంటే పుణ్యకాలం గడిచిపోతుందాయే !

శంఖాన్ని ఊదడాన్ని ఒత్తి అంటారు. 'ఒత్తిరి శంఖ కాహళం' అనే ప్రయోగం వుంది.

"కొంచెం మనసొత్తి చూస్తే చాలా విషయాలు తెలుస్తాయి" అంటే పరిశోధించి చూడమని !

"వెడల నొత్త"డాన్ని వెళ్ళగొట్టడం అనే అర్థంలో సుఖసప్తతి గ్రంథంలో ప్రయోగించాడు కదిరీపతి నాయకుడు.

ఒత్తి చెప్తుంటేనే చివరి బెంచీదాకా వినిపిస్తుంది అంటే బిగ్గరగా చెప్పటం అని.

కష్టాలొత్తినప్పుడు కాదు దేవుణ్ణి స్మరించుకోవాల్సింది - సుఖంగా వున్నప్పుడు అనే ప్రయోగంలో ఒత్తడం అంటే పైబడటం.

ఆ గులకరాళ్ళు ఒత్తుతున్నా ఏమీ తెలియటం లేదు ఎలా పట్టిందో నిద్ర అంటే గుచ్చుకోవటం అని.

నేల "ఒత్తు"కొని వీపుమీద నొక్కులు పడ్డాయి అని కూడా అంటూంటాం.

ఒడుదుడుకులు లేకుండా "ఒత్తు"కొని సాగిపోతున్నాడు తోసుకుంటూ, చొచ్చుకుంటూ!! అనే ప్రయోగాలు కూడా వున్నాయి.

"క్రింద ఏదైనా ఒత్తుదు పెట్టుకుని రాయి - పెన్ను పాడవకుండా వుంటుంది."

జయించటం అనే అర్థంలో ఈ రాక్షసుల్ని ఒత్తగలవాడు అతనొక్కడే అనే ప్రయోగం వుంది.

"కళ్ళొత్తుకొంది" అంటే కన్నీళ్ళు తుడుచుకొంది అని అర్థం.

"చెట్లు ఒత్తుగా వున్నాయి ఎండ తెలీలేదు."

"చేతినిండా ఒత్తైన గాజులు."

"ఇంకాస్త ఒత్తుగా కలుపు, మరీపల్చగా వుంది పిండి."

"అంత ఒత్తుగా తింటే కడుపులో మందుతుంది - "వంటి ప్రయోగాల్ని దట్టంగా, మందంగా, పుష్కలంగా అనే అర్థాల్లో మనం చేస్తుంటాం.

అడుగులకు మడుగులొత్తుతున్నాడు అంటే చెంచాగిరి చేస్తున్నాడని.

అంట్లొత్తడం అంటే మొక్కలకు అంట్లు తొక్కడమే.

కనుగవలొత్తుకుంటూ అనే మాటని ఎదురు చూడ్డం అనే అర్థంలో అద్భుతంగా ప్రయోగించవచ్చు.

గోపికలు ఓపికలు లేని చిత్తాలతో ఒత్తిన తత్తరపాటుతో ఒత్తుకొన్న శృంగారంతో ఇళ్ళు వదిలి కృష్ణుడుకోసం వచ్చారని భాగవతంలో పోతనగారి వర్ణన.

# చవి

"చవి" అంటే రుచి. చవిచూడడం అంటే రుచి చూడడం, రుచి మరగడం. చవిచావడం అంటే మొహవాచిపోవడం. ఎన్నాళ్ళనుంచో అదే కావాలని దానికోసం వెంపర్లాడడం.

"శాకపాకాదికంబులు చల్లనారినయేని చవులుదప్పు -" అంటాడు కాశీఖండంలో శ్రీనాథుడు. వండిన వంటలు చల్లారిపోతే చవులు దప్పుతాయి (రుచిచచ్చిపోతాయి) అని !

ఓసారి మన దివ్యాస్త్రాల్ని చవిచూపిద్దామా ... ? అంటుంది భారతంలో ఓ పాత్ర!

తీరాయుద్ధంలోకి వెళ్ళాక ప్రాణాలు చవిగూరి తగవుమరిచిన ధీరులు శూరులెలా అవుతారని హరివంశంలో ఎర్రన గారు ప్రశ్నించారు.

"ఇన్నాళ్ళు అత్తారింట్లో వున్నా కొత్త అల్లుడికి చవితీరినట్టు లేదు...ట!"

"ఆవిడవంటకి చవి అయిన వంట ఈ రాష్ట్రంలోనేలేదు" అని గట్టిగా పొగడొచ్చు - కమ్మని భోజనం చేసినప్పుడు !

"మేమేమన్నా చవిచచ్చాం అనుకొంటున్నారా ? పిలవని పేరంటంగా భోజనాలకి పోవడానికి !"

"వాళ్ళింట్లో వున్న వారం రోజులూ ఉప్పుకారాలు లేనిచప్పిడి కూడే ! ప్రాణాలు చవిచచ్చాయి ఇంటికొచ్చి ఆవకాయి వేసుకొని తింటేగాని మనసు శాంతించలేదు -" అనేది గొప్ప విసుగుని సూచిస్తుంది !

"చవిచదువులు" అని శ్రీనాథుడు గొప్ప ప్రయోగం చేశాడు, వలపు గొలిపే విద్యల్ని చవిచదువులంటూ

"మామిడి కాయంటే అంత చవిగొంటున్నావు ఏం విశేషం ??"

"ఒక్కసారి చవిచూశాడండి. అంతే ? మళ్ళీ వదల్లేదు -" అంటే, ఆ అలవాటుకి బానిస అయ్యాడని !

"చవులూరుతోంది మనసు. పోదాము రావే పొదచాటుకి" అని మంచి జానపదగీతం.

"గంజాయిత్రాగి తురకల, సంజాతులఁ గూడి కల్లు చవిఁగొన్నావా ?, లంజెలకొడకా ! యెక్కడ ! కుంజరయూధంబు దోమ కుత్తుకఁ జొచ్చెన్ -" అనే తెనాలి రామకృష్ణుని చాటుపద్యంలో చవిగొనడం గొప్పగాకుదిరింది.

# అబ్బ

"నీ అబ్బ" అనే తెలుగు తిట్టు గురించి ప్రత్యేకంగా చెప్పనవసరం లేదు.

"ఎవడబ్బ సొమ్మని కులికేవు ?" అని భద్రాచల రాముణ్ణి నిలదీశాడు రాందాసు. "ఈ దెబ్బలకు తాళక "అబ్బా... తిట్టితినయ్య" అని పశ్చాత్తాపపడ్డాడు ఆతర్వాత !

"అబ్బా ! చాలా గొప్పపనే చేశావు" అని వ్యంగ్యాస్త్రాలు సంధిస్తుంటాం కూడా !

'అబ్బ'కి ఆమ్రేడితం "అబ్బబ్బ". విసుగుని తెలిపే ధ్వన్యనుకరణ శబ్దం ఇది ! అబ్బబ్బని ఆశ్చర్యానికి, సంతాపానిక్కూడా వాడ్తుంటాం.

"అబ్బబ్బ ! ఏం అద్భుతంగా మంటల్లోంచి దూకాడు ?" "అబ్బబ్బ ! ఎంతఘోరం జరిగిపోయింది - ఇలా !

అభాగ్యుణ్ణి అబ్బకాదు అంటారు, అదృష్టహీనుడు అనే అర్థంలో ! "అన్నీ వదులుకొని అబ్బకాడయి పోయాడు -"

అలా కొడ్తుంటే ఒళ్ళు అబ్బగించి వూరుకొన్నాడు, గుడ్లబ్బగించి చూస్తున్నాడు "మహాప్రభంజన హతికిఁ గుంజర ఘటలబ్బగింపక" లాంటి ప్రయోగాలు క్రమేణా లోక వ్యవహారంలో అప్పగించడంగా మారిపోయాయి.

అబ్బగించడం అంటే, ఓర్పు, సహించు అని అర్థాలున్నాయి. అప్ప గించడం అంటే అర్పించు అని అర్థం.

మొత్తానికి ఈ రెండు పదాలూ కలిసిపోయి "గుడ్లప్పగించి చూడడం" లాంటి ప్రయోగాలు వ్యాప్తిలోకి వచ్చాయి. ఏమీ చేయలేని స్థితి ! ఎంత అపకారం జరుగుతున్నా ఎదురు తిరక్కుండా ఓర్పుతో చూస్తూ భరిస్తూ వుండటాన్ని గుడ్లప్పగించి చూడడం అంటారు.

"అబ్బరంగా వున్నాయంటే, అమితంగా వున్నాయని ! నల్లడబ్బు అబ్బ రంగా వున్న వాళ్ళేగదా రాజకీయాల్లోకి రాగలిగేది !

'ఇది నీ సొత్తేంకాదు ' అనడానికి "ఇదేం నీ అబ్బగంటా ?" అని అడుగుతారు నిలదీసి.

"ముని గాలఁదన్ని చనుగతి, ఘనజఘనంబాసి యబ్బగాడుగఁ బోయెన్" అని వేంకటనాథ కవి పంచతంత్రంలో చేసిన చక్కని ప్రయోగం చూడండి ! అదృష్టాన్ని కాలదన్నిపోయినవాణ్ణి "అబ్బగాడు" అంటాడు ఈ పద్యంలో!

ఘనజఘనాన్ని (అందమైన నడుముని) వదులుకొని పోయాడట అబ్బగాడు!!

# తల

**త**లవని తలంపుగా 'తల'ని తలకెత్తుకోవడం తలకుమించినా "మాటల మానిత ఇక్షురసం"లో తలనాని వుంది కాబట్టి, తలతో తలపడే మాటలన్నీ ఒక్కతలగా ఇక్కడకు తెచ్చేసరికి తలతిరిగిందని తలతడిమి బాసచేసి మరి చెప్పకతప్పదు !

తలను గురించిన ముచ్చట్లు మనిషి బాధ్య'తల'ను గుర్తుచేస్తాయి

మెదడుకు మే'తల'ను అందిస్తాయి

తల అంటే కోనేరు లాంటిది ! కోనేరు, బుగ్గ, వాగు, దొన, తల, పరిగుండం కాల్వ, డిగ్గి, బావి, దొరువు - ఇవన్నీ జలాశయానికి పేర్లు. వాటిలో తల ఒకటి ! తల అంటే, పట్టుదల, పొరుదల, సాకుదల అనే అర్థాలుకూడా వున్నాయి.

తలకు తలవెంట్రుకలన్ని ప్రయోగాలున్నాయి. అవన్నీ చేర్చి రాస్తే పెద్ద పుస్తకం అవుతుంది కూడా !

మాటల్ని ముచ్చటించుకొంటున్నాం కాబట్టి, 'తల'తో తలపెట్టిన ఈ మాటల తేనెలతేటల్ని మీరూ ఆనందంగా ఆస్వాదించండి !

**తలకట్టు**: "పవడంపు జుత్తులఁ జెవులరూ పడఁగఁగఁ బాపటఁ దలకట్టు భంగి..." అనే ప్రయోగం భారతంలోది. కేశపాశాన్ని తలకట్టు అంటారు. శిరోజ సౌభాగ్యాన్ని, కిరీటాన్ని, శిరోభూషణాన్ని కూడా తలకట్టు అనే అంటారు.

అందంగా పాగా చుట్టడాన్ని కూడా తలకట్టు అంటారు.

హల్లుకి తలకట్టు చేరిస్తే 'అ'కారం 'ఆ' కారాన్ని పొందుతుంది.

"అలాంటి భాగ్యానికి తలకట్టు అయ్యా"దని మంచి హృదయంతో ఎవరి నైనా అభినందించవచ్చు మనం.

వేలాది దానాలకు, వందలాది సేవాకార్యక్రమాలకు తలకట్టుగా నిలబడ్డా డని ప్రశంసించవచ్చుకూడా !

శ్రేష్ఠము, ముఖ్యము, ప్రధానము అనే అర్థాలలో 'తలకట్టు' మాటని ఉపయోగిస్తే అందంగా కూడా వుంటుంది. తల మానికం కూడా ఇలాంటిదే !

"నన్ను బ్రతికించుటయు నీదు నైపుణ్యములకెట్లు దలకట్టు..." అని

హరివంశంలో చేసిన ఎఱ్ఱనగారి ప్రశ్న. "నన్ను కాపాడటం అనేది నైపుణ్యా నికి తలకట్టు" అని దేవుణ్ణి ఛాలెంజ్ చేస్తున్నాడు భక్తుడు.

"కన్నాకన్నను, దలకట్టన్నను, మఱి మేలుబంతియన్నను ధరలో నిన్నియు శ్రేష్ఠము పేళ్ళే..." కన్నాకు, దలకట్టు, మేలుబంతి ఇవన్ని 'శ్రేష్ఠం' అనదగిన వాటికి వాడే పదాలుగా చెప్పడం జరిగింది.

"కన్నాకు మనకు భీష్ముడు..." అనే ప్రయోగం భీష్మపర్వంలో కన్పిస్తుంది.

పండు తాంబూలం ఇచ్చేప్పుడు పెద్దఆకు లోపల చిన్నఆకులు పెట్టి మడిచి ఇస్తారు పైన పెట్టిన ఆ పెద్ద ఆకుని కన్నాకు అంటారు.

**తలకప్ప** : నీరీగ, నీరుకుమ్మరి పురుగు, తలకప్ప – ఇవన్నీ నీళ్ళలో పెరిగే చిన్న జంతువుల పేర్లు, 'తలకీటం' అనేది ఓ మొక్కపేరు.

**తలదాటు** :"అందరికీ తలదాటిన వాడు" "నన్ను తలదాటిన వాడున్నాడా...?" వంటి కవి ప్రయోగాలున్నాయి – మించిన వాడు అనే అర్థంలో !

**తలదాచు** : శరణు ఇచ్చేవాడు లేనప్పుడు "తలదాచుకొనుచోటైన లేదు" అని బాధపడ్తాడు వున్నప్పుడు ఎగిరెగిరి పడిన మనిషి.

**తలదూర్చు**: అనవసరమైన చిక్కుల్లో పడబోతున్నాడని హెచ్చరించడానికి ఈ మాటని వాడతారు – తలదూర్చవద్దని ! తలదూరిస్తే ప్రమాదమేనని !!

**తలదాల్చు**: శిరసావహించడం. 'తలనిడు' కూడా ఇలాంటిదే !

**తలనే కట్టుకోవడం**: నెత్తినకట్టుకు ఊరేగడం. "నీ ఆస్తులు, నీ సంపద నీ నెత్తినే కట్టుకు ఊరేగు – నీ సంగతినా కనవసరం –" అంటే అతనితో ఎంత విసిగిపోయాడో అర్థం అవుతోంది.

తలకాచు = రక్షించడం

**తలకాయ** = బొంద

"నీ తలకాయ నీకేం తెల్సురా
నీ బొంద 'నోర్మూయ్'' అని మనం అంటూనే వుంటాం.

**తలకిందులు** :

"బలుపునఁ బారఁగ
మోహపు పాశము
తన మెడ దగిలిన
తలకిందుగఁ బడుటెల్లను
తనకిది ప్రియమౌనో..." అంటాడు అన్నమయ
మోహంలో పడితే అన్నీ తలకిందులౌతాయని !

తలకిందులుగా నడవడం అంటే, కన్నుగానక, ఒళ్ళూపైనా తెలియక మసలుకోవడం అని !

తలకిందుబతుకులు అంటే, వున్నవన్ని ఊడ్చుకుపోయిన బతుకులని ! అస్తవ్యస్త జీవితాలు !

తలకుంటే ఏనుగును పోవడం :

ఇది బూతు అర్థంలో వాడే గ్రామీణ పదం. అర్థం ఎవరికి వారు వూహించుకోవాల్సిందే ! "వాడు తలకుంటే ఏనుగును పోయే మనిషి" అని నిందించడం. ఒళ్ళు పొగరెక్కిన వాడని !

**తలచెయ్యి:** నెత్తిమీద చెయ్యిపెట్టి ఒట్టుపెట్టుకోవడం

**తలతడిమి చూసుకోవడం :** పనులన్నీ అయిపోయి ప్రశాంతంగా హాయిగా సేదతీరడాన్ని తలతడిమి చూసుకోవడం అంటారు. "పని అయిపో యిందని ఆనందించడం" అని నిఘంటు అర్థం.

**తలతిరగడం:** తల అనేక కారణాలవలన తిరుగుటుంది రక్తప్రసార వ్యవస్థలో లోపం వలనగానీ, నాడీవ్యవస్థలో లోపం వలన గానీ, మెడ ఎముకల్లో వాపు (SPONDYLOSIS) వలనగానీ, చెవుల లోపల ఏర్పడిన తేడాల వలన గానీ తలతిరుగుడు కలుగుతుంది. దీన్ని ఆధునిక వైద్యంలో VERTIGO అనీ, ఆయుర్వేద వైద్యంలో 'భ్రమ' అనీ అంటారు.

భ్రమ అంటే భ్రమణం.

గిర్రున తిరిగే బండి చక్రంమీదో, రంగుల రాట్నం మీదో కూర్చుని చూస్తే ఎలా ప్రపంచం అంతా తిరుగుతున్నట్లు కన్పిస్తుందో అలాంటిదేమీ లేకపోయినా తిరుగుతున్నట్లనిపించడాన్ని 'భ్రమ' (తలతిరగడం) అంటారు. ఒళ్ళు తిరగడం, ఒళ్ళు తూలడం కూడా జరుగుతుంటాయి. 'తలతిప్పు' అన్నా ఇదే !

తలతిరగడం = పొగరు.

"నాలుగు డబ్బులు చేరేసరికి తల తిరుగుడు మొదలయ్యింది –" అని కొందరిని మనం తిట్టుకొంటాం – డబ్బు పొగరెక్కిందని !

"ఈ తలతిరుగుడు మాటలు వదిలిపెట్టి సవ్యంగా మాట్లాడవయ్యా – " అని కూడా విసుక్కుంటూవుంటాం.

తలతిప్పుకోవడం = మన్నన పొందడం

నలుగురిలో తలతిప్పుకో గలిగి వుండేలా మనం ప్రవర్తించాలి.

**తలతడవి బాస:** "తలఁదడవి బాస చేసిన వెలయాలిని నమ్మరాదు వినరా సుమతీ" అని సుమతీ శతకంలో నీతివాక్యం ! నెత్తిన చెయ్యిపెట్టి ఒట్టుపెట్టిన వేశ్యమాట ఎప్పటికీ నమ్మవద్దని !

**తలంబ్రాలు** : తలమీద పోసుకునే బియ్యం కాబట్టే తలంబ్రాలైనాయి. భారతీయ వివాహ వ్యవస్థలో ఇదే ప్రధానం కాబట్టి వివాహానికి తలంబ్రాలు అనేది పర్యాయపదం అయ్యిది !

తలంబ్రాలు చూసిరావాలని, తలంబ్రాలకు వెడ్తున్నామనీ, మొన్ననే మా ఆడపడుచు తలంబ్రాలయ్యాయని అంటుంటారు.

తలంబ్రాలు అనికూడా వ్యవహారం వుంది -

**తల అడుమానం** : తలతాకట్టుపెట్టయినా, చేసిన అప్పు తీర్చేస్తానని అనడానికి 'తల అడుమానం పెట్టు' అనే ప్రయోగం వుంది.

**తలతండ్రి** : కులపెద్దని తలతండ్రి అంటారు. పెద్ద ఉమ్మడి కుటుంబంలో అందరికన్నా పెద్దాయన్ని కూడా తలతండ్రి అనే అంటారు.

అతిరథుల కెల్ల తలతండ్రి... ట ఘటోత్కచుడు - మించిన వాడని !

**తల మనిషి** : జట్టు నాయకుడు, కెప్టెన్‌ని "తల మనిషి" అనడం అందమైన ప్రయోగం. మంత్రివర్గానికి ముఖ్యమంత్రి తలమనిషి !

**తలకొకటి** : తలా ఒక మాట చెప్పకండి, తలకొకటి చొప్పున ఇవ్వండి ఇలా అంటుంటాం.

**తలదన్ను** : తలపైన తన్నడాన్ని "తలదన్ను" అనే అంటారు. అయితే, అక్షరాలా కాళ్ళతో తలదన్నేంత పని చెయ్యనవసరం లేదు - మించు, అధిగమించు అనే అర్థాల్లో ఈ మాటని బాగా వాడ్తుంటాం.

".... తాడిఁ దన్నెడు వానినే దలఁదన్ను వాఁడు గలఁడన్వేషింప..." అని కళాపూర్ణోదయంలో తలదన్నడం గురించి చేసిన ప్రయోగం. తాటిచెట్టు తలని తన్నడం అంటే చాలా ఎత్తున ఎదిగిన వాడని అర్థం. అలాంటి వాడి తలని తన్నాలంటే అంతకన్నా మరో ఆరడుగుల ఎత్తయిన వాడయితేనే ఆ పని చెయ్యగలడని ఈ తెలుగు జాతీయాన్ని వాడ్తుంటారు.

"పుట్టినప్పుడె జవ్వనంబును సమస్త భామినీ కోటిఁ దలఁదన్ను పాటి చెలువు గలిగెదీనికి..." అనీ,

"చీకటి తలదన్నె వదనం" అనీ చక్కని ప్రయోగాలున్నాయి.

**తలవీడు** : తలవీడు అంటే తలవాకిలి !

"కులకన్యలకునువేడుcక, దలవీడులఁ బరులతోడి తగు మాటలకుం దలకొన దగునే" అని మహాభారతంలో ఓ ప్రయోగం ఉంది.

వీధివాకిట్లో నిలబడి కులకన్యలు ఇలా పరాయి వాళ్ళతో మాట్లాడం తగునా... అని !

కులకన్యలు గుమ్మంలోకి రారు. అలా వీధిగుమ్మంలో నిలబడడం జార స్త్రీ లక్షణం అని పెద్దవాళ్ళ నమ్మకం !

**తలకొట్టు**: "తలకొట్లుమారి" అంటే, పెడసరపు మనిషి "ఔర ! తలవ్రాంత తలకొట్ల మారి ధాత" అంటుంది రాధికాస్వాంతనంలో ఓ మంచి ప్రయోగం. తలకొట్లమారి బట్టతలకూ మోకాలుకు ముడివేయగల జిత్తులమారి ! అలాంటివాడితో వేగలేం అని !

తలకొట్టేసినట్లుంది అంటే అవమానకరంగా వుందని.

తలకొట్టుకొన్నట్లుండడం అంటే, విసుగుపుట్టిందని చెప్పడం. "ఇలాంటి వాడితో వ్యవహారాలు తలకొట్టుకొన్నట్టుగా వుంటాయి –" అని !

తలకొట్టించుకునేవాడు ఇతరుల మాటవినని మూర్ఖుడు. 'వాడు తలకొట్టించుకునే రకం అంటే, అనవసరమైన వాటిని తలకెత్తుకొని కష్టాలు పడడానికైనా సిద్ధపడతాడు గాని, మనం చెప్పింది వినడని చెప్పేందుకు "తలకొట్టించుకునే" వాడని అంటుంటారు.

**తలకంటగింపు**: అసహ్యం పుట్టిందని చెప్పడానికి ఈ మాట వాడతారు.

"తరలాక్షు లన్న మా తలకంటగించు
నొరులు సన్నిధినున్న నొదవు నాగ్రహము
వదలక మిరిందు వసియింపవలదు
బెదరు జిత్తము నాకుఁ బిట్టబుట్టినిన" అని హరివంశంలో ఎఱ్ఱన

తరలాక్షులంటేనే 'తలకంటగిస్తుందంటాడు ! 'ఆపేరు చెప్తేనే మాకు ఒళ్ళుకంపరం పుడ్తుంది' అనడానికి – తలకంటగిస్తుంది అని అనవచ్చు.

**తలకు మించడం**: తనశక్తికన్నా అసాధ్యమైన పనిని తలకెత్తుకోవడాన్ని తలకుమించడం అంటుంటాం. "నీ తలకు మించి పోయిన రీతిఁజేయ..." అంటుంది కవిప్రయోగం.

**తలదిక్కు**: తెలుగు దిక్కులేని భాష అని చమత్కరిస్తుంటారు చాలామంది– దిక్కులకు తెలుగులో పేర్లు లేవని !

వున్నాయి – కొంచెం పరిశ్రమ చేస్తే చాలా పేర్లు చాలా దిక్కులకు కన్పిస్తాయి.

తలదిక్కు అలాంటిదే ! ఉత్తర దిక్కుని తల దిక్కని అంటారు – నెత్తిన ఉంటుందని

**తల = జుట్టు**

తలపట్టి ఈడ్వడం అంటే జుట్టు పట్టిలాగడం అని ! తల అంటే శిఖరాగ్రం.

**తల = కొన**

తల అంటే కొన, చివర, ఉత్తరభాగం అనికూడా అర్థాలే !

"నవలాల చూపుదలలు దవులనివాడు" అనే చక్కని ప్రయోగంలో చూపుదల అంటే కటాక్షం ! ఏ ఆడదాని కటాక్షం పొందనివాడట ! ఎంత ప్రయత్నించినా

ఒక్కరూ పడట్లేదని బాధ పడిపోయేవాడు నవలాల చూపుదలలు దవులని వాడు –" అని అన్పించు కొంటాడు.

"తల్లి గండం తలగా పుట్టాడు" అనే మాట అవతలివ్యక్తి దౌష్ట్యాన్ని చిత్రిస్తుంది. పుడుతూనే తల్లికి గండం అయ్యాడు, పెరిగి ఊరుకు గండం అయ్యాడన్నంతగా కన్పిస్తుంది.

**తల = ధైర్యం** 'తలచెడడం' అంటే పిరికి తనం. దానికి వ్యతిరేకపదం 'తల' అంటే ధైర్యం.

**తలతంత్రి :** తల తంత్రి, తలతంత్రం అంటే, ముందు పీటీన నడిచే సైన్యం!

"తొలిసేన" అనికూడ అంటారు.

మంత్రిగారు వచ్చేముందు మొదట పైలట్ కారు రంగులైట్ ఆర్పుతూ వెలుగుతూ కుయ్‌కుయ్ శబ్దం చేస్తూ వెడ్తుంది చూశారూ... అది తలతంత్రి !

తలతంత్రి లేకుండా మంత్రిగారి కారు ఒక్కటే వెడితే జనసందోహంలో ఇరుక్కొని తలడిల్లవలసివస్తుంది !

**తలడిల్లు :** తలడిల్లు, తల్లడిల్లు రెండూ ప్రయోగంలో వున్న పదాలే ! క్షోభపడటం, బాధపడటం, భయపడటం అనే అర్థాల్లో ఈ పదాన్ని ప్రయోగించడం కూడా వుందని సూర్యరాయాంధ్ర నిఘంటువు చెప్తోంది.

"విరక్తులు తలడిల్లు వేళలు" అనీ, "వియోగులందలడించు వేళలు" అనీ ప్రయోగాల్ని ఉదహరించిందీ నిఘంటువు.

'తలడించడం' అంటే లొంగిపోవడం అనే అర్థంకూడా వుంది. చలించడం కూడా తలడించడమేనని సూర్యరాయాంధ్ర నిఘంటువు చెప్తోంది.

"... జరాసుతుని బల మురణవీధిం జలిత దనుజావలికి, బలికి, భయ భీత సుర ఫలికిం జగచ్చలికి, హలికిం దలడించెన్ –" అని భాగవతంలో' ప్రయోగం.

**తలతల :** 'తల+తల ' అనే అర్థంలో, తలకు ఆమ్రేడితం "ప్రతిఒక్కరికీ" అనే అర్థంలో తలతల అనే మాటని ప్రయోగిస్తుంటారు.

"తలైద్దలై" అని ఇదే ప్రయోగం తమిళంలో కూడా వుందట !

"…. తలతల పారు పత్తెములు తద్దయు మించె గిరీశు చెంగటన్ –" అనే ప్రయోగంలో "తలతల పారు పత్తెములు" అంటే ప్రతివాడికి వుండే అధికారం అని సూర్యరాయ నిఘంటువు అర్థం చెప్పింది.

ప్రతిదానినుండీ అనే అర్థం కూడా వుంది !

"తలతలా ఒక్కో రూపాయి వచ్చినా లక్షరూపాయిలౌతాయి –" లాంటి ప్రయోగాలు చేసుకోవడానికి ఇది బాగా ఉపయోగపడే మాట !

"పలుకులకేమీ రోసము గలిగిన మగ వాడవైనఁగాచి కడంకం, దలతలఁ బట్టి కొనంగా ; వలదంటినో చంపి త్రోవ వలదంటినొకో..." అనే పద్యంలో, 'మాటలకేమొచ్చేగాని, మగాడివైతే తలతల పట్టి చావకొట్ట మంటాడు. ఒక్కక్కరిని ప్రత్యక్షంగా పట్టుకోమనడానికి ఈ మాటని బాగా వుపయోగించుకొన్నాడు కవి!

తలతల అనే మాటని తళతళకు వికృతిగా కూడావాడ్తుంటారు. "మెయి దలతల మనుచాయ" అంటే, తళతళమనే శరీరం అని !

"దలదల మంచు మించు సుమనవ్య రజంబులఁ దాల్చి..." తళతళ మనే "సుమనవ్యరజం" తాజాపూల పుప్పొడితో అలంకరించిన వేదిక గురించిన వర్ణన ఇది !

"తలతలమని మెరిసే చీకటి" అనటం కూడా ఇంకో అందమైన ప్రయోగం. తెలతెల వారిందని !

**నేల తల కాళ్ళు నిలవడం** : "నేల తల కాళ్ళు నిలవవు" అనేది ఉత్తరహరివశంలో ఎఱ్ఱన గొప్ప ప్రయోగం.

నేల తల కాళ్ళు నిలవనివాడు ఎక్కడా నిలకడగ పట్టుమని పది నిమిషాలుండడు. ఏ పనిని మొదలు పెట్టినా కడదాకా పూర్తి చేస్తాడనే నమ్మకం వుండదు అన్నింట్లోనూ వున్నానంటాడు. దేంట్లోనూ పరిపూర్ణత్వాన్ని సాధించలేనివాడు. చంచల స్వభావిని "నేల తల కాళ్లు నిలవనివా"డంటే, అది మంచి తెలుగు జాతీయం అవుతుంది !

**మొనతల** : అందరికన్నా ముందుగా వచ్చినుంచున్న వాడు మొనతల నుంచున్నా డంటారు.

సేవా కార్యక్రమాలంటే ఆయన మొనతల నుంచుంటాడు - అని సుగుణాత్మకమైన (Positive) అర్థంలో మనం ఈ మాటని వాడుకోవచ్చు.

**తల = కూడిక** : "...నీచొక్కపుఁ గొడుకును నీవును నొక్కతలై స్రుక్కు..." హరివంశంలో ఎఱ్ఱన గారు చేసిన ప్రయోగంలో నువ్వూ నీ కొడుకు ఒక్కతలగా వుండమనే అర్థం !

మీరంతా ఒక్క తలగా నిర్ణయాలు తీసుకోండి అంటే మంచి ప్రయోగం అవుతుంది.

**తల = ఏకమొత్తంగా** "సైన్యోపేత గాఢగతి నందఱు నొక్కొక్క తలగాఁ దలపడి..." అనే ప్రయోగం భారతంలో కన్పిస్తుంది. అందరూ ఏకమొత్తంగా తలపడాలనే అర్థంలో ఈ మాట.

**తల = వైపు, పక్ష్యం** 'న్యాయం ఆయన తలనే వుంది' అనేది చక్కని ప్రయోగం

'ఇట్టివి నీ తలనేగెన్ చెలీ...' అని ఆముక్తమాల్యదలో రాయలు అద్భుతంగా ప్రయోగించాడీ మాటని

'ఒక తల సమస్త జగములు, ఒకఁడ జనార్ధనుఁడు నిలిచి యొకతలనైనన్...' అని కీర్తిస్తుంది, విరాట పర్వంలో మహాభారతం. సమస్త ప్రపంచము ఒక తల జనార్ధనుడొక్కడే ఒక తలగా వుంటారట.

ఆయనొక తల, నేనొక తల - ఈరెండు పద్ధతుల్లో నీకేది నచ్చితే ఆ మార్గాన నడు - అనికూడా ఇంకో మంచి ప్రయోగం మహాభారతంలో.

**తల = చోటు,** 'స్థలం' అనే సంస్కృత పదం 'తల'గా మార "తల" అంటే ప్రదేశం అనే అర్థంలో చాలా ప్రయోగాలు కన్పిస్తాయి.

'ఆ తల దాటి యివతలికొచ్చాడో లేదో పెద్ద చెట్టు విరిగి పడింది' అనడం ఇలాంటిదే.

**తలద్రొక్కు :** తలద్రొక్కటం అంటే, అధిరోహించడం, కిందినుంచి పైకి ఎక్కటం. ఒక్కొక్కమెట్టే తలద్రొక్కుకెళ్ళి - ఇవ్వాళ ఇంతవాడయ్యాడు అనేది మంచి ప్రయోగం.

**తలపండు :** తాటిపండుని దృష్టిలో పెట్టుకుని చమత్కారంగా చేసిన ప్రయోగం "తలపండు" అయ్యి వుంటుంది. తలపండు అంటే తలకాయ ! మామూలు వ్యక్తులకు వట్టి తలకాయ వుంటుంది. కానీ, అన్ని రంగాల్లోనూ రాణించిన వ్యక్తులు అన్నింటా పండిపోయి వుంటారు కాబట్టి వారికి 'తలపండు' వుంటుందని సరదాగా మనం అన్వయించుకోవచ్చు కూడా !

'పలుకుఁ దేనియ గల దలపండు వేల్పుఁదలఁచి...' అని కొఱవి గోపరాజు కవి ద్వాత్రింశత్సాలభంజికలు కావ్యంలో చేసిన ప్రయోగం గొప్పది !

**తల చెడు :** తల చెడ్డ వాళ్ళు చాలా మంది వుంటారు.

'తల చెడి పాఱక బాహా, బలమొప్పఁగ...' అని భాగవతంలో ప్రయోగం.

"... పుట్టలఁ దారువారును, గుట్టలఁ జేరువారునునై తల చెడి విఱిగి వికావికలైన నిజసేనలం గనుంగొని..." అని, చంద్రాంగద చరితంలో పైడి మఱ్ఱి వెంకటపతి చేసిన ప్రయోగం చూడండి.

యుద్ధంలో ఓడిపోయి, పుట్టల్లోనూ, గుట్టల్లోనూ దాక్కుని, తలచెడి, విరిగి వికావికలైన నిజసేనల్ని పట్టుకోవటం గురించి వర్ణిస్తాడు.

పుణ్యస్త్రీకి భర్త పోవటం కన్నా, రాజశ్రీ రాజ్యం పోవటం ఎక్కువ వైధవ్యం అనేది వాస్తవం కదా ! రెండూ తల చెడటాలే.

గజపతుల్ని ఓడించిన కృష్ణరాయల కీర్తిని చాటి చెప్తుతూ పెద్దన చెప్పిన సీస పద్యంలోని ఈ చివరి భాగం గొప్పది.

"... రాయ రావుతుగండ రాచపేనుఁగు వచ్చి, యారట్ల కోటఁ గోరాడు నాడు... ఒడ లెఱుంగవో చచ్చితో, యుర్విలేవో, చేరఁజాలక తల చెడి జీర్ణమైతొ, కన్నడం బెట్లు చొచ్చెదు గజపతీంద్ర తెఱచి నిలుకుక్క చొచ్చిన తెఱఁగు దోఁప..." అని

తలచెడటం అంటే భయపడడం. కృష్ణరాయుని రాచఏనుగు వచ్చి నీ కోట ముట్టడించినప్పుడు ఒళ్ళు తెలియలేదా ? తల చెడి పారిపోయావు - అనడుగుతాడు.

**తలార్చుకోవడం :** తల అర్చుకొనేది తలంటి పోసుకున్నప్పుడే! ఆడవాళ్ళకు సంబంధించిన పదం

**తలెగకట్టింది :** చిన్నా పెద్దా లేకుండా మాట్లాడేవాడిని 'తలెగకట్టినట్టుంది వీడికి' అని చిరాకు పడతారు.

**తలవాకిట కాపురం :** సింహద్వారానికి మంచి తెలుగు పేరు తలవాకిలి. 'తలవాకిట కాపురం' అంటే గుమ్మంలోనే నుంచుని ఎవరికోసమో ఎదురు చూస్తూ వుండటం.

'అవ్వలనిఁక మాటలేల తలవాకిటఁగాపుర మయ్యే దానికిన్...' అనే ప్రయోగం చాలా అర్థాలు చెపుతుంది.

వీధిలోనే ఎదురు తెన్నులు చూడటం కేవలం మొగుడు కోసం భార్య చేసే పనే అనుకోనవసరం లేదు.

పేషంట్ల కోసం డాక్టర్లు, క్లయింట్లకోసం లాయర్లు, కస్టమర్లకోసం వ్యాపారులు కూడా తలవాకిట కాపురం చేస్తుంటారు.

అప్పులిచ్చినవాడు తీర్చేవాడికోసం వాకిట్లోనే కాపురం పెట్టినా ఆశ్చర్యపడవలసినవసరం లేదు.

**తలకు చెప్పులు :** కొందరుంటారు - మెదడు మోకాళ్ళలో వుంటుంది అనదగిన వాళ్ళు - నిజంగానే, ఇలాంటి వాళ్ళు తలకు చెప్పులడుగుతారు. అంటే కొవ్వెక్కి మాట్లాడుతుంటారు.

**తలకు మిగులు :** తలకు మిగులు, తలకు మీఱు, తలమీఱు అనేవి తనకు మించిన వ్యవహారాల్ని సూచించ డానికి వాడే మాటలు.

నిన్ను తలమీరి పోతున్నాడయ్యా అని హెచ్చరిస్తుంటాం !

తలకు మిగిలే పనులన్నీ తలపెడుతున్నాడని గోలపెడ్తుంటాం.

అయినా, మనం చెపితే వినని వాణ్ణి తల మీరిన వాడు, తల మిగిలిన వాడు అనవచ్చు.

**తలకూడడం :** సమకూరడం లాంటిదే తలకూడటం కూడా !

'ఆ ఇళ్ళు ఖాళీ చేస్తేగానీ శాంతి తలకూడదు' అన్నారంటే ఎంతగానో విసిగి పోయారనీ !

**తలకీలు :** గొలుసులతో బంధించుకొని మంటల్లోకి దూకి మేజిక్ షో చేసేవారికి, ఆ గొలుసులకు ఒకేలింక్ వుంటుందని తెరిస్తే గొలుసులన్నీ ఊడిపడిపోతాయని

అంటుంటారు. 'మాస్టర్ లింక్' ఒకటి వుంటుంది. సైకిల్ చైనుకు కూడా ఇలాగే మాస్టర్ లింక్ వుంటుంది. దాన్ని తప్పిస్తే చైన్ విడిపోతుంది.

ఈ మాస్టర్ లింక్‌ను తలకీలు అంటారు.

కొన్ని సంస్థల్లోనూ, కొన్ని రాజకీయ పార్టీల్లోనూ ఇలాంటి తలకీలు అనదగిన వ్యక్తులుంటారు. కింగ్‌మేకర్ పాత్ర పోషిస్తుంటారు. కింగ్‌పిన్స్ అంటారు వీళ్ళని !

**తలకెక్కు**: "చెప్పింది తలకెక్కిందా ?"

"రాత్రి తాగి తలకెక్కింది ఇంకా దిగలేదు"

"సంగమాపేక్ష తలకెక్కి చాలఁదివురు అని హంస వింశతిలో వర్ణన. అప్పటి కప్పుడు స్త్రీ పొందు కావాలని తలకెక్కి చాలా తిరిగాడట !

తలకెక్కిందంటే విషం అప్పటికే శరీరం అంతా వ్యాపించిందని అర్థం.

**తలకోల**: లాఠి కర్రకి ఓ తాడు కట్టి దాన్ని ఆవు కొమ్ముకు కడతారు. అది ఏ పక్కకు చూసినా దాని కళ్ళముందు లాఠి కనిపిస్తూ వుంటుంది. భయంతో అది బుద్ధిగా వుంటుందని ఆశించి ఇలా చేస్తారు. కొమ్ములకు కట్టే కోల కాబట్టి దాన్ని తలకోల అంటారు.

పోట్లగిత్తలకు ఇది అవసరం కూడా !

**తలగుంజ** : మధ్యలో నిట్రాడు ఆధారంగా గుడిసెని నిర్మిస్తారు. ఈ నిట్రాడుకి మరో పేరు తలగుంజ.

పేద కుటుంబాలు ఒక తలగుంజ లాంటి మనిషి మీద ఆధార పడి బ్రతుకుతున్నవి చాలా వున్నాయి.

ఒక మనిషి రెక్కలు ముక్కలు చేసుకుని సంపాదిస్తాడు. వేన్నీళ్ళకు చన్నీళ్ళు తోడుగా ఇంట్లో మిగిలినవాళ్ళు పనీ పాట చేసుకుని సాయపడుతుంటారు. గుట్టుగా సంసారం సాగిపోతుంది. అదీ – తలగుంజ గుడిసె కాపురం పరిస్థితి.

**తలగుండు**: సినిమాల్లో విలన్లకి గుండు ఎందుకు పెడతారో తెలియదు. బుగ్గ మీద పులిపిరి కాయకు గూండాగిరికి సంబంధం ఏమిటో కూడా తెలియదు

కానీ, భయంకరమైన దుష్టపాత్రల్ని తెలుగులో 'తలగుండు' అని పిలుస్తారని తెలుగు నిఘంటువులు చెబుతున్నాయి.

తలమీద బండరాయి పడటంతో సమానంగా బాధపెడతాడు కాబట్టి వీణ్ణి "తలగుండు" అంటారట. తలమీద గుండు (రాయి) వంటి వాడని...

**తలచూపు**: తల చూపడానికి అనేక అర్థాలున్నాయి.

**తలచూపు = కలుగు** : 'తలచూపేఁ గోర్కెలు' అని రంగనాథ రామాయణంలో ప్రయోగం.

**తలచూపు = ముందుచూపు**

అతి పెద్ద లక్ష్యాన్ని నిర్దేశించుకొని దానిమీదే తదేక దృష్టితో పని చేయాలనే నిర్ణయం తీసుకోవడం తలచూపు. అందుకొక 'విజన్' - వుండాలి కదా ! అదీ తలచూపు అంటే. THINK HIGH - ACHIEVE HIGH అనేది నేటి నినాదం కూడా !

తలచూపు = కనిపించు

'జలచరములు తలచూపక' అని కవిప్రయోగం వుంది ఇది సుగుణాత్మక (POSITIVE) అర్థంలో ప్రయోగించదగిన పదం. పొడసూపటం అనేది చెడులక్షణాలు కన్పించడానికి వాడ్తుంటాం. 'అపశకునాలు పొడసూపాయి' అని.
తలచూపటం శుభానికి వాడితే అందంగా వుంటుంది.

తలచూపించ లేకపోవటం = మొహం చెల్లక పోవటం

'తజ్జనపదంబుల సుప్రాజ్ఞులకుఁ దలచూప నోడి దూర దేశాంతరం బుల యాయావర వృత్తి నర్థార్జనం బొనర్చుచు...'అని కళాపూర్ణోదయంలో తలచూపించలేకపోవడాన్ని ఉపయోగించి చక్కని ప్రయోగం చేశాడు.

ఇంక ఆ ఊళ్ళో మనుషులకి తలచూపలేక దూరదేశాంతరాలకి పోయి ఇంటిటికీ తిరిగి యాయావర వృత్తి చేసుకుంటూ బ్రతుకుతున్నాడట.

**తలగొఱుగు** : శిశుపాలుణ్ణి తలగొఱిగి, మీసం గొఱిగీ అవమానిస్తాడు కృష్ణుడు.

తలయును, మీసమును గొఱుగుట తల తరుగుట కన్నా తుచ్ఛతర మైనదిగా బాధపడిపోతాడు శిశుపాలుడు ! అలా బాధపెట్టటమే కృష్ణుడి ఉద్దేశం కూడా.

**తలపట్లు** : తల పట్టిచూసుకోవడం అంటే, 'హమ్మయ్య బతికే ఉన్నాను -' అని ఆశ్చర్యంగా - చావు తప్పి కన్నులొట్టబోయిన స్థితిలో - పొందే ఊరట !

తలపట్టు అంటే శొంఠి కొమ్ముని సానమీద అరగదీసి ఆ గంధాన్ని కణతలకు నుదురుకు రాసుకోవడం. జలుబు, తలనొప్పి, దిబ్బడ వదుల్తాయని తలపట్టు వేసుకొంటారు.

తలపట్టుకొంటున్నారు అంటే, తీవ్రమైన వాగ్వివాదాల్లో చిక్కుకుని విషయం తేలక బుర్ర పగలకొంటున్నారని !

తలపట్టుకుడిగారంటే జుట్టుపీక్కుని కొట్టుకునే స్థితికి చేరారని ! తలపట్లు, సిగపట్లు ఒకే అర్థంలో వాడే పదాలే !

'తల పట్టేవాడు' అంటే బానిసత్వం చేసేవాడు, కాకా పట్టేవాడు - అని!

**తలపొలం** : ఎత్తయిన భూమి. అక్కడ నుంచుని చూస్తే చుట్టూ చాలా మేర కన్పిస్తుంది. దాన్ని తలపొలం అంటారు.

"ఈ తఁడు దొంగకూటికే, లాగున జొచ్చెఁ దాఁదలపొలంబులనిల్చునె సాదు రేఁగినన్. -"

"దొంగకూడు" కోసం అంటే, విందు భోజనాలు జరుగుతున్నప్పుడు, దొంగతనంగా దూరి భోజనం చేయడం కోసం తలపొలం మీద నుంచుని చూస్తున్నాడట -

**తలపరిగె**: నదులు, ఏరులు, వాగులు, కాల్వలు... ఇలాంటివి ఎక్కడో పుడతాయి - చిలవలు పలవలుగా సాగి ఎక్కడో కలుస్తాయి.

అలా పుట్టిన స్థలాన్ని "తలపరిగె" అంటారు.

'తలిపెర' అని కూడా అంటారని "పదబంధ పారిజాతం"లో వుంది !

**తలపువ్వు**: కొత్తగా పెళ్ళయ్యిందనడానికి గుర్తుగా వాడే చక్కని పదం.

"సిగపువ్వు వాడకనే తలపువ్వు వాడెకదా..." అనే సినిమా పాట అందరికీగుర్తుండే వుంటుంది.

కష్టనష్టాలకు తట్టుకునే మనిషి చెక్కుచెదరని వ్యక్తి అనడానికి 'తలపువ్వు వాడని మనిషి' అనే ప్రయోగం కూడా వుంది.

ఇస్త్రీ బట్టలు నలగని వాడు అని మగవాళ్ళని అన్నట్లు తలపువ్వు వాడనిదని ఆడవాళ్ళకు వర్తిస్తూ ఉపయోగిస్తుంటారు.

ఈ పదాన్ని వాడేప్పుడు కొంచెం జాగ్రత్త అవసరం. తలపువ్వు వాడనిది అంటే స్వచ్ఛమైన కన్య ! ఇంతవరకూ పురుష సంపర్కం తెలియని స్త్రీని తలపువ్వు వాడనిదిగా అందంగా వర్ణించవచ్చు.

'తలపువ్వు వాడక తరుణీ లలామయెల నవ్వు సిగురొత్త నెప్పటియట్టు -' అనే ఎర్రనగారి ప్రయోగంలో ఎన్ని కష్టాలు వచ్చినా బయటపడనీకుండా చిరునవ్వుతోనే వుందని చెప్పటం కోసం "తలపువ్వు వాడని తరుణీలలామ" అనే మాట ఉపయోగించాడు.

శ్రమపడకుండా అనాయాసంగా, సునాయాసంగా పనులు సాధించగలిగే వారిని తలపువ్వు వాడకుండా పనిచేయగలరని ప్రశంసించ వచ్చు.

**తలపుళ్ళు కడగటం**: దుర్భరమైన కష్టాలనుంచి బయటకు తీసుకువచ్చి కాపాడటాన్ని తలపుళ్ళు కడగడం అంటారు. ఇబ్బందులు తీర్చికాపాడటం.

'తలపుళ్ళు కడిగాను, ఇవ్వాళ సంపదలొచ్చే సరికి అన్నీ మర్చిపోయారు -' అని బాధపడుతుంటాం కొందరు కృతఘ్నుల్ని చూసి !

**తలపెత్తు**: పెద్ద లక్ష్యాన్ని ఆశించడాన్ని "తలపెత్తు" అంటారు. తలపెత్తి దూసుకుపోతేనే ఈపోటీ యుగంలో నిలదొక్కుకోగలుగుతాం.

**తలబిళ్ళ:** తలబిళ్ళ అంటే తలగడ ! ఎంత అందమైన ప్రయోగమో చూడండి.

**తలమాటు:** రఘువంశంలో తలమాటు ఇంచుకైనా లేదని కవి ప్రయోగం. తలమాటు అంటే తలవంపులు తెచ్చే పని.

ఈ తలమాటు వ్యవహారాలు మా ఇంటా వంటా లేవని అత్తగారు కొత్త కోడల్ని నిందిస్తూ వుంటుంది నిత్యవ్యవహారంలో !

**తలమావి మాయనివాడు :** బిడ్డని ప్రసవించేటప్పుడు మొహం మీద మావి పొరల్ని తీసివేసి శుభ్రంచేశాక బిడ్డ ఈ భూలోక వాతావరణాన్ని మొదటిసారిగా గమనించి ఊపిరిపీల్చుకొని ఏడవడం ప్రారంభిస్తాడు.

ఇంకా, ముఖంమీద మావిని కూడా తీయనంత చిన్న వయస్సులో - వున్నవాడు అనడంకోసం తలమావి మాయనివాడు అప్పుడేపుట్టిన వాడు అంటూంటాం.

'నా ముందు బచ్చా గాడివి' అనడం లాంటిది. 'తలమావి మాయని వాడు కూడా మాట్లాడే వాడే -' అని వ్యంగ్యంగా అంటూంటారు.

**తలమిగిలి తాడి :** ఇదో చక్కని జాతీయం. తలమిగిలి తాడి ప్రమాణం అయ్యింది. తలమిగిలి తాడి పొడవైంది. వంటివి పూర్వ కవుల ప్రయోగాల్లో కన్పిస్తాయి. జనవ్యవహారాల్లో కూడా వినిపిస్తాయి.

మన్మథబాధలు తలమిగిలి తాడి పొడవై బలిశాయి... ఇలాంటి చక్కని ప్రయోగాలు చాలా కనిపిస్తాయి మనకి !

మితిమీరడాన్ని అందంగా చెప్పిన ప్రయోగం ఇది.

# "తల" సామెతల కతలు :

**తలకింద కొరివి :** శవానికి తలవైపు దహనం కోసం అగ్గి పెట్టడాన్ని 'తల కొఱివిడు' అని ప్రయోగించాడు గౌరన.

తలకొరివి పెట్టే దిక్కు - అంటే ఆత్మీయుడైన మనిషని.

**తలలు బోడులైతే తలపులు బోడులా ?** చిన్నవయస్సులోనే వైధవ్యం ప్రాప్తిస్తే గుండు గీయించి కోరికలు లేని స్థితిలో బతికేలా చేయాలని యుగాలుగా ఎందరో స్త్రీలని ఇలా హింసించడం జరిగింది.

మతానికి దాన్ని ముడిపెట్టి ఎవరూ ఎదురుచెప్పలేని స్థితిని తెచ్చారు. కానీ, 'తలలు బోడులైనా తలపులు బోడులౌతాయా... ?' వాటి దారిన అవి ఊట బావిలోంచి నీళ్ళు ఊరినట్లు ఊరుతూనే వుంటాయి.

**తలప్రాణం తోకకు రావడం** : "సితమయూఖ ! నినుం దెలియఁగఁ గోరి యూరక యటుచేరినింతఁధలప్రాణముదోఁకకు వచ్చే..." అనే కవి ప్రయోగం 'నిన్ను ఒప్పించడానికి తలప్రాణం తోకకొచ్చింది' అంటుంది.

**తలాతోకా లేని కథలు** : అతకని అబద్ధాలు, పొంతనలేని విషయాలు, అర్థంలేని వంకలు, తలాతోకా లేని కథలంటే (ఎలిబీలు)

ఇంటికి ఆలస్యంగా వచ్చినందుకు ఇల్లాలికి చెప్పేవన్నీ తలా తోకా లేని కథలే కదా !

**తలారిపగ తలతో తీరుతుంది !** : సాక్షాత్తు తలారే పగపట్టిన వాడైతే ఇంక రక్షించే వాడెవడుంటాడు. తలారి పగ తలతోనే తీరుతుంది !

**తలారి ముందు దాగు** : "దాగం బోయి తలారివాని యెదురన్ దాగంగ నీకేటికిన్" అనే కవిప్రయోగం గమ్మత్తుగా వుంటుంది.

ఉరిశిక్ష తప్పించుకోవడం కోసం పారిపోయి ఖైదీ ఎక్కడో దాక్కున్నాడట ! ఎక్కడ దాక్కున్నాడూ – సాక్షాత్తు తలారి ఎదురుగ్గా ! అదీ సంగతి !!

**తలకు మించిన ఆజ్ఞ లేదు** : శక్తిని మించిన పని చెయ్యలేననడం.

**తలకోసి ముందరపెడితే గారడీ విద్య అన్నట్లు**: ఎంత కష్టపడ్డా అవతలి వాడు ఒక్కొక్కసారి మనల్ని అభిమానించడు. ఆఖరికి తలకోసి ముందర పెట్టినా 'ఇదంతా గారడీ విద్య' అని చప్పరిస్తాడు.

అలాంటి వాడి ప్రాపకం కోసం వృధాఊడిగం చేయ్యకూడదంటారు అందుకే!

**తల గట్టి - కడుపు గుల్ల** : మహా మేధావులుంటారు. ఎక్కడ ఏమూల ఏది అడిగినా చెప్పగల నడిచే గ్రంథాలయాలు వుంటాయి. కానీ, కడుపు గుల్ల తినడానికి తిండి వుండదు. దుర్భర దారిద్ర్యంలో వుంటారు. తలగట్టిదే గాని కడుపు గుల్ల అనే సామెత ఇందుకే పుట్టింది.

ఈ మేధావులు తమ సంపత్తిని లోక కళ్యాణం కోసమే వినియోగిస్తారు. లోకం వీళ్ళని బ్రతకడం చేతకాని వాడంటుంది ! ఎంత విచిత్రమో గమనించారా??

**తల తిరిగి అయినా కబళం నోటికి రావాలి** : కొండ మహమ్మద్ దగ్గరకైనా రావాలి – మహమ్మదే కొండ దగ్గరకైనా రావాలి. అన్నట్లు కబళం అంటే అన్నంముద్ద నోటి దగ్గరకు రాకపోతే తల తిరిగైనా సరే తిన్నగా ముద్దదగ్గరకు వెళ్ళి నోటితో అందుకోవాలి!

అంటే, అవకాశాలు వాటికవే రావు. వాటిని మనమే అందిపుచ్చుకో గలగాలి. ఎవరో వస్తారని, ఏదో మేలు చేస్తారని ఎదురుచూసి మోసపోకండి - అనడం.

**తలమీది వారు** : పై అధికారులు, తనకంటే ఎక్కువ వారు.

**తలచినప్పుడే తాత పెళ్ళి:** ఏ క్షణంలో అనుకుంటే ఆ క్షణంలో అనుకున్నది అనుకున్నట్లు అయిపోవాలి ! అది దృఢనిర్ణయం అంటే ! 'తలచినప్పుడే తాత పెళ్ళి' అని వ్యంగ్యంగా, తెల్లవారుఝామున హఠాత్తు నిర్ణయాలు తీసుకునే పరిపాలకులను దృష్టిలో పెట్టుకొని అంటుంటారు.

**తలగిల్లి మొలవేయడం:** తలని నరికి భూమిలో విత్తనాన్ని నాటినట్లు పూడ్చిపెట్టడాన్ని, అంటే పూర్తిగా నాశనం చేయడాన్ని తలగిల్లి మొలవేయడం అంటారు.

**తలపేరు:** తల నొప్పిని తలపేరు అంటారు.

**తలవుంటే కుళ్ళాయి తగిలించవచ్చు:** కొద్ది ఆధారం వుంటే, పనిజరపించేయ గల సమర్ధతని చెప్పడంకోసం తలవుంటే కుళ్ళాయి (కుళాయి) తగిలించవచ్చని అంటుంటారు.

**తలపైతల:** ఎంత తెలివి తేటలు వున్నా ఇక్కడ నీ ఆటలు చెల్లవు, అనడానికి తలపై తల వచ్చినా... అంటారు.

చావు తెలివితేటల్ని తలపై తల పెట్టుకొని మాట్లాడుతున్నాడని అంటారు.

**తల ముచ్చుట్టులు తిరిగినా :** ఇది కూడా తలపైతల వంటి ప్రయోగమే.

తల ఎంత బలిసి తెలివితేటలు ఎంత ఎక్కువైనా ఇక్కడ పనిచేయటం సాధ్యంకాదు, అనడానికి తల ముచ్చుట్టు తిరిగినా అంటుంటారు.

**తలలో నాలుక:** భయంకరమైన కోరల్లాంటి పదునైన పళ్ళున్న నోట్లో కూడా నాలుక పళ్ళమధ్య పడకుండా ఎంత జాగ్రత్తగా వ్యవహరిస్తోందో గమనించారు కదా !

చక్కటి మైత్రినీ, స్నేహాన్నీ నడిపేవాడిని తలలో నాలుకలా వున్నా డంటారు.

ఫిట్స్ జబ్బు వచ్చినప్పుడే నాలుక పళ్ళమధ్య పడి నలిగిపోతుంది. అందుకని, మూర్ఛ రాగానే, రోగిని ధారాళంగా గాలి వచ్చేలా పడుకోబెట్టి Air Way అనే రబ్బరు గొట్టాన్ని నోట్లో వుంచితే నాలుక పదిలంగా వుంటుంది. ఫిట్స్ తరచూ వచ్చేవారు ఈ Air Way ని తెచ్చుకొని ఇంట్లో తప్పకుండా అందుబాటులో వుంచుకోవాలి.

**తల రాయిచేసుకోవడం :** ఎంత మొత్తుకున్నా ఏమీ తలకెక్కించుకోని వాణ్ణి తల రాయిచేసు కున్నాడంటారు.

**తల కంటగించుకోవటం :** ఇంక ప్రేమాభిమానాలు వదులుకొని ద్వేషం పుట్టించుకోవడాన్ని తల కంటగించుకోవటం అంటారు.

**తల మొల :** తలా తోకా అనే అర్థంలోనే ఈ మాట కూడా వాడుతుంటారు.

**తలకొట్లమారితనం** : అవినీతి, కుళ్ళుమోతు తనం, ఎదుటివారి అభివృద్ధిని సహించలేక పోవడం.

**తల పుట్టిల్లు మేనమామ వద్ద దాచినట్లు**: తన గొప్పతనాన్ని తనగురించి బాగా తెలిసిన వాళ్ళ దగ్గర ప్రగల్భాలు పలుకుతుంటే ఈ మాటని వాడతారు.

**తలనొప్పిగా వుందని తలగడ మారిస్తే తగ్గుతుందా...** అనేది అరవ సామెత!

సమస్య వచ్చిందని దిగులుపడటం కన్నా సమస్యకు తగిన పరిష్కారం వెతకడం మంచిదని చెప్పడం !

**తలను దాచి తోకను చూపించినట్లు** : కొంతమంది విషయం తేల్చి చెప్పరు. అసలు సంగతి తప్ప ఎన్నో విషయాలు మాట్లాడుతుంటారు. మజ్జిగ కొచ్చి ముంతని దాచినట్లు, తలని దాచి తోకను చూపిస్తుంటారు.

సరైన కమ్యూనికేషన్ చేతకాని వాళ్ళని ఇలా అంటుంటారు. ఇది జపాన్ దేశపు సామెత అని నేదునూరి గంగాధరం గారు రాశారు.

**తల వెంట్రుకలు పెరిగిన కొద్ది తల చిన్నదే** : ఇది టర్కీ దేశపు లోకోక్తిగా గంగాధరం గారే రాశారు. తలకాయి మాసిన వాణ్ణి మనం చిన్నచూపు చూస్తాం. అలాంటిదే ఈ సామెత !

తల వెంట్రుకలు పెరిగినకొద్దీ, అంటే తలమాసిన కొద్దీ తల చిన్నదైపోతుంది - అంటే బుద్ధి తరిగిపోతుందని

**తల వెంట్రుకకు కూడా నీడ వుంటుంది** : పోర్చుగీసు దేశపు లోకోక్తిగా గంగాధరం గారు సేకరించిన ఈ సామెత గొప్ప ఆలోచనల్ని కలిగిస్తుంది మనలో !

ప్రపంచంలో పనికిరానిదంటూ ఏదీ లేదని జీవకుడనే ఆయుర్వేద వైద్యుడు ఋజువు పరచినట్లు, తలవెంట్రుకకు కూడా నీడ వుంటుంది. దేని అస్థిత్వం దానిది ! దేని ప్రయోజనం దానికుంటుంది. మనం అశ్రద్ధ చేసే వాటిలో మహోపకారాలు చేసేవి చాలా వుంటాయి ! అని గుర్తుచేస్తుంది ఈ సామెత.

# వైదికవారసత్వంలోంచి
# తెలుగువారి సరదా తిట్లు

ఆదికవి వాల్మీకి నోటివెంట వచ్చిన మొదటి శ్లోకమే తిట్టు అయినప్పుడు సంస్కృతం తర్వాత అంతటి భాష, భాషావేత్తలు నిరూపిస్తే అంతకన్నా పూర్వభాష తెలుగుభాషలో తిట్లకు కొదవే ముంటుంది ?

తిట్టడంలో తెలుగు వారికి ప్రత్యేకత వుందని తెలుగులో విస్తృతంగా వెలువడిన తిట్టు కవిత్వం ససాక్ష్యంగా నిలబడింది.

వేములవాడ భీమకవితో మొదలుపెట్టి, శ్రీనాథుడి మీంచి తిరుపతి వెంకట కవులదాకా సాగిన తిట్టుకవితా మహాయుగంలో దిట్టలైన మహనీయులు చాలామంది వున్నారు. అది కవుల భాష. తెలుగువాడు తిడితే మాడు పగిలేలా వుంటుంది.

తెలుగు ప్రజల తిట్లలో గమ్మత్తైన అంశం ఒకటుంది ! ఎవర్ని తిడ్తున్నామో వాళ్ళకి ఒక్క ముక్క అర్థం కాకుండా, వాళ్ళ గురించి అందరికీ అర్థం అయ్యేలా మాట్లాడ గలగడం – ఇది తెలుగువారి చాతుర్యం.

## "అహం బ్రహ్మాస్మి !"

మునిమాణిక్యం వారన్నట్లు ఇది ప్రత్యేకమైన భాషాపరమైన అంశం. ఈ భాషలో ఒక మాటకి అందరికి తెల్సిన అర్థం ఒకటుంటే, సహృదయులకు మాత్రమే తట్టే అర్థం ఇంకొకటి వుంటుంది.

తెల్ల మల్లెపూవులాంటి మడత నలగని పంచె కట్టుకొని లాల్చి వేసుకొని వచ్చిన ఓ పెద్దమనిషిని ఎవరైనా మనకు పరిచయం చేస్తూ "ఈయన అహం బ్రహ్మాస్మి" గారండీ – అన్నారనుకోండి – తననో గొప్ప వేదాంతిగా పరిచయం చేస్తున్నాడుకొని మురిసిపోతాడా పెద్దమనిషి.

కానీ, వాచ్యార్థంలో, మనకు పరిచయం చేసిన వ్యక్తి ఆయన గురించి చెప్పదలచుకున్న సంగతి వేరు – ఈయనకు భార్య మాటే మహావాక్యం – 'అహం బ్రహ్మాస్మి' లాగా ! ఆమె గీసిన గీత దాటడు అని ! అదీ సంగతి !

కొన్ని పదాలు వాటికి సంబంధించిన గొప్ప అర్థాన్ని కలిగివుంటాయి. వాటిని

వ్యుత్పత్త్యర్థంలో ఇతర సంభాషణల్లో ఉపయోగించినప్పుడు భలే చమత్కారం సాధించవచ్చు. ఈ విద్యలో తెలుగువారు ఘటికులని చెప్పడమే నా ఉద్ధేశ్యం.

ఇంగ్లీషులో EUPHEMISM అనే ప్రక్రియ వుంది. "The Substitution of a mild or less negative word of phrase for a harsh or blunt one" అని ఈ పదానికి అర్థం.

గట్టి ఘాటైన పదాలు వాడవలసినచోట ఇలా ప్రత్యామ్నాయ పదాలు మృదువుగా, సుతిమెత్తగా వుండేవి ప్రయోగించి హాస్యాన్ని సాధించవచ్చు ! తెలుగు వారు కూడా ఇలా చాలా చేశారు. ఇవి కవులు చేశారంటే మళ్ళీ ఇబ్బందే! ప్రజలే చేశారంటాను. తెలుగు ప్రజలు మంచి హాస్య ప్రియులు !!

బయాలజీ చదువుకునే విద్యార్థులు ఎవర్నయినా పనికి మాలిన వాడిగా చెప్పాలనుకోండి - వీరు 'ఫ్యామిలీ ఆవారియేసీ' వీరి 'ఫైలమ్ బికారియేల్స్' అంటుంటారు. ఆవారా, బికారి అనే పదాల్ని సైన్సులో చొప్పించి చక్కని హాస్యం పుట్టించగలవారు తెలుగువారు.

"వైదికుల సంజ్ఞలు - పరిభాషలు" పేరుతో పరాశరం గోపాలకృష్ణమూర్తి ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రికలో కొన్ని ఇలాంటి మాటల వివరాలను అందించారు.

# అఘమర్షణం

ఇంకో ఉదాహరణ చూడండి !

ఋగ్వేదంలో అఘమర్షణం అనే మంత్రం వుంది. నీళ్ళలో మూడుసార్లు మునిగి, ఈ మంత్రాన్ని జపిస్తే - గురు తల్పగమనం - గురువుగారి భార్యతో చేసిన తప్పుడు పనితో సహా అన్ని పాపాలూ పోతాయి... అని నమ్మకం.

ఎవరిమీదో అభియోగం వెళ్ళింది ! వాడి మీద చర్య ఎందుకు తీసుకోకూడదో తెలియజేయమని కోరుతూ కాయితం ఇచ్చారు. దానికి సమాధానంతో పాటు "పచ్చకాయితం" కూడా పైవాడికి చేరిపోయింది. చేసిన పాపాలన్నీ "అఘమర్షణం" అయిపోయాయి. అదీ సంగతి !

అఘం అంటే పాపం, అది "మాఫీ" అయిపోయిందన్న మాట !!

# బృహస్పతి

'వారికేమండీ ! బృహస్పతులు' అంటే, వారికి పెద్ద బుడ్డ (హైడ్రోసీల్) దిగిందని దాన్ని వారు మోస్తూ నడుస్తూ ప్రయాస పడ్తున్నారనీ మనం అర్థం చేసుకోవాలి.

'బృహత్' అంటే, పెద్దది - అని !

అదో బృహస్పతి కార్యం అనే ప్రయోగం కూడా ఇలాంటిదే ! ఉపయోగం లేని పనికోసం అనవసరంగా కష్టపడితే, చివరికి శ్రమ, ఆయాసం తప్ప ఒరిగేదేమీ లేదని తెలియజేయడానికి ఈ మాటని వాడతారు.

వృథా ప్రయాసని వృషణాయాసం అనేది ఇందుకే !

# వషట్కారాలు

ఆఫీసులో పై అధికారి చీటికీ మాటికీ థాంథూం అంటూ చిర్రు బుర్రులాడుతూ వుండే మనిషి అయితే మనిషి మంచి మూడ్‌లో లేదని చెప్పడానికి - ఆయన 'వషట్కారాలు' ప్రయాగిస్తున్నాడు అంటుంటారు ! అంటే, లోపలికి వెళ్ళిన వాణ్ణల్లా చివాట్లు పెడ్తున్నాడని !

మంత్రాలు చదివేప్పుడు 'వషట్' అనే పదాన్ని గట్టిగా వత్తి బిగ్గరగా అంటుంటారు. అరిచి మాట్లాడేటప్పుడు 'వషట్కరాలు' ప్రయోగిస్తున్నాడనేది అందుకే!

# కౌశలం

'కుశ' అంటే దర్భగడ్డి ! దర్భలు కోసేప్పుడు చేతులు తెగకుండా కొంత చాకచక్యం కావాలి. "కుశలు" కోసేవాడు "కుశలుడు". కుశలుడి నైపుణ్యం కౌశలం అయ్యింది ! కానీ, జేబులు కత్తిరించిడానికి, చూస్తుండగానే వస్తువులు మాయం చేయడానికి ఈ పదం వ్యంగ్యార్థంలో మారిపోయింది. హస్తకళా కౌశలం అంటే, చేతిలాఘువం అని !

# సత్యంత్వర్తేన ఎక్కడ ?

భోజనాలు ఎక్కడ పెడ్తున్నారు అని అడగడానికి నలుగురిలో నామోషీ పడి తిండికి మొహం వాచిన వాడిలా దేవురిస్తునట్లు అనుకొంటారనిపించి, ఇతరులకు అర్థం కాకుండా "సత్యంత్వర్తేన ఎక్కడ ?" అనడుగుతాడు ఓ పెద్ద మనిషి తన మిత్రుణ్ణి.

ఆ వాక్యాలకూ, ఈ అర్థానికి ఏమీ సంబంధం లేదు. భోజనం చేసే టప్పుడు ఆచమనంలో చెప్పేమంత్రం ఇది.

"దేహా - వై"లో అని సమాధానం చెప్తాడు ఆ మిత్రుడు. ఆయన అంతకంటే గడుసు పిండం. 'సత్రంలో' అనకుండా ఇలా చెప్పాడు.

చాలా టైం అయి పోయింది. భోజనం వుంటుందో - వుండదో - అని, ఈయన ముఖంలో ప్రశ్నార్థకాన్ని గమనించి ఆయన అదే భాషలో మళ్ళీ అన్నాడు - "యత్తే అగ్నే" అని ! దీని అర్థం 'భోజనాల తంతు అయిపోయింది' అని !

"యత్తే అగ్నేతే జస్తేనాహం తేజస్వీ భూయాసం – " అనే మంత్రం చెప్పి, క్రతువుల్ని ముగిస్తుంటారు. ముగింపు సూచకంగా చెప్పే మంత్రం ఇది కాబట్టి, కార్యక్రమం అయిపోయిదనడానికి గుర్తుగా యత్తే అగ్నే అనేశాడు.

ఇదొక రకం చమత్కారం.

ఇలాంటి చమక్కులు చెయ్యాలంటే కొంచెం వేద పరిజ్ఞానం అయినా వుండాలి – లేదా ఇలాంటి పుస్తకాన్నయినా చదవాలి.

# పౌండరీకం

వేద పండితులు ఇలాంటి చమత్కారాలు చాలా చేస్తుంటారు. 'తమరు పౌండరీకుడంతటి వారు' అంటే పొగిడేస్తున్నాడని మనం భ్రమ పడకూడదు. 'పచ్చి వ్యభిచారి' అన్ని తిడ్తున్నట్టు.

దీని వెనక ఒక కథ వుందని పెద్దలు చెప్పారు –

యజ్ఞ యాగాదులు చేసేవారు భక్తి భావనతో చేసే రోజుల్లో ఆ క్రతువు సమయంలో యజ్ఞవేదిక మీద ఓ బ్రహ్మచారికి, ఓ కులటకూ వాగ్వివాదం ఏర్పడింది. ఇప్పుడు మనకి ఆ వివాద కారణాలు అవసరం లేకపోయినప్పటికీ, పౌండరీకం క్రతువులో బహిరంగంగా కులటతో వివాదం జరిగిన సంఘటనని బట్టి బహిరంగంగా వ్యభిచరించడాన్ని పౌండరీకం అని రహస్యంగా వ్యవ హరిస్తుంటారు. ఎందుకంటే, దాని అసలు అర్థం అది కాదు కాబట్టి !

# బుట్టలోది

ఎందుకో తెలియదు గానీ, 'ఉప్పు' వెయ్యమని సూటిగా అడగరు మన వాళ్ళు. ఉప్పుని కూడా నేరుగా చేతికి అందించరు.

'ఆ బుట్టలోది కొంచెం వెయ్యి' అంటారు. ఉప్పు పలుకుల్ని గల్ల అనీ, కల్లు అనీ పిలుస్తుంటాం మనం. ఇప్పుడంటే అయొడైజ్డ్ ఉప్పు పేరుతో మెత్తని ఉప్పు చూర్ణం దొరుకుతోంది. పూర్వం ఉప్పు అంటే 'ఉప్పు కల్లు' అనే ! ఈ ఉప్పుకల్లుని చిక్కగా అల్లిన మేదరి బుట్టల్లో అడ్డాకువేసి అందులో నిలవవుంచుకునేవారు దానికి పైన మూత పెట్టేవారు. తడిగాలి తగిలితే ఉప్పు కరిగిపోతుందని ! రాత్రిపూట ఉప్పు పేరు తలచుకోవడాన్ని ఇప్పటికీ చాలామంది ఇష్టపడరు. అందుకని బుట్టలోది, తట్టలోది అని మారుపేరులో వ్యవహ రిస్తుంటారు.

# పూర్వాషాఢలు

మనవాళ్ళు వట్టి వెధవాయిలోయ్ అని గిరీశం అంటే అనొచ్చుగాని అన్ని వేళలా అది నిజం కాదు – అనగా కొన్నివేళల అలాంటి నిజాలు జరగవచ్చేమో...

ఎవరింటికైనా పెళ్ళికో పేరంటానికో వెడితే, మనతో కలిసి ఎవరు రాలేదో చూసి, వాళ్ళని తీసుకురాలేదని, మనల్ని వాకిట్లోనే నిలేస్తారు. వచ్చిన మనకి గుర్తింపు ఏమీ వుండక పోగా రాని వాళ్ళు రాకపోవడం గురించి ఈసడిం చేస్తుంటారు. ఇది తెలుగు వారి మర్యాదల్లో ఒకభాగం అనుకోండి -

ఇలాగే ఒకావిడ భోజనానికి వెళ్ళింది చుట్టాలింటికి. వడ్డనలైనాక తింటూ వుండగా ఎవరో అడిగారు. మీవారు రాలేదేమండీ - అని ! పాపం ఆయనగారికి విరేచనాలౌతున్నాయని ఆయన హాజరు కాలేకపోయారన్న సంగతి అన్నం తినేటప్పుడు ఎలా చెప్తుందీ ఆవిడ... ? ఒంట్లో బావుండ్లేదండీ... అని వూరుకుంది. ఏమయిందీ-" అని రెట్టిచారు ఇంకెవరో. అసలు సంగతి చెప్పక తప్పదు ఆవిడకి. ఎలా చెప్పటం...? ఆలోచించింది - అంది కదా...

"పూర్వాషాఢలైనాయి - అందుకు రాలేదు" అని !

ఆ ప్రశ్న అడిగిన వాళ్ళికి అందులో రహస్యం అర్థం అయ్యింది. ఇతరులకు ఇబ్బంది కలగలేదు.

పూర్వాషాఢ నక్షత్రానికి వరుణుడు అధిదేవత. వరుణుడు అంటే జల దేవత కదా ! నీళ్ళ విరేచనాల్ని ఇలా సమన్వయించి చమత్కరించింది ఆ ఇల్లాలు.

# తద్దినం పెట్టేవాడి తమ్ముడు

ఇంటికి పెద్దవాడు తద్దినం పెడ్తుంటే అతని తమ్ముడో తమ్ముళ్ళో పక్కనే కూర్చుని చెయ్యి తిప్పుతుంటారు.

నామమాత్రుడు, ఉపయోగం లేనివాడు, అధికారాలు లేనివాడు - ఇలాంటి వాళ్ళ గురించి చెప్పడానికి ఈ మాటని వాడ్తుంటారు.

మేక మెడచన్ను లాంటి వాడంటే మోటుగా వుంటుంది కదా !

# సత్పదార్థం

"ఇవ్వాళ వంటలో సత్పదార్థం ఏమిటీ - ?" కుతూహలంగా అడిగాడు భర్త.

ఆమె వంట చేస్తే తగలడినట్లే వుంటుంది - అందులో తినదగినది ఏమైనా వుందేమో చెప్పమనేది ఆయన వ్యంగ్యం. పైగా ఈయనగారు వచ్చేసరికే ఆవిడ భోజనాది కార్యక్రమాలు ముగించే వుంటుందని కూడా నమ్మకం. అందుకని వున్నదాంట్లో బావున్నది వడ్డించమని 'సత్పదార్థం ఏమిటి ?' అనడిగాడు.

ఆమెకు వ్యంగ్యం అర్థం అయ్యింది. తడుముకోకుండా 'రామరసం' అని చెప్పి వూరుకొంది. సత్పదార్థం - చెడని పదార్థం రామనామం ఒక్కటే... పిబరే రామరసం - ఈ పూటకు చారు అన్నంతో కడుపునింపుకోండి - రామజపం చేయండి - అని !!

సదరు భర్తగారు మళ్ళీ ఆ ప్రశ్నవేసి వుండరు.

# అసావాదిత్యో బ్రహ్మా

సంధ్యావందనాన్ని చేసేటప్పుడు ఈ వాక్యాన్ని ఉచ్చరించి తలచుట్టూ చెయితిప్పి ముక్కును తాకుతారు.

సూటిగా కాకుండా డొంక తిరుగుడుగా మాట్లాడే వాళ్ళని 'అసావాదిత్యో బ్రహ్మ' వాదులని వ్యవహరిస్తారు. దానిలో అసలు అర్థాన్ని మనం అర్థం చేసుకోవాలి.

# తస్కరణాంపతయే నమః

ఇంట్లో దొంగతనం జరగింది. పోకూడనిదంతా పోయింది. ఇంటివారు పుట్టెడు దుఃఖంలో వుండగా మధ్యలో పోలీసుల ఇబ్బంది ఎక్కువ య్యింది. వారి డ్యూటీలు, వారి ప్రయోజనాలు వారికుంటాయి కదా...

పూటకోసారి ఎస్.ఐ. గారు రమ్మన్నారంటూ స్టేషన్ కబురు – పోయింది దొరుకుతుందో లేదో గానీ, స్టేషన్ చుట్టూ ప్రదక్షిణాలు ఏమిటో అర్థంగాలేదు ఆ ఇంటాయనకి !

'తస్కరణాం పతయేనమః !' నన్నొదిలేయండి – అన్నాడు.

నమకం మంత్రంలో వచ్చే వాక్యం ఇది.

పోయిన వస్తువు దొరకదు – అని నిర్ధారణకు వచ్చాక తస్కరణాంపతయే నమః అనేస్తారు.

దొంగ గారు నమస్కారం –

# ఇంద్రాణి

ఆవిడకేమండీ... ఇంద్రాణి – అని పొగిడితే, వెధవ ముం... అని తిట్టినట్టు!

ఇంద్రాణీ వావిధవా... అని తైత్తిరీయబ్రాహ్మణం చెప్తుంది. ఇంద్రుడి భార్య ఇంద్రాణి ఎన్నటికీ విధవ కాదు – ఇంద్రుడికి అపజయం లేదనేది దీని అర్థం.

దానికి, ఇంద్రాణీ (వా) – విధవా – అనే వ్యతిరేకార్థం తీసి, ఇలా గుంభనగా తిడ్తారన్నమాట శత్రువుల్ని ! "ఆవిధవ" – విధవగా మారిపోయింది.

# ఏషాగాథలు

ఇచ్చకం మాటల్ని ఏషాగాథలని మనవాళ్ళు వ్యంగ్యంచేసి అంటుంటారు నిజానికి, బ్రాహ్మణాలలో పూర్వగాథల్ని ఏషాగాథలంటారు.

ముఖప్రీతి కోసం పొగడవలసివచ్చినపుడు వారి చరిత్రల్ని కీర్తించి, వారిది

సూర్యవంశమో, చంద్రవంశమో అంటూ లేనిపోని అర్హతలన్నీ అంటగట్టే పొగడ్తల్ని ఏషాగాథలని వ్యంగ్యంగా అంటుంటారు మనవాళ్ళు.

పనిమానేసి ముచ్చట్లాడుకోవడాన్ని కూడా ఏషాగాథలంటారు.

"ఓయి ! చాలించరోయి మీ జగడాలు - నగరివారు ముహూర్తం నిర్ణయించుకుంటే ఏషాగాథలాడుచున్నారు -" అని మన్నారుదాస విలాసం గ్రంథంలో ప్రయోగం వుంది.

# యద్దేవా

హేళన చేయడానికి మనం తరచూ వాడే పదం ఇది. నిఘంటువుల్లోకి ఎక్కిన ఈ పదం ఇప్పటిదాకా మనం చర్చించుకున్న ఈ క్రొత్త భాషలో ఇలా రూపొందించిందే.

"యద్దేవా దేవ హేళనం" అనే మంత్రాన్ని బట్టి ఈ పదం పుట్టింది.

హేళన అనే మాట వుంది కాబట్టి యద్దేవా దేవ హేళనం మంత్రాన్ని గుర్తుచేస్తూ 'యద్దేవా' చేశాడని అనడం మనవాళ్ళకు అలవాటయ్యింది !

"ఎద్దేవా" అనేది వాడుకలో వున్న పదం.

# "యం బ్రహ్మ"

పిసిని గొట్టుని ఈ పేరుతో పిలుస్తారు.

"యం బ్రహ్మ బ్రహ్మగుప్తయే -" అనే మంత్రాన్ని బట్టి, గుప్తంగా డబ్బు దాచుకొనే వాళ్ళని ఈ మాటతో వెక్కిరిస్తారు.

బాగా ఎక్కువ డబ్బు గడించి, పిల్లికి బిచ్చం వెయ్యని వాణ్ణి, నిర్దయుణ్ణి, మానవత్వం లేనివాణ్ణి 'బ్రహ్మగుప్త' - ఎక్కువ పిసినిగొట్టు అంట రు.

మళ్ళీ బ్రహ్మగుప్త అంటే ఆయనకు అర్థం అయిపోతుందని 'యం బ్రహ్మ' గారు అనేసి ఊరుకొంటారు. వినేవాళ్ళకి అసలు సంగతి తెలిసిపోతుంది.

# ఆధ్వర్యవం

నిఘంటువుల్లోకి ఎక్కి అందరి చేత వాడబడుతున్న ఈ పదం ఇప్పటిదాకా మనం చెప్పుకున్న ఈ కొత్త భాషలోంచి పుట్టిందే !

యజ్ఞంచేసే యజమానిని అధ్వర్యుడు అని వ్యవహరిస్తారు.

అధ్వర్యుని ఆధ్వర్యవంలో క్రతువులు జరుగుతాయి.

యజ్ఞయాగాది కార్యక్రమాలకు సంబంధించిన ఈ పదం క్రమేణా కర్ర పెత్తనం చేయడం అనే వ్యంగ్యార్థంలోనూ, నిర్వహించడం అనే సజావు (Positive) అర్థంలో కూడా వ్యవహారంలో స్థిరపడింది.

"ఇందంతా ఆయన ఆధ్వర్యంలోనే జరుగుతోంది" అంటే ఈ నిర్వాకం అంతా ఆయనదేనని, ఆయన ఎవరు చెప్పిందానిని వినిపించుకోవటం లేదని అంతా అస్తవ్యస్తంగా వుందని గూడార్థం కూడా కావచ్చు.

యజమాని అనే మాట కూడా యజ్ఞయాగాలు చేసే గృహస్థు అనే అర్థంలోంచి, బార్బర్‌షాప్ యజమాని, మాంసం కొట్టు యజమాని అనే అర్థాల్లోకి మారిపోయింది.

# "అయమోదనం"

ఇది కూడా 'దేభ్యం' లాంటి తిట్టే !

'అయమోదనా మిత్యేకైక పిండమాదాయ' అని తద్దిన మంత్రాలలో వస్తుంది. మీ సంతోషం కోసం, ప్రీతికోసం మీకోసం మా యీ పిండాన్ని ప్రదానం చేస్తున్నామని ఆ మంత్రం సారాంశం.

తిండి దొరుకుతుందంటే చాలు ఎగేసుకుని వెడతాడని చెప్పటానికి 'అయమోదనం' అనే మాటని వాడతారు. ఈ అయమోదనం అనదగినవాడు, తిండికి తిమ్మరాజు, పనికి పోతరాజు లాంటివాడు !

# అగస్త్యులవారి తమ్ముడు

"వీరు సాక్షాత్తూ అగస్త్యులవారి తమ్ముడు-" అన్నాడంటే అడ్రసు లేని మనిషి, బికారి, బేవార్సు అని అర్థం.

అగస్త్యుడికి తమ్ముళ్ళు లేరు. మరి వీడెక్కడినుంచి వచ్చాడు – అంటే, అడ్రసు లేనివాడన్నమాట.

# స్వాహా

తినేశారు అనే అర్థంలో వాడకంలో వున్నమాటే ఇది ! మంత్రాలు రాని ఓ పంతులుగారు "కర్రాయస్వాహా, కంపాయస్వాహా, చెరిసగాయస్వాహా అని, ఇంకో పంతులుగారితో "ఇద్దరం కలిసి చెరిసగం పంచుకొందాం" అనే అర్థంలో అన్నాడట!

# దర్భపోటు

ఇవ్వాళ దర్భపోటు తగిలిందోయ్ – బైటకి రాలేను – అంటే, తద్దినం భోజనానికి వెళ్ళి భుక్తాయాసంతో అవస్థ పడ్తున్నాడని అర్థం. రక్తపోటు లాగా దర్భపోటు అనే మాట గమ్మత్తుగా వుంటుది ! కర్షపోటు కూడా ఇలాంటి మాటే!

# త్రాష్టుడు

ఇది పెద్ద తెలుగు తిట్టు.

త్వష్టుడు ఋగ్వేదంలో ఇంద్రుడికి ప్రథమ శత్రువుగా చాలా చోట్ల కనిపిస్తాడు. వృత్రాసురుడు, త్వష్టుడు, పణులు - వీరంతా ఇంద్రుడికి శత్రువులే.

'త్వాష్ట్రాః పశవః' అనే మంత్రం కూడా వుంది. ఈ మంత్రాన్ని బట్టి పశువులాగా అమానుషంగా ప్రవర్తించేవాణ్ణి 'త్వష్టుడు' అనే వారు కాబోలు - అది కాలక్రమేణా త్రాష్టుడుగా మారి వుండవచ్చునని కొందరు పెద్దల అభి ప్రాయం.

# సంభావనలు

క్రతువు చేయించినప్పుడు ప్రతిఫలంగా ఎంత సంభావన ముట్టిందో రహస్యంగా ఒకరికొకరు చెప్పుకోవడానికి కొన్ని మారుడు పదాలున్నాయి.

| | | |
|---|---|---|
| ఆభరణం | = | బేడా |
| నక్షత్రం | = | పావలా |
| తదర్ధం | = | అర్ధరూపాయి |
| శుభ్రం | = | రూపాయి |
| శివనేత్రాలు | = | మూడు రూపాయలు |
| ప్రత్యామ్నాయగోదానం | = | ఆరు రూపాయలు |
| దశావతారాలు | = | పది రూపాయలు |

పడవ గుర్తు, పంచపాండవులు, పచ్చనోటు ఇవన్నీ ఆధునిక కాలంలో కూడా కరెన్సీ నోట్లకు మారుడు పేర్లే !

# అంకురార్పణ

ఇదికూడా విస్తారంగా ఆధునిక కాలంలో వ్యాప్తిలో వున్న కొత్తభాషా పదమే!

ఏ శుభకార్యం తలపెట్టినా మొదట నవధాన్యాలు చల్లి, మొక్కలు మొలి పించడం భారతీయుల సాంప్రదాయం. అదీ అంకురార్పణ అంటే !

వ్యవసాయాధారిత దేశంలో ఇలాంటి అలవాటు వుండటంలో ఆశ్చర్యం లేదు - ఇప్పుడుకూడా ఏదైనా ఘనమైన కార్యక్రమం జరుగుతున్నప్పుడు దాని గుర్తుగా ఒక మొక్కను నాటితే నిజమైన భారతీయత అనిపించుకుంటుంది కదూ...!

కార్యక్రమాలకు శ్రీకారం చుట్టడం, హరిః ఓం అనడం ఇలా - ఓమంచి పనిని ప్రారంభిస్తున్నాం అనడానికి శుభసూచకంగా ఉపయోగించే పదాలవంటిదే 'అంకురార్పణ' కూడా !

నిజానికి శుభానికి ఈ పదాన్ని చక్కగా వాడుతున్నాం మనం.

అయితే వ్యంగ్యార్థంలో జగడాలు మొదలయ్యాయి. కలహాలు పుట్టాయి అనడానికి కూడా అంకురార్పణ జరిగిందనీ, అంకురారోపణ జరిగిందనీ వ్యవహరిస్తుంటారు.

# శన్నోదేవీ

ప్రొద్దున్నే ఏం తిన్నావ్ ? అనడిగాడు ఓ మిత్రుడు

"ఏముంది ? శన్నోదేవీ !" అని జవాబిచ్చాడు ఆ పెద్దమనిషి

ఎంత బుర్ర నిమురుకున్నా ఈ సమాధానం ఏమిటో అర్థంకాదు.

ఒక్కొక్క మంత్రం చదివేటప్పుడు ఒక్కొక్క పని చేస్తారు. శన్నోదేవీ - అనే మంత్రం చదివేటప్పుడు పాలు పోస్తారు. అంటే, ఈ పెద్దమనిషి ప్రొద్దున్నే గ్లాసు పాలు మాత్రమే త్రాగానని చెప్తున్నాడన్న మాట.

# "ఏతత్సామగాయన్"

ఏదైనా పని అయ్యిందా అనడిగితే, లేదని చెప్పడానికి ఈ మాట వాడతారు. "ఏతత్సామ గాయన్నాస్తే" అనే మంత్రంలో "నాస్తి" అనేమాట ముందుకొచ్చి "ఏతత్సామ గాయన్" అనటంగా మారింది. ఆయన సామగీతం పాడుతున్నాడంటే, లేదని తేల్చిచెప్పేశాడని అర్థం !!

# అశ్మాచమే

"అంత కష్టపడ్డావు - ఏమాత్రం ముట్టచెప్పారేమిటి - ?" అనడిగితే-

"అశ్మాచమే" అని సమాధానం చెప్పాడు !

ఈ సమాధానం కూడా మామూలు వాళ్ళకి ఏమాత్రం అర్థం కాదు-

'అశ్మాచమే - మృత్తికాచమే -' అని నమకం, చమకం చదివేటప్పుడు వచ్చే పదాలివి. మృత్తిక అంటే, 'మట్టి' అనే అర్థాన్ని ఆపాదించి 'అశ్మాచమే' అంటే వృథాప్రయాస అని చెప్పుకుంటూ వుంటారు.

తెలుగువారి వ్యంగ్య వైభవానికి ఇవి సాక్ష్యాలు మాత్రమే !

# ఓం భూః

నిమ్మకు నీరెత్తినట్లు కూర్చున్నాడు అంటే, చేయవలసినవన్నీ చేసేశాడు అనే మాటని వ్యంగ్యార్థంలో ప్రయోగిస్తూ "ఓం భూః అని ముక్కు మూసుకుని కూర్చుంటే పిల్ల పెళ్ళి ఎలా అవుతుంది -?" అని సాధిస్తుంది ఇంట్లో ఇల్లాలు.

# 'ప్రాచీనావీతి'

ప్రాచీనావీతి అన్నప్పుడు జంధ్యాన్ని అపసవ్యంగా వేసుకుంటారు. అలాగే అపసవ్యమైన పనులు చేసే వాడినీఅవునంటే కాదనే మూర్ఖుణ్ణీ, చేయొద్దన్నవి చేసేవాడిని 'ప్రాచీనావీతి' అని తిడుతుంటారు –

ఈ ప్రాచీనవీతి "చండిక" లాంటివాడన్నమాట ! అలాంటి పనుల్ని ప్రాచీనావీతి పనులు అనికూడా అంటుంటారు –

# కైంకర్యం

దేవుడికి చేసే సేవల్ని కైంకర్యం అంటారు. దొంగతనానికి హాచ్యార్థంగా దాన్ని మనవాళ్ళు మార్చి పారేసారు.

ఏ గుడికెళ్ళినా కొబ్బరి చిప్పలు తదితర సామగ్రిని సగానికి సగం లోపల వేసుకుంటారు కదండీ... అంతా కైంకర్యమేనని కాబోలు – అందినంత అందిపుచ్చుకోవటాన్ని కైంకర్యం చేయడం అంటుంటారు.

ఇదీ ఇలా రూపొంది నిఘంటువులకెక్కిన పదమే !

# కృపారసం

కొందరు మాట్లాడుతుంటే ఎదురు వరుసలో కూర్చున్న వాణ్ణి తమ నోటితుప్పర్ల జల్లులో తడిపేస్తుంటారు.

ఇలాంటి వాళ్ళని పోతనగారి పద్యభాగం "కృపారసంబు పై జల్లెడు మోమువాడు" అని ఆప్యాయంగా పిలుచుకుంటూ వుంటారు. నోట్లోంచి చొల్లు కార్చుకునేవాడు, నోటి తుప్పర్లు అదుపు చేసుకోలేనివాడని చెప్పటంకోసం !

'పద్మ నయనమ్ముల వాడు' అని కీర్తించడం అంటే, సల్లని వాడు అని ఎద్దేవా చేయడమే !

# తద్దినం

'దినాలలో కెల్లా ఉత్తమ దినం తద్దినం' అని తెలుగు సామెత.

మృష్టాన్న భోజనం దొరుకుతుంది. గారెలు, బూరెలు, పరమాన్నం, నువ్వుపొడి, వేపపూల పచ్చడి, నెయ్యి – రకరకాల కూరలు... తలుచుకొంటేనే తద్దినం భోజనం ఆకల్ని రేపుతుంది భోజన ప్రియులకు. 'మృష్టం' అంటే స్వచ్ఛమైందని !

కానీ, తినే వాడికి భుక్తాయాసంగా వుంటుంది గానీ, తద్దినం పెట్టిన వాళ్ళకి మాత్రం ఇదెక్కడి ఖర్మరా దేవుడా... అనిపిస్తుంది... ఖర్చును తట్టుకోవాలి కదా...

పితృ దేవతలు తింటారో లేదో మతపరమైన నమ్మకానికి సంబంధించిన విషయం. దానికోసం తరచూ బోలెడంత ఖర్చుపెట్టవలసి రావటం, సమయం వెచ్చించటం, అనేక ఇబ్బందులు పడటం - ఇవన్నీ ఎందుకొచ్చిన తద్దినం ఇదంతా అని కొందరికి అనిపించవచ్చు.

"తద్దినంలా వచ్చి పడింది"

"వీడో తద్దినం అయ్యాడు నానెత్తిన"

"ఇంకో తద్దినం వుంది అప్పుడే కష్టాలు పూర్తికాలేదు"

ఇలాంటి ప్రయోగాలు ఇప్పటికీ బాగానే వ్యాప్తిలో వున్నాయి.

తండ్రికి తద్దినం పెట్టవేమిరా అంటే, తద్దినాలు మాకు అచ్చి రాలేదని అనగలవాడు నిజంగా మొనగాడే !!

# సమిధలు వేయడం

"ఆయన కూడా నాలుగు సమిధలు వేశాడు" అంటే, అగ్ని రాజిల్ల చేశాడనీ, తగువుని పెరిగేలా తోడ్పడ్డాడని, శకుని పాత్ర పోషించాడనీ అర్థం !

# వ్రతానా ముత్తమమ్ వ్రతమ్

ఎప్పటికయ్యేది ప్రస్తుతమో అయ్యేది పలుకుతూ పబ్బం గడుపు కోవడాన్ని వెక్కిరిస్తూ "వ్రతానామ్ ఉత్తమమ్ వ్రతమ్ - అంటుంటారు.

"వ్రతానాముత్తమమ్ వ్రతమ్ అన్నట్లు ఆయన మాత్రం చెయ్యగల్గిందేముంది? నలుగురితో పాటు నారాయణ" అని అటుండే వారు కాబోలు !

# పశవస్సు

ఇది పురుషావయవాన్ని సూచించే అర్థంలో వ్యంగ్యం కోసం ఈ పదాన్ని సరదాగా ప్రయోగిస్తుంటారు.

'పశవస్సు జంభం' అని 'అన్న సూక్తం' లో వస్తుంది. దాన్ని బట్టి ఈ మాట వాడకంలోకి వచ్చింది.

అపరిచిత స్త్రీలతో ఎక్కువ చనువుగా వుండేవారిని హెచ్చరించడానికి 'పశవస్సు జాగ్రత్త !' అనే వారు.

'పథ్యా ముదరేణ శిశ్నా' అనే మంత్రం కూడా ఇలానే వ్యంగ్యానికి గురైంది.

# అల్పాచమనం

మూత్రానికి వెళ్ళివచ్చిన తరువాత కాళ్ళూచేతులూ కడుక్కొని, మళ్ళీ ఆచమనం చేయడం మనసాంప్రదాయం.

'ఆచమనం' అనే అనాలి. వాడుకలో ఆచమానం చేసేశాం.

భోజనం చేసేప్పుడు పెద్ద ఆచమనం, ఇలాంటప్పుడు చిన్న ఆచమనం చేయడం అని భావించే వారు కాబోలు – 'అల్పాచమానం' అనే మాటని సృష్టించారు.

ఈ ప్రయోగం సంస్కృత భాషలోనే జరిగింది.

టాయిలెట్‌కి వెళ్ళడానికి బదులుగా అల్పాచమానంకి వెళ్ళడం అని, 'ఆ పెద్దఆయన్ని చూసేసరికి వాడు లాగులో అల్పాచమానం చేశాడు' అనడం వంటివి తెలుగువారికి బాగా అలవాటు.

# అరుంధతి నక్షత్ర ప్రయాస

అరుంధతి నక్షత్రం రాత్రిపూటే సరిగా కన్పించదు. ఆ నక్షత్రాన్ని చూపించేవాళ్ళక్కూడా ఎంతమందికి అది తెలుసో సందేహమే ! దాన్ని పగటిపూట కూడా చూపించే ప్రయత్నాలు నవ్వు పుట్టించేవిగా వుంటాయి.

వ్యర్థ ప్రయత్నాన్ని అరుంధతీ నక్షత్రం చూడడంతో పోల్చి తిడ్తుంటారు.

"అరుంధతి లేదు – గిరుంధతీ లేదు – నా రంధి అంతా పెళ్ళికూతురు అప్పమీదే వుంది అన్నాడట ఓ పెద్దమనిషి ! అది వేరే సంగతి !

# నాందీ పలకడం

నాట్య నాటకాది కళలలో నాందీ ప్రస్థావన ఇవి వుంటాయి. ఈ నాందీ వేరు తొందరపాటు నిర్ణయాల్ని, ఆరంభశూరత్వాన్నికూడా 'నాందీ పలికేశాడు' అని వ్యంగ్యంగా మాట్లాడే అలవాటు తెలుగువారికి వుంది.

ఇందుకు కారణం వుంది –

తద్దినాలు, ఉపనయనం వంటి వైదిక పరమైన కర్మలు జరిగేప్పుడు 'నాందీ ముఖశ్రార్ధం' అనే ప్రక్రియ జరుగుతోంది. ఇందువలన పితృదేవతలు సంతృప్తి చెందుతారని నమ్మకం.

ఏదైనా మంచి పనిచేసే ముందు పితృదేవతలను స్మరించుకోవడం మంచి విషయమే కదా – అందుకని నాందీ ముఖ శ్రాద్ధం పెడుతుంటారు.

'నాందీ పలికేశాడు' అనేది దీనికి వ్యంగ్యం. నాందీ పలుకుతాడు కాని పనిని పూర్తిచేయడని వ్యంగ్యంగా చెప్పడంకోసం ఈ మాటని వాడుతుంటారు.

# అవధ్యుడు

'అవాట్' అనే వేద శబ్దానికి హవిస్సుల్ని తీసుకువెళ్ళి, ఆ దేవతలకు అందించేవాడు - అని అర్థం. ఒక విధంగా ఇది పోస్టుమాన్ డ్యూటీ ! 'అగ్ని' ఈ బాధ్యత నెరవేరుస్తాడని హవిస్సుల్ని అగ్నిలో వ్రేలుస్తారు.

ఇది వేదవిధి గురించిన విషయం. అదలా వుంచండి -

యాగాది క్రతువులు చేసేప్పుడు మంత్రాలు సరిగా రానివాణ్ణి, అవీ ఇవీ అందించేందుకు, చేతిక్రింద మనిషిలాగా ఉపయోగించుకుంటూ వుంటాడు.

అయోగ్యుడు - అంటే మంత్రాలు సరిగా రానివాడు - కాబట్టి !

'అవాట్' లాగా అందించేవాడు కాబట్టి అవధ్యుడు అనే పదాల్ని పుట్టించారు మనవాళ్ళు !

ఇక్కడితో ఈ వ్యంగ్యం ఆగలేదు -

మాటలు మోసేవాడు, చెంచాగిరి చేసేవాడు - అంటే అర్థం అయ్యింది కదా... అలాంటి వాడ్ని 'అవధ్యుడు' అంటారు తెలుగువారు. ఇక్కడికిది పెద్దతిట్టే మరి !!

# క్షేత్రాణాం పతయేనమః

"వచ్చినపని ఏమయ్యింది - పని పూర్తయ్యిందా..." అనీ అడిగారను కోండి, మన ఊరొచ్చిన అతిథిని -, 'అవలేదు - ఇంకొన్ని రోజులు ఇక్కడే వుంటే తప్ప అయ్యేలా లేదు' అని సమాధానం చెప్పవలసి వచ్చినప్పుడు "క్షేత్రాణాం పతయేనమః" అంటాడు.

'మీ ఊరికో నమస్కారం' అనడంలాంటిది !

వేదక్రతువుల్లో క్షేత్రపతికి నమస్కారం చేసేప్పుడు ఈ మాటని వాడతారు.

# ఆరోహోరు

ఆరోహోరు అంటే కౌగిలింత !

'ఇదెక్కడి అర్థం అని ఆశ్చర్యపోకండి - ఇది కూడా వ్యంగ్యం వైభవానికి సంబంధించినదే !

'ఆరోహోరు ముప బర్హస్వ బాహుం' అనే మంత్రాన్ని బట్టి ఈ పదాన్ని కౌగిలించుకోవడం అనే అర్థంలో సరదాగా వాడుతుంటారు.

'అయ్యగారు ఆరోహోరులో వున్నారు' అంటే అర్థం విడమరచనవసరం లేదుకదా !

# పారమాత్మిక మంత్రం

వైభానస కల్పసూత్రంలో ఇంకెక్కడాలేని పారమాత్మిక మంత్రం అని కొన్ని అనువాకాలున్నాయి. ఎంత వేదపండితుడికయినా వైఖానసుడు కాని వాడికి ఇవేవీ తెలియవు. అందుకని పరాయివాడు వచ్చినప్పుడు హెచ్చరికగా "పారామాత్మిక మంత్రం చదవ్వోయ్" అంటాడు.

అంటే, శత్రువర్గం వాడున్నాడని, అవతలి వాడికి తెలియకుండా జాగ్రత్తగా మాట్లాడమని, నోరుజారి రహస్యాలు చెప్పవద్దనీ దీని అర్థం !

# తొమ్మిదో అట్టం పారాయణం

'అట్టం' అంటే, అష్టకం – అని ! తొమ్మిదవ అట్టంలో తద్దినం మంత్రాలు వుంటాయి – బూతులు తిట్టడం, చంపేస్తాన్, నరికేస్తాన్ లాంటి తిట్లు ప్రయోగిస్తున్నాడని చెప్పడానికి తొమ్మిదో అట్టం పారాయణం చేస్తున్నాడంటారు.

# "మాలోకం"

అంతా కళ్ళముందే కనిపిస్తున్నా గుర్తించలేని అమాయకుణ్ణి మాలోకం అంటుంటారు.

'లోక్యతా సర్వ మస్మిన్నితి లోకం' అని నిర్వచనం. సర్వం దీనిలో కన్పిస్తుంది కాబట్టి దీన్ని లోకం అంటారు. అది పరమేశ్వరుని ప్రతిబింబ దర్పణం. కానీ

కళ్ళున్న వాళ్ళంతా చూస్తున్నారా ?
చెవులున్న వాళ్ళంతా వింటున్నారా ?
నోరున్న వాళ్ళంతా తింటున్నారా ?
మంచానికి కూడా కాళ్ళున్నాయి.
గంగాళానికి చెవులున్నాయి.

అక్షయపాత్రకి నోరుంది. ఇవన్నీ వుండవలిసింది లోకానికి. కాని, ఈ వస్తువులకి కాదు కదా... ఇలా 'మాలోకం' అన్పించుకుంటాడు ! అన్నీ వున్నా దేన్నీ ఉపయోగించ లేనివాడు, అయోగ్యుడు, అమాయకుడు 'మాలోకం' అనిపించుకున్నాడు తెలుగువారి నోట్లోపడి.

# తృప్తాస్థ

శ్రాద్ధప్రకరణంలో తృప్తాస్థ అనే మంత్రం వుంది. దాన్ని దృష్టిలో పెట్టుకుని – పెట్టింది చాల్లేదనీ, ఇచ్చింది తక్కువని చెప్పటానికి ఈ 'తృప్తాస్థ' పదం వాడతారు!

# దేవాదేవేషు

తన్నులాట అయ్యిందనీ, దెబ్బలు తగిలాయనీ చెప్పడానికి ఈ పదాన్ని వాడతారు. దీని వెనక ఓ కథ వుంది.

ఓ గృహస్థుడికి వేదం చదూకున్న పెద్ద అల్లుడు సంస్కృతం చదూకున్న చిన్నఅల్లుడు వున్నారట.

పెద్ద అల్లుడికి వాకిట వరండాలో చాపవేసి, చిన్నఅల్లుడికి గదిలో మంచం మీద పడకలు వేశారు.

పెద్దల్లుడు లోపల్లోపల ఉడికిపోతున్నాడు. అయినా తమాయించుకుంటున్నాడు.

చిన్నల్లుడికి అతిమూత్రం వుందేమో - మధ్యరాత్రి మాటి మాటికి తలుపు తీసుకుని బయటకువెళుతూ షడ్డకుడి చేయితొక్కి 'క్షమధ్వం' అనసాగాడట.

బయటకు వెళ్ళిన ప్రతిసారీ, 'క్షమధ్వం' (క్షమించండి) అంటుండేసరికి చిర్రెత్తిపోయింది పెద్దఅల్లుడిగారికి !

దేవాదేవేషు శ్రయధ్వం, ప్రథమా ద్వితియేషు శ్రయధ్వం అంటూ చిన్నఅల్లుడి పిలకపుచ్చుకుని జపేటాఘాతాలు తగిలించాడట.

వేదపండితుల ఇళ్ళలో ఈ కథ బాగా ప్రాచుర్యం !

అందుకని , అయినవాళ్ళు తగువులాడుకొంటున్నప్పుడు 'దేవాదేవేషు అయ్యింది' అనే అలవాటు ఏర్పడింది ! బంధువుల మధ్య తగువులాటని ఈ మాట సూచిస్తుంది.

# ద్రాపి

కళ్ళుండి చూడలేనివాడిని ఈ పదంతో తిడతారు !

'నమస్తే ద్రాపే అన్ధసస్పతి' అనే మంత్రాన్ని బట్టి ఈ అర్థాన్ని సృష్టించారు. 'అన్ధసస్పతి' అయిన ద్రాపికి నమస్కారం అని భాష్యం చెప్పి, మూర్ఖుడ్ని, వాస్తవాలు తెలుసుకోనివాడ్ని 'ద్రాపి' అని తిడుతుంటారు !

# త్రిపాది

గాలికి తిరిగే మనిషిని, పనీ పాటా లేనివాడు చదువు సంధ్యాలేకుండా ఆడపిల్లల వేటలో పడ్డవాడు - ఇలాంటి వాడ్ని ఈ పదంతో తిడతారు -

'త్రిపాదూర్ధ్వ ముదైతే పురుషః' అనే మంత్రాన్ని బట్టి ఈ వ్యంగ్యార్థం ఏర్పడింది.

ఆకాశంలో త్రిపాది నక్షత్రం చాలా వేగంగా తిరుగుతుందట !!

# దేభ్యం

దేభ్యం గురించి కూడా చర్చించుకోవాల్సింది వుంది.

అసదు, గరిబేసి, దేబె, దేవురుగొట్టు, బికారి పదాలలో వున్న దీనుడు లాంటివాడే ఈ దేభ్యం.

దేబె అనే తెలుగు మాట గాని, 'ఏభ్యం' అనే సంస్కృత పదం గానీ నిజానికి 'దేభ్యం' అనేమాట పుట్టడానికి కారణం కాదు.

'దేభ్యం' అనే పదం వేద పండితులు చేసిన ఒక చమత్కారం.

వైదిక పదాలతో బాగా పరిచయం వున్నవారికి ఈ చమత్కారంలో వున్న 'సొబగు' బాగా అర్థం అవుతుంది.

"తేభ్యశ్చాయం పిండః" అని శ్రాద్ధకర్మ చేసేప్పుడు ఓ మంత్రాన్ని చదువుతారు. "ఈ పిండం మీ కోసమే! పితృదేవతలారా! రండి!" అని ఆహ్వానిస్తూ ఈ మంత్రాన్ని ఉచ్చరిస్తారు.

మనుషుల్లో – తిండికి మాత్రమే ముందు తయారయ్యే వాళ్ళు చాలామంది వుంటారు. 'పని' అనేసరికి పత్తా వుండరు. ఇలాంటి పని సున్నాలైన తిండిపోతుల్ని వెక్కిరించడం కోసం, ఇలాంటి వాడు భోజనానికి రాగానే "తేభ్యశ్చాయం పిండః! రండి!!" అనేవాళ్ళు క్రమేణా "తేభ్యశ్చ" అనేసి వూరుకోవడం మొదలుపెట్టి వుంటారు. "తేభ్యశ్చ... గారొచ్చారు ! రండి!" అని !

ఈ "తేభ్యశ్చ" పదమే వ్యవహారంలో 'తేభ్యం' అనే పదంగా మారింది!

తిండికి ముందుండేవాడు తేభ్యం. వీడే 'దేభ్యం'గా జన వ్యవహారంలో మిగిలాడు.

వైదిక పదాలలో కొన్ని ఇలా అర్థ విపర్యయాన్ని పొంది మంచి చమత్కారాన్ని సాధించినవి ఇంకా చాలా వున్నాయి. అవకాశాన్ని బట్టి ఒక్కోమాట గురించి విడివిడిగా ముచ్చటించుకుందాం !

వీటిలో ఎక్కువ మాటలు ఒక వర్ణానికి చెందిన వ్యక్తులు అత్యంత రహస్యంగా, ఇతరులకు తెలియకుండా తమలో తాము మాట్లాడుకోడానికి తయారుచేసుకున్నవే ! అయినా వేళ్ళ సందుల్లోంచి వెలుతురు దూసుకు వచ్చినట్లు చాలా మాటలు జనసామాన్యంలోకి చేరిపోయి నిఘంటువుల్లోకి కూడా ఎక్కాయి. దేభ్యం యిలాంటిదే!

# తిండిపోతు

వడ్డించేవాడు పిసినిగొట్టైనా, తినేవాడు తిండిపోతైనా మంచి హాస్యం పండుతుంది. జగన్నాథరావుగారు రాసిన సరదాగా పాడుకునే ఓ హాస్యపు పాటలో తిండిపోతు పడ్డ అవస్థని గమనించండి.

'నా పప్పు దెబ్బతోపాటు ధప్పళంబు చోటుచేసి
అప్పడాలు నంచుకుంటూ అట్టెతిందు
నా గొప్ప పొట్ట దిష్టికొట్టకుండ శ్రీరామరక్ష
గొంతుదాకా తింటేగాని శాంతి వుండదు
ఓరి పిసినిగొట్టు పుల్లయ్య పెళ్ళి పెత్తనానికొచ్చి
కొసరి కొసరి నేతిబొట్టు కొంచమా
విస్సన్న చేతిలోది వల్లకాటి ధారీచెంబు
ఊదలాగి దొప్పనిండ వడ్డించవోయి
ఓరి వ్యాసులయ్యే కూరపళ్ళేమేదిరా అబ్బ
దాని కొసగూల చింతకాయ పచ్చడేదిరా
ఓరి తీసుకురారా బూరెల బుట్ట తాతగారి సొమ్ముగాదు
లస్కోరా లేకపోతే లడ్డూలు రెండై
నాకు విసుగెత్తి లెంపకాయవేసి చూపనా
బొబ్బట్లు దోసకాయ బద్దలు రెండెయ్యమని
బొబ్బలెత్తి మొత్తుకొంటిని
ఆ రుబ్బుతున్న ఊరుపిండి సిబ్బెడైతే చాలు నాకు
అబ్బ ఇంకెంత సేపని...
గారె అప్పచ్చి లేకపోతే ఆవడ ముక్కలు చప్పరించి
ఉప్పేసి పెరుగు లాగుతాను
దబ్బు దబ్బున తిని దొడ్డి సంభావనలో
డబ్బులు రెండేరుకుని దారితీసెదను -

అని ఆదరా బాదరా బండెడన్నం లాగించేయాలని తంటాలు పడ్డ ఈ తిండిపోతు ఇంతకీ బంతిలో కూర్చున్న వాడిలా కనిపించటంలేదు. ఏకంగా వంటగదిలోనే భోజనయాగం జరిపించేస్తున్నట్లున్నాడు. సరే ! ఇంతా జరిగాక ఇంటికొచ్చి ఆయన పడ్డ అవస్థ చూడండి -

'చింతకాయ ధప్పళం - పప్పువేసి కలపడం
చేతినిండ తియ్యడం - పొట్టనిండ వేయడం
కడుపునొప్పి రావడం - కోమటింటికెళ్ళడం
శొంఠికొమ్ము తేవడం - ఉప్పురాచి కాల్చడం
నమిలి నీళ్ళు మింగడం - అరుగు మీద దొర్లడం
కాశికాపురాధినాథా ! కాలభైరవం భజే !





తెలుగు పలుకుల తియ్యదనాన్ని తెలియచెప్పే

# మాటల ముచ్చట్లు

**డా॥ జి.వి. పూర్ణచంద్** BAMS

సాహిత్యం బతకాలంటే అది ప్రజలకు సంబంధించినదై వుండాలి. అది సమర్థుడైన కవి చేతిలో రాణింపు పొందాలి. తిరిగి అది ప్రజల్లోకి వ్యాప్తించాలి. ప్రజల్లోంచి ప్రజల్లోకి ఇలా ప్రసరిస్తుంది సాహిత్యం.

కానీ, నేటి కాలంలో ఈ మూడో అంకం దగ్గర తెలుగుభాషా ప్రసారం ఆగిపోయింధనిపిస్తోంది. అద్భుతమైన తెలుగు పదాల సంపద కొత్తతరం తెలుగువారికి సరిగా చేరడం లేదు.

అందుకు ఎవరు చెప్పే కారణాలు వారివి -

నలుగురు మిత్రులు సరదాగా మాట్లాడుకోవడానికైనా చాలినన్ని తెలుగుమాటలు ప్రస్తుతం ప్రచారంలో లేవు. వుంటే, తెలుగెందుకు మాట్లాడం?

తెలుగు పలుకుల తియ్యదనాన్ని తెలియచెప్పడం కోసం ఈ మాటల ముచ్చట్లు వెలువరిస్తున్నాను.

కమ్మగా మాట్లాడుకోవడానికి తెలుగు ఎంత బావుంటుందో గుర్తుచెయ్యాలని నా కోరిక. ఒక్కో మాట గురించిన ముచ్చట్లు ఎన్నో వున్నాయి. ముచ్చటించిన కొద్దీ మాటలు వెల్లువలై వస్తుంటాయి.

మన తెలుగుని ప్రేమించడం కోసం, మన తెలుగుని గౌరవించడం కోసం, మన తెలుగుని ఆరాధించడం కోసం, మనందరం తెలుగులో మాట్లాడుకోవడం కోసం ఒక్కపూట సమయం కేటాయించండి చాలు - ఈ పుస్తకం చదవడం పూర్తిచేయగలరు-

ప్రతి తెలుగు మాట గురించీ గంపెడన్ని ముచ్చట్లున్నాయి - చెప్పుకోవడానికి. అవకాశాన్నిబట్టి తరువాయి భాగాల్లో మరిన్ని మాటలు ముచ్చటిద్దాం. జివి


Ph.: 0866-2436936



వి యల్ యన్ పబ్లిషర్స్

బావాజీపేట, విజయవాడ - 520 003.

